

# అది వృత్తి సంబంధమే!

## -జాక్వెలిన్ ఫెర్నాండెజ్

**విదేశీ భామలు బాలీవుడ్‌లో రాజ్యమేలడం కొత్తేమీ కాదు. ఇప్పటికే చాలా మంది బాలీవుడ్‌లోకి అడుగుపెట్టి తమ సత్తా చాటుకుంటున్నారు. అలా చాటుకున్న వారిలో జాక్వెలిన్ ఫెర్నాండెజ్ పేరు ముందుగా చెప్పుకోవాలి. ఆమె పేరు గుర్తుకు రాగానే ఆమె అందచందాలు, మేని ఒంపుసొంపులు గుర్తుకు వస్తాయి. దాదాపు తొమ్మిది సంవత్సరాల క్రితం బాలీవుడ్‌లోకి అడుగుపెట్టిన జాక్వెలిన్ హీరోయిన్‌గా కన్నా ఐటెంగర్ల్‌గానే ఎక్కువ పేరు తెచ్చుకోగలిగింది. గతంలో కంటే ఇప్పుడు తనకు మరిన్ని మంచి పాత్రలు వస్తున్నాయి అంటున్న జాక్వెలిన్‌తో.....**



**'జెంటిల్మన్' పోస్టర్‌కి మంచి స్పందన వస్తున్నట్టుంది?**

సినిమా కథ విన్నప్పుడే మంచి విజయాన్ని అందుకుంటుంది అనిపించింది. ఫస్ట్ పోస్టర్ విడుదలయ్యాక ఆ నమ్మకం మరింత పెరిగింది.

**మీ కారణంగానే సిద్ధార్థ్‌కి ఆలియాభట్ దూరం అయ్యారట! నిజమేనా?**

సిద్ధార్థ్, నేను 'జెంటిల్మన్'లో నటిస్తున్నంత మాత్రాన తనకూ నాకూ మధ్య రిలేషన్‌షిప్ ఉందనడం ఎంత వరకూ సమంజసం? ఆలియా, సిద్ధార్థ్‌ల మధ్య గొడవకు కారణం ఏమిటో నాకు తెలియదు. నేనూ, సిద్ధార్థ్ మంచి స్నేహితులం మాత్రమే! వృత్తిపరంగా తప్ప వ్యక్తిగతంగా మా మధ్య ఎలాంటి సంబంధం లేదు. వారిద్దరి మధ్య గొడవలకు నేను కారణం కాదు.

**'జుడ్వా 2'లో మరో హీరోయిన్ తాప్సీతో మీకు గొడవ జరుగుతున్న మాట వాస్తవమేనా?**

తనతో కలిసి చేసే సీన్లే తక్కువ. అలాంటప్పుడు తనతో గొడవ పడుతున్నానన్నది ఎంత వరకు నిజమో ఆలోచించాలి. ఇలాంటి వార్తలు ఎలా వస్తాయో నాకు అసలు అర్థంకాదు.

**గతంలో చేసినట్టుగా ఐటెంసాంగ్స్ చేస్తున్నట్టు లేదు?**

అవి ఐటెంసాంగ్స్ కాదు. స్పెషల్ సాంగ్స్ మాత్రమే! నాకు చేయాలి అనిపిస్తే చేస్తాను కానీ, అన్ని సినిమాల్లో చేయను కదా! గతంలో రెండు సినిమాల్లో మాత్రమే వీటిని చేశాను. వాటికి మంచి పేరు వచ్చింది. అలాంటి పేరు మళ్ళీ వస్తుంది అంటే తప్పకుండా చేస్తాను. అంతే తప్ప పూర్తిగా వాటికే పరిమితం కాదలచుకోలేదు.

**స్పెషల్ సాంగ్స్‌కి ఎక్కువ రెమ్యునరేషన్ తీసుకుంటారట?**

అందరిలాగే నేనూ తీసుకుంటాను. అంతే తప్ప నాకేమీ ఎక్కువ ఇవ్వరు కదా! అలాంటి పాటలకు ఎంత ఇవ్వాలి? అనేది దర్శకనిర్మాతల నిర్ణయం. సినిమాకి ఇంత ఇమ్మని డిమాండ్ చేయగలం కానీ, పాటలకి డిమాండ్ చేయడం అంటూ ఉండదు. దర్శకనిర్మాతలు ఎంత ఇవ్వదలుచుకున్నారో అంతే ఇస్తారు.

**ఎక్కువగా సీక్వెల్ సినిమాలు చేయడానికి కారణం?**

కారణం ఏమీ లేదు. అవే చేయాలని అనుకోలేదు కూడా! అనుకోకుండా సీక్వెల్ సినిమాల్లో అవకాశాలు వచ్చాయి, అంతే! వాటి ద్వారా నాకు మంచి పేరే వచ్చింది.

**సినిమాల కారణంగా ఇంటికి దూరమవుతున్నారన్న బాధ లేదా?**

ఆ బాధ ఎందుకుండదు? ఎవరికైనా ఉంటుంది. 2009కి ముందు పేరెంట్స్‌కి దూరంగా ఎప్పుడూ లేను. ఇక్కడ సినిమాల్లో చేయడం మొదలెట్టిన తరువాతే ఇంటికి దూరంగా ఉండడం అలవాటు చేసుకున్నాను. ప్రతి సంవత్సరం కొన్ని రోజులు వారితో తప్పకుండా కలిసి ఉంటాను. అయితే గత నాలుగైదు సంవత్సరాలుగా మా ఇంటికి వెళ్ళడం కుదరడం లేదు. దాంతో వాళ్ళే ఇక్కడికి వచ్చి నాతో కొంతకాలం గడిపి వెడుతున్నారు.

**మీకు చాలా భాషలు వచ్చట కదా?**

చదువుకునే రోజుల్లో స్పానిష్, ఫ్రెంచ్, అరబిక్ నేర్చుకున్నాను. ఇక్కడికి వచ్చిన తరువాత హిందీ నేర్చుకున్నాను.

**హాలీవుడ్ సినిమాల్లో ప్రయత్నించలేదా?**

అక్కడ సినిమాలు చేయాలనే ఉద్దేశంతో కొంత కాలం శిక్షణ కూడా తీసుకున్నాను. ముందుగా ఇక్కడ అవకాశం రావడంతో ముందు వీటికే ప్రాముఖ్యమిచ్చాను. ప్రస్తుతం ఒక ఇంగ్లీష్ సినిమా ఒప్పుకున్నాను. వచ్చే సంవత్సరం ఆ సినిమా ఉంటుంది. మరో సినిమా అంగీకరించాల్సి ఉంది.

**దక్షిణాది భాషల్లో చేసే ఉద్దేశం ఉందా?**

ఛాన్స్ వస్తే తప్పకుండా చేస్తాను. కానీ ఇంత వరకూ నా దగ్గరకు అలాంటి ప్రపోజల్స్ ఏమీ రాలేదు.

–భరత్ కుమార్

# నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



## తురగా జానకీరాణి కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |
| 5 విశేష బహుమతులు | | |
| కథ ఒక్కొంటికి | : రూ. | 5,000 |

## తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |
| 5 విశేష బహుమతులు | | |
| కథ ఒక్కొంటికి | : రూ. | 5,000 |

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మ్యాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా


నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033


## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

* నిబంధనలు వర్తిస్తాయి




8

## నాన్నకు ప్రేమతో...

మారుతున్న కాలంతో పాటే తండ్రి పాత్ర కూడా మారిపోయింది. అమ్మ పాత్రలోకి ప్రవేశించాడు నాన్న! అమ్మలా సాకుతూ పిల్లల ఆలనాపాలనా చూస్తూ వారిమాట జవదాటనంతగా పిల్లలకు చేరువైపోతున్నాడు. జూన్ 18 ఫాదర్స్ డే సందర్భంగా నాన్న గురించి....

38

### 'అలిషెంక' మిస్టరీ

రష్యాలో ఒక ఒంటరి మహిళ గ్రహాంతర శిశువును రహస్యంగా పెంచుకుంది. ఆ రహస్యం తెలిసినవాళ్ళంతా మృత్యువాత పడ్డారు! ఆ మిస్టరీ ఏమిటో చదవండి

56

### ఆరు ఖండాలు-అరవై పెళ్ళిళ్ళు

యావత్‌ప్రపంచాన్నీ ఆకర్షించే స్థాయిలో పెళ్ళిళ్ళు చేసుకుంటూ రికార్డు సృష్టిస్తున్నారు కొందరు. ఒక జంట మరీ ముందుకెళ్ళింది. ఖండాలన్నీ తిరిగి అరవైసార్లు పెళ్ళి చేసుకుంది!

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: నయనతార
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### అబద్ధం

వయసు అరవైమూడేళ్ళు. పెద్దకోటీశ్వరుడు. భార్య పోయి పదేళ్ళయింది. ఇన్నాళ్ళకు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళి చేసుకున్న శుభసందర్భంగా పెద్దపార్టీ ఇచ్చాడతను. ఆ పార్టీకి వచ్చిన మిత్రులంతా అతన్నీ, అతని భార్యనీ చూసి ఈర్ష్య చెందారు. అరవైమూడేళ్ళ వాడికి ఇరవై మూడేళ్ళ భార్యా?! అని ఆశ్చర్యపోయారు. తట్టుకోలేకపోయారు. అతన్ని చాటుగా పిలిచి అడిగారు.

"ఇది ఎలా సాధ్యం గురూ?"

"ఏది?"

"అరవై మూడేళ్ళ నీకు ఇరవై మూడేళ్ళ భార్య?"

"వయసు తప్పు చెప్పాను. అబద్ధం ఆడాను."

"నీ వయసు ముప్పయి ఆరని చెప్పావా?" నవ్వుతూ అడిగారు మిత్రులు.

"కాదు. నా వయసు ఎనభై ఏడని చెప్పాను." అన్నాడతను.

### కోపం

భార్యమీద బాగా కేకలేసి ఆఫీసుకు వచ్చాడతను. ఆ కారణంగా ఆఫీసులో ఏ పనీ చేయలేకపోయాడు. సాయంత్రం అయింది. భార్యమీద కేకలేసి తప్పు చేశానను కున్నాడు. ఇంటికి ఫోన్ చేశాడు. భార్యతో అన్నాడిలా.

"సారీ హనీ! పదేపదే నీపై కేకలేయడం నాకు నచ్చడం లేదు. నా మీద నాకే అసహ్యంగా ఉంది. అయినా నేనంతలా కేకలేస్తోంటే నీకెందుకు నా మీద కోపం రావడం లేదు. మౌనంగా ఎలా ఉండగలుగుతున్నావు?"

"మీరు నాపై కేకలేసినప్పుడల్లా నేను టాయ్‌లెట్‌కి వెళ్ళి క్లీన్ చేస్తూ కూర్చుంటాను." అన్నది భార్య.

"అలా చెయ్యడం వలన కోపాన్ని అణచుకోగలుగుతున్నావన్నమాట."

"అవును! మీ టూత్‌బ్రష్‌తో టాయ్‌లెట్‌ని క్లీన్ చేస్తోంటే నా కోపం అంతా పటాపంచలైపోతుంది."

### నయం

క్రెడిట్‌కార్డ్ పోగొట్టుకున్నాడతను. అయినా పోలీసు రిపోర్టు ఇవ్వలేదు. ఎందుకంటే...భార్యకంటే దొంగే నయంగా ఉన్నాడు. అతిగా ఖర్చు చేయడం లేదు.

### ఫోన్

అరగంట సేపు మాట్లాడి, ఫోన్ పెట్టేసింది భార్య. చూసి ఆశ్చర్యపోయాడు భర్త.

"చిత్రంగా ఉందే! మీ ఆడవాళ్ళు మాట్లాడితే గంటా, రెండుగంటలకు కాని ఫోన్ పెట్టరు. నువ్వేంటి అరగంటకే ఫోన్ పెట్టేశావు?" అడిగాడు భర్త.

"రాంగ్‌నెంబర్" అంది భార్య.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 16
21-6-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## పని

ఎక్కడపుట్టాడో, ఎవరికి పుట్టాడో తెలియదు. అనాథ. పూటకూళ్ళమ్మ చేరదీసి పెంచితే పెద్దవాడయ్యాడు హంసుడు. ఇరవై ఏళ్ళవాడయ్యాడు. కూరలు తరుగుతూ, అంట్లు తోముతూ, నీళ్ళు తోడుతూ...చేతనైన సాయం చేసేవాడు. రెండుపూటలా ఇంత అన్నం పెడితే చాలనుకునేవాడు. రోజులు గడిపేశాడలా. మొన్నామధ్య పూటకూళ్ళమ్మ చనిపోయింది. దాంతో దిక్కు లేనివాడయ్యాడు. పెద్దగా తెలివితేటలు లేవు. చదువుసంధ్యలు లేవు. బతకడం ఎలా? అనుకుంటూ దీనంగా కూర్చుంటే ఎవరో చెప్పారు, కౌశికాశ్రమానికి వెళ్ళు. ఏదో పని చెప్పి, ఆశ్రమంలో చేర్చుకుంటారు.. తిండికి లోటు ఉండదన్నారు. ఆశ్రమం ఎక్కడ అంటే ఆమడదూరంలో ఉన్నదన్నారు. సరేనని బయల్దేరాడు హంసుడు. ఆమడంటే నాలుగుకోసులు. యోజనదూరం. నడిచాడు హంసుడు. ఆశ్రమానికి చేరుకున్నాడు.

అక్కడ కోతులకి పళ్ళూ అవీ తినిపిస్తూ చిన్నగురువు కీశుడు కనిపించాడు. నమస్కరించాడతనికి హంసుడు. ఏం కావాలి బాబూ? అంటే కడుపునిండా తిండి, చేతినిండా పని కావాలి అన్నాడు హంసుడు. ఈ రెండూ కల్పించాల్సిన వ్యక్తి పెద్దగురువుగారు కౌశికులు. వారిని కలుద్దాం రా అన్నాడు కీశుడు. హంసుణ్ణి వెంటబెట్టుకుని కలిశాడతన్ని. చేతులు జోడించి, నమస్కరించి నిల్చున్న హంసుణ్ణి క్రీగంట చూశాడు కౌశికుడు. ఎందుకు వచ్చాడన్నది ఇట్టే గ్రహించాడు. కడుపునిండా తిండి కావాలంటే పని చెయ్యాలి కదా! నువ్వేం పని చెయ్యగలవు? అడిగాడు కౌశికుడు. నీళ్ళు తోడుతాను స్వామి. కూరలు తరుగుతాను, అంట్లు తోముతాను అన్నాడు హంసుడు. ఈ పనులకి ఆశ్రమాలకు రానవసరం లేదు. ఏ పూటకూళ్ళమ్మ ఇంటికి వెళ్ళినా దినాలు గడచిపోతాయి. ప్రత్యేకించి ఆశ్రమానికి ఎందు కొచ్చావు? చెప్పమన్నాడు కౌశికుడు. ఏదైనా సాధించాలి. తెలుసుకోవాలి. అందుకు వచ్చానన్నాడు హంసుడు. అప్పుడు ఆటలేమైనా వచ్చా? అడిగాడు కౌశికుడు. చదరంగం వచ్చన్నాడు హంసుడు. తీసుకురా అన్నట్టుగా కీశుణ్ణి చూస్తే, అతడు వెళ్ళి చదరంగం తెచ్చి ఆడేందుకు సిద్ధం చేశాడు. నువ్వు ఈ చిన్నగురువుగారు కీశునితో చదరంగం ఆడాలి. గెలిస్తే నువ్వు కోరుకున్నట్టుగా నిన్ను ఈ ఆశ్ర మంలో చేర్చుకుంటాను. ఓడిపోతే నీ ముక్కుకోసి, నిన్ను అవమానించి పంపిస్తాను. ఒకవేళ నువ్వు గెలిచి, చిన్నగురువుగారు ఓడి పోయినా అంతే! ముక్కు కోసి, అతన్నీ ఈ ఆశ్రమం నుంచి గెంటి వేస్తాను అన్నాడు కౌశికుడు. కైజారు దగ్గర పెట్టుకుని, ఆట ప్రారం భించమన్నాడు.

కీశుడు–హంసుల ఆట ప్రారంభం అయింది.. హంసుని ఎత్తుకి పైఎత్తు వేస్తూ కీశుడు, ముందుకు దూసుకుపోతున్నాడు. భయ పడి ముక్కును నిమురుకున్నాడు హంసుడు. తర్వాత గుండెనిండుగా ఊపిరి పీల్చి, ఏకాగ్రతను సాధించాడు. ఆత్మవిశ్వా సంతో రెచ్చిపోయాడు. ఇప్పుడు ఆటలో కీశుడు వెనుకబడ్డాడు. కాసేపే ఆ వెనుకబాటుతనం. పుంజుకున్నాడంతలోనే! హోరాహోరీగా సాగుతోంది ఆట. గమనించసాగాడు కౌశికుడు. పోటీని ఆసక్తిగా గమనిస్తూ చేతిలోని కైజారు అటూ ఇటూ తిప్పసాగాడు. తిరుగుతున్న కైజారుని చూసి, ఆటవైపు చూశాడు హంసుడు. కీశుడు తప్పుగా ఎత్తు వేశాడు. హంసుడికి దొరికిపోయాడు. ఇప్పుడుగాని తను గుర్రాన్ని కదిపితే కీశుడు ఆటకట్టు. కదిపితే అనుకుంటూ గుర్రం మీద చేయివేసి ఆగిపోయాడు హంసుడు. ఆలోచనలోపడ్డాడు. తను గెలుస్తాడు. గెలిస్తే కడుపునిండా తిండీ, చేతినిండాపనీ అంతే! అదే కీశుడు గెలిస్తే ఆశ్రమానికీ, అందరికీ ఉపయోగం. పైగా ముక్కును కోల్పోయి అవమానపడడు. తన ముక్కు దేమున్నది? పోతే పోయింది. అనుకున్నాడు హంసుడు. ఆటకట్టించేందుకు గుర్రాన్ని కదపక, బంటును కదిపి ఓడి పోయేందుకు సిద్ధమయ్యాడు. గ్రహించాడది కౌశికుడు. చేతిలోని కైజారుని చదరంగం మీదికి విసిరాడు. ఆటంతా చెల్లాచెదురైంది. ఆశ్చర్య పోయి చూశాడు హంసుడు. లేచి నిల్చున్నాడు. అతన్ని గట్టిగా కౌగలించుకున్నాడు కౌశికుడు. చెప్పాడిలా.



ఈ ఆశ్రమంలో నువ్వు ఉండాలి. నువ్వు ఇక్కడ ఉండేందుకు నీకు అన్ని అర్హతలూ ఉన్నాయి. ఆటలో నిన్ను అనుక్షణం పరిశీలించాను. ఏకాగ్రత సాధించి, ఆత్మవిశ్వాసంతో ప్రజ్ఞను ప్రదర్శించావు. గెలుపు నీది అనుకుంటున్న వేళ కరుణ చూపావు. కీశుణ్ణి గెలిపించేందుకు నువ్వు ఓడిపోడానికి సిద్ధమయ్యావు. సాధకునికి కావాల్సిన ప్రజ్ఞా, కరుణా రెండూ నీలో ఉన్నాయి. చాలు! అయినా జీవితం అంటే గెలుపు ఓటములు కాదు, జీవితంలో పోగొట్టుకున్నదీ ఉండదు. పొందిందీ ఉండదు. అంతా భ్రమ అన్నాడు కౌశికుడు. పాదాభి వందనం చేసిన హంసుణ్ణి ఆశీర్వదించాడు. తనని తాను తెలుసుకునే పనిలో అతన్ని నియమించాడు. నవ్య




## ప్రమాదాలకు అడ్డుకట్ట

ట్రాఫిక్ అంతగాలేని ప్రదేశాల్లో, గేటెడ్ కమ్యూనిటీల్లో వేగంగా వాహనాలు నడపడం వల్ల రోడ్డు ప్రమాదాలు పెరుగుతున్నాయి. ఇలాంటి ప్రమాదాలకు ఒక డివైజ్ సమర్థంగా అడ్డుకట్ట వేస్తోంది. అదే ట్రాక్యో డివైజ్! ఇదొక కనెక్టెడ్ వెహికల్ స్టార్టప్.

ఉదాహరణకు ఒక గేటెడ్ కమ్యూనిటీని తీసుకుంటే, ఒక కారు లోపలికి వెళ్లేముందు సెక్యూరిటీ గార్డు డ్రైవర్‌కి ట్రాక్యో డివైజ్ ఇస్తాడు. దాన్ని కారు డ్యాష్ బోర్డు మీద పెట్టుకోవాలి. ఆ డివైజ్ గేటెడ్ కమ్యూనిటీలో అమర్చిన సర్వర్లకు కనెక్ట్ అవుతుంది. ఇక అక్కడి నుంచి వాహనం పూర్తిగా డివైజ్ ఆధీనంలోకి వెళ్లిపోతుంది. కారు ఎంత వేగంతో వెళ్తోందో, ప్రస్తుతం గేటెడ్ కమ్యూనిటీలో ఎక్కడుందో, డ్రైవర్ నిర్లక్ష్యంగా వాహనం నడుపుతున్నాడా? లాంటి వివరాలన్నీ డివైజ్ ట్రాక్ చేస్తుంది. సెక్యూరిటీ గార్డు కంప్యూటర్లో అన్నీ చూస్తుంటాడు. ఒకవేళ కారు డ్రైవర్ మితిమీరిన వేగంతో వెళ్తుంటే.. వెంటనే ఒక ఆడియో హెచ్చరిక వస్తుంది. అదే టైంలో గేటెడ్ కమ్యూనిటీలో తిరుగుతున్న మిగతా వాహనాలకు కూడా అలర్ట్ వెళ్తుంది. దాంతో ఇతర డ్రైవర్లు అప్రమత్తమై ప్రమాదాలు జరగకుండా జాగ్రత్తపడొచ్చు. ఒకవేళ యాక్సిడెంట్ జరిగితే.. సెక్యూరిటీ గార్డు ఒకే ఒక్క క్లిక్‌తో అంబులెన్స్‌కు గానీ లేదా ఇతర ఎమర్జెన్సీ సర్వీసుకుగానీ సందేశం పంపొచ్చు. వాహనాలు వేగంగా వస్తున్నప్పుడు రోడ్ సైడ్ యూనిట్లు పాదచారులను అప్రమత్తం చేస్తాయి. ట్రాక్యో డివైజ్ రియల్ టైం నావిగేషన్‌తో పనిచేస్తుంది. గేటెడ్ కమ్యూనిటీలో బండి ఎక్కడ పార్క్ చేయాలో కూడా చెప్తుంది. వాహనం బయటికి వచ్చిన తర్వాత గార్డు ట్రాకింగ్ డివైజ్‌ను వెనక్కి తీసుకుంటాడు. ఒకవేళ ట్రాఫిక్ నిబంధనలు ఉల్లంఘిస్తే డ్రైవర్ దగ్గర జరిమానా వసూలు చేస్తాడు. 2016 సెప్టెంబర్లో దేశంలోని అన్ని గేటెడ్ కమ్యూనిటీలకు సేవలు అందించడమే లక్ష్యంగా ఈ స్టార్టప్ ప్రారంభమైంది. ఇందులో ఆరుగురు కోర్ టీం. సీఈవో యశ్‌అగర్వాల్, సీటీవో కృతికా జైన్, అడ్వైజర్ మెంబర్లు ఆర్యన్ కరబాసొగ్లు, అతిఫ్ ఇనాయత్ ఖాన్ కంపెనీకి మూలస్తంభాలు. హైదరాబాదీలకు కూడా సేవలు అందించడానికి ఫౌండర్లు రెడీ అవుతున్నారు. గేటెడ్ కమ్యూనిటీలు, రెసిడెన్షియల్ ఏరియాలు, టౌన్ షిప్‌లు, షాపింగ్ కాంప్లెక్సులు, స్కూళ్లు, ఆస్పత్రులు, ఎయిర్‌పోర్టులు వంటి జనసమ్మర్ద ప్రాంతాలకు ఇది బాగా ఉపయోగపడుతుంది.




# మెయిల్ బాక్స్

### శర్మగారికే చెల్లింది

అనీషా అంబ్రోస్ ముఖచిత్రంతో వెలువడిన వీక్లీ ఆకర్షణీయంగా ఉంది. ముందుగా చెప్పాల్సింది మొదటిపేజి గురించి. 'రాయుడుబాబునది' కథ సామాజిక కోణాన్ని, నైతికతతో, ఉదాత్తంగా తీర్చిదిద్దారు. ఔన్నత్యం, ఆదర్శవంతమైన ముగింపుతో 'నిజమే సుమా' అన్నంత క్రియేటివిటీతో రచన చేయడం జగన్నాథశర్మగారికే చెల్లింది. అలాగే మార్నింగ్ కాఫీకి కూడా ఎడిక్ట్ అయిపోయాం. కథలు వాస్తవాల్ని చిత్రించే ప్రయత్నం చేశాయి.

మొదటి పేజి

—పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

### అలరించిన 'మొదటిపేజి'

మొదటిపేజి కథ 'రాయుడుబాబు నది' ఎంతో ఆదర్శవంతంగా ఉంది. అదేవిధంగా అంతకుముందువారం వచ్చిన 'రాములమ్మ' గొప్పనీతి చెప్పింది దేవుళ్ళకి. క్రూరకర్ములు తమ క్రూరకర్మ నిర్విఘ్నంగా నెరవేరాలని దేవతలకు మొక్కుకుంటారు. దేవతలు కూడా రాములమ్మలాగే వాళ్ళకు బుద్ధిచెబితే ఎంత బాగుంటుందో అనిపించింది. వింత వింత వివాహ పద్ధతులు భలేగా ఉన్నాయి. సెల్‌ఫోన్‌తో పెళ్ళి, పెళ్ళిరోజు మొక్క నాటడం లాంటివి బాగున్నాయి. అతిగా నీరు తాగినా ప్రమాదమే అనడం ఆశ్చర్యంగా ఉంది.

—సోనాలి, సూర్యారావుపేట.తూ.గో.జిల్లా

### నవరసభరితం

మార్నింగ్ కాఫీ నుంచి సుధామ పదగారడీ వరకు ఆద్యంతం నవరసభరితంగా ఉంది ఈ వారం నవ్య. ప్రతిపేజీ ఒక్కొక్క ఆణిముత్యమే. 'ఆనందానికీ, ఆహ్లాదానికీ తోటపని' నిజంగా అద్భుతమైన కథనం. నిత్యం, బిజీబిజీ జీవితంలో కాసేపైనా ఇలాంటి పనులు చేయడం ద్వారా శారీరక, మానసిక సమస్యలు దూరం అవుతాయి. నేటి యాంత్రిక జీవనంలో ఇవి పాటించాలి. నేను మంచి విలన్ని అంటున్న ఆశిష్‌విద్యార్థి ఇంటర్వ్యూ అద్భుతంగా ఉంది. ఆయన గురించి ఎన్నో విషయాలు తెలుసుకోగలిగాం. కోట శ్రీనివాసరావు గారి జీవిత విశేషాలను చక్కగా వివరిస్తున్నారు. ధన్యవాదాలు.

—పసుమర్తి సర్వారావు లాలాచెరువు. తూ.గో.జిల్లా

### యూదుల జీవనాన్ని చెప్పే ప్రయాణం సీరియల్

ప్రయాణం సీరియల్ ద్వారా యూదుల జీవన విధానాన్ని చక్కగా ఆవిష్కరిస్తున్నారు బాలి. సహజీవనాన్ని తలపింపజేసే ప్రేమకుటీరాలు, ఆరేళ్ళ వయసులోనే శృంగారంలో పాల్గొనడం లాంటివి చెప్పి ఇదేం ప్రేమ బాబోయ్ అనిపించడం బాగుంది.

—కె.సుధీర్, శ్రీనగర్, తూ.గో.జిల్లా

### అలరించిన సురభి

ఉప్పురాతి గనుల్ని తొలిచి ఏర్పరిచిన వింత చర్చ్, సైకిల్‌ని గడ్డం మీద నిలబెట్టి రికార్డు సృష్టించిన సురభి అంశాలు అలరించాయి. నమ్మలేని సెల్ఫీ సీక్రెట్స్ చెప్పి ఆకట్టుకున్నారు. అందుకే ఫేస్‌బుక్, వాట్సాప్ లాంటి సోషల్ మీడియాని సోమరుల సత్రం అని ఒక సంపాదకుడు చమత్కరించారు. వయసు ప్రభావం వల్ల కొత్త జోనర్‌లో చెయ్యను అని చెప్పినా స్వాతికి చాన్సులుండవు. బాహుబలి విజయం చూసి ఖాన్ త్రయం వణికిపోతున్నదనడం హాస్యాస్పదం.

—కె.ప్రవీణ్, కాకినాడ

### ఆశ్చర్యం కలిగింది

భూకంపాలు, మెట్రోల్లో భారీ కట్టడాలు కూలిపోయినప్పుడు వందలు, వేల సంఖ్యలో ప్రజలు ప్రాణాలు కోల్పోయినా, ఎందరో క్షతగాత్రులుగా కొన ఊపిరితో బ్రతికి బైటపడగలశక్తి ఆశ్చర్యం కలిగించింది. ఆ దుర్ఘటనల సమయంలో మానసికంగా, భావోద్రేకాలు తట్టుకునేవిధంగా మెదడు స్పందించే విధానం, ఆ శాస్త్రీయ ప్రక్రియ గురించి 'ప్రాణాలు రక్షించే రహస్యం' అనే వ్యాసంలో చాలా వివరంగా చెప్పారు.

—తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం

### ఆహ్లాదకరం వేణుగానం

మొదటిపేజీ సీతమ్మ వేణుగానం కథనం ఆసాంతం వేణువు విన్నట్టుంది. ఆ గానం ఆహ్లాదాన్ని, ఆరోగ్యాన్ని పంచిపెడుతుందని తెలిసింది. హరివంశంలో పూతన ఆకారం, సంహారఘట్టాన్ని అరణి కళ్ళకు కట్టారు. ప్రాణాలు రక్షించే రహస్యం వ్యాసం కొత్తగా ఉండి ఆకట్టుకుంది. రివ్యూలో మోదీ నాయకత్వ లక్షణాలు తెలిశాయి. భ్రాతృదేవోభవ వ్యాసం అన్నదమ్ముల అవినాభావ బంధాన్ని వివరించింది. ఆరోగ్యమే మహాభాగ్యంలో రోజ్మేరీ సువాసన ఫలితం తెలిసింది. సరదాగా ఒక ప్రశ్న ఆలోచింపజేస్తే, తీన్మార్ నిశ్శబ్దంగా నవ్వించింది. స్త్రీ మెదడు రెండువైపులా పనిచేయడం వారి అదృష్టం. యువత ఓటింగ్ తన గెలుపునకు కారణమన్న కోట మాటలు ప్రశంసనీయం. నవ్య సినిమా శీర్షిక, నళిని, రెజీనా ఇంటర్వ్యూలు ఆసక్తికరం. అచ్చోసిన ఆబోతు గురించిన సంగతులు కథగా మలిచి మెప్పించిన సరసిగారి కథనం ఉదాత్తంగా ఉంది. 'చరిత్రలు అడగవద్దు' వైవిధ్య కథనం సందేశంతో ఆసాంతం చదివించింది. మానవ సంబంధాలు అవసరార్థం బంధాలుగా మారాయని 'వలసబతుకులు' కథ చాటింది.

—కృష్ణ మాధవరపు, కాకినాడ

### అలరించిన ఆలుమగలు

మార్నింగ్ కాఫీ మతిమరుపు ఆలుమగల ఝలక్ ఆనందింపజేసింది. మొదటిపేజీ చదివాక 'రాములమ్మ' వంటి మహనీయులే 'గ్రామదేవతలు'గా విలసిల్లుతారనిపించింది. ఎవరు దేవుడు? కథాకర్త జియో లక్ష్మణ్ గారికి అభినందనలు.

—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

# మ్యూజియం పార్క్

రాజులకాలంలో యుద్ధాలు చేసి గెలిచినవారు తమ పేరుతో శాసనాలు, కీర్తిస్థూపాలు ఏర్పాటుచేసుకునేవారు. నాణాలను ముద్రించేవారు. కేవలం యుద్ధంలో గెలుపొందిన సందర్భమే కాకుండా పరిపాలనా సంస్కరణలు చేసినప్పుడు, వారి పరిపాలనా దక్షతను రాజ్యమంతా తెలియజేయడానికి ఆ రాజ్యం సామంతులో, మంత్రులో ఆ రాజులపేరిట స్థూపాలు నిర్మించటం, ఇతరత్రా ఆ రాజు ఖ్యాతిని తెలియజేసేలా ఏదో ఒక నిర్మాణం చేపట్టేవారు. అసలు ఎక్కడైనా సరే, ఏ కాలంలో అయినా సరే గెలిచిన వారికే పట్టం కడతారు. వారిని గౌరవిస్తారు. కానీ దీనికి భిన్నంగా పరాజయం పాలైనవారికి కీర్తి స్తంభాలు నిర్మించి అందులో అపజయం పొందిన వారందరికీ స్థానం కల్పించడం ఎక్కడయినా చూశారా? ఇలాంటి సంప్రదాయం మరెక్కడో కాదు... అగ్రరాజ్యం అమెరికాలో కొనసాగుతూ వస్తోంది.

అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో ఎవరైతే ఓడిపోతారో వారి వివరాలను ఒక మ్యూజియంలో నిక్షిప్తం చేసి, మ్యూజియం బయట వారి పేరుతో ప్లకార్డును ప్రదర్శనగా ఉంచుతారు. ఆ మ్యూజియం పేరే 'లెఫ్ఫర్ట్స్ హిస్టారిక్ హౌస్'! ప్రస్తుతం దీనిని 'మాన్యుమెంట్ టోంబ్ టు అన్ ఎలక్టర్స్' అని పిలుస్తున్నారు. ఈ హిస్టారిక్ హౌస్ అమెరికాలోని బ్రూక్లిన్‌లో ఉంది. దీనిని 1783లో నిర్మించారు. క్రమంగా ఇది మ్యూజియం పార్క్‌గా ప్రసిద్ధి చెందింది. అయితే 2008 నుంచి ఒక కొత్త సంప్రదాయంతో దీనిని చరిత్రకెక్కించారు. అమెరికా దేశానికి అధ్యక్షుడిగా పోటీ చేసేవారిలో ఓటమి చవిచూసినవారికి ఇందులో స్థానం కల్పిస్తారు. అంటే ఎవరైతే ఓడిపోతారో వారి వివరాలను ఈ మ్యూజియంలో ఉంచి, మ్యూజియం బయట వారి పేరుతో ఒక ప్లకార్డును పెడతారు. అందులో వారి పేరు, వారు పోటీ చేసిన సంవత్సరం ఉంటుంది.

ప్రారంభం నుంచి అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో ఓటమిపాలైన వారి అందరి పేర్లు, వారి వివరాలు ఇందులో ఉంటాయి. 'జాన్ క్విన్సీ ఆడమ్స్, థామస్ జెఫర్సన్, ఆల్‌గోరె, ఫ్రీమాంట్ లాంటి ఎంతోమంది వ్యక్తుల పేర్లు, వారి వివరాలు ఇక్కడ ఉన్నాయి.



అయితే ఈ ఓటమి లిస్టులో ఈమధ్యనే డొనాల్డ్ ట్రంప్ చేతిలో ఓటమి పాలైన హిల్లరీ క్లింటన్ వివరాలు, ప్లకార్డు చేరిపోయాయి. అందుకే దీనిని అన్ ఎలెక్టెడ్ మాన్యుమెంట్ లేదా టోంబ్ అని పిలుస్తున్నారు.

దేశాధ్యక్ష పదవికి అభ్యర్థిగా పోటీ చేసి ఓడిపోయిన వారి వివరాలను స్మారక స్తంభం పేరిట ప్రదర్శన చేయడం కొత్తగా ఉంది కదా! ఇలాంటి సంప్రదాయం బహుశా ఎక్కడా లేదేమో!

నవ్య



# నాన్నకు ప్రేమతో...

**కని పెంచిన మమతానురాగాల రక్ష అమ్మదయితే, భవిష్యత్తుకు బాటలు పరిచి గమ్యాన్ని చేర్చే స్ఫూర్తిప్రదాత నాన్న! అమ్మ జోల పాట నిద్రపుచ్చితే....నాన్న నీతిపాఠం వ్యక్తిత్వనిర్మాణానికి పునాది వేస్తుంది. అమ్మ ఒడి గుడి అయితే, నాన్న భుజాలు లోకాన్ని చూపే బడి. అమ్మ కన్నబిడ్డ కడుపు చూస్తే, నాన్న ఆ బిడ్డ భవిష్యత్తును చూస్తాడు. ఎప్పుడూ పిల్లల గురించే తపించే, వారితోడిదే లోకంగా జీవించే నేటి తండ్రి తన కలలను, ఆశలను, అభిప్రాయాలను పిల్లలతో పంచుకుంటు న్నాడు. ఒక స్నేహితుడిలా వారితో మెలుగుతున్నాడు. జూన్ 18న ఫాదర్స్‌డే సందర్భంగా తండ్రీ పిల్లల అనుబంధంపై కథనం మీకోసం....**

అమ్మ తర్వాతి పదం నాన్నదే అయినా, ప్రతీ ఒక్కరి జీవితంలో అదో మధుర భావన. నవమాసాలు మోసి శిశువును తల్లి ఈ లోకంలోకి తీసుకువస్తే, ఆ శిశువుకు లోకాన్ని పరిచయం చేసి, వారికి భరోసాగా నిలిచేది తండ్రి. అందుకే అమ్మ వాస్తవం, నాన్న నమ్మకం అంటారు. పని, ఉద్యోగం అంటూ ఉదయాన్నే బయటకు వెళ్ళే నాన్న, ఇంటి బాధ్యతలను ఒంటిస్తంభంలా మోస్తూ తన సంపాదనంతా కుటుంబానికే వెచ్చించే నాన్న, పిల్లల భవిష్యత్తు కోసం, వారి ఉన్నతి కోసం నిరంతరం తపనపడే నాన్న, అన్నీ తానై తోడూనీడగా మసలే నాన్నకు ప్రతి ఒక్కరి జీవితంలో ప్రత్యేక స్థానముంటుంది. నాన్న అనురాగానికి, ఆప్యాయతలకు ప్రతీక మాత్రమే కాదు మార్గదర్శిగా ఉంటూ పిల్లల బంగారు భవితకు బాటలు వేయడానికి నిరంతరం తపన పడుతుంటాడు.

### అనురాగజీవి

ప్రస్తుత సమాజంలో తండ్రి పాత్ర అనేక కోణాల్లో దర్శనమిస్తుంది. ఇంటిని, పిల్లలను తల్లికి వదిలేసి తనదైన ధోరణిలో జీవించే ఒకనాటి తండ్రులతో పోల్చుకుంటే ఇవాల్టి తండ్రి ఎంతో సున్నిత మనస్కుడు. బాధ్యత తెలిసిన అనురాగ జీవి. అనుక్షణం పిల్లల గురించి పరితపించడం అతని స్వభావంలోనే ఉంది.

## జూన్ 18 ఫాదర్స్‌డే సందర్భంగా

పిల్లల నవ్వులను, మురిపాలను మనస్ఫూర్తిగా అనుభవించి పలవరించే అచ్చమైన అమ్మ లాంటి వాడు ఇప్పటి నాన్న. తల్లి స్థానంలో ఉండి, అన్నీ తానై పిల్లల ఆరోగ్యం పట్ల అత్యంత జాగరూకతతో వ్యవహరిస్తున్నాడు. ఇంతగా పిల్లల చుట్టూ ఆధునిక తండ్రి మానసిక ప్రపంచం ముడిపడి ఉండటం పరిశీలిస్తే గానీ తెలియదు.



### నాన్నకే చేరిక

మారుతున్న కాలమాన పరిస్థితులకు అనుగుణంగా తండ్రి పాత్ర మారుతోంది. ప్రస్తుత సమాజంలో భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలకు వెళుతున్నారు. తదనుగుణంగా ఇంటిబాధ్యతలను కూడా ఇద్దరూ సమానంగా పంచుకుంటున్నారు. వంట పనిలో, ఇంటిపనిలో అమ్మకు చేదోడువాదోడుగా ఉంటున్నాడు నాన్న. పిల్లల సంరక్షణలో తనవంతు సహాయం చేస్తున్నాడు. పిల్లల్ని నిద్రలేపడం, స్నానం చేయించడం, వారిని స్కూల్‌కి తయారుచేసి స్కూల్ బస్సు ఎక్కించడం వరకూ అన్నీ చేస్తున్నాడు.

### మార్కెట్ యంత్రం

కాలంతో పాటు తండ్రి పాత్ర మారుతోంది. పిల్లల పోషణలో, వారి ఆలనాపాలనా చూసుకోవడంలో తనదైన ముద్ర వేస్తున్నాడు తండ్రి. ముద్దుమురిపాలు అందించడంతో పాటు వారి భవిష్యత్తుకు బంగారు బాటలు పరుస్తున్నాడు. పిల్లలకు సంబంధించిన పనులను ఇష్టంగా, ప్రేమగా చేస్తున్నాడు. దీనిని గమనించిన మార్కెట్ తండ్రీపిల్లల అనుబంధాన్ని ఇతివృత్తంగా తీసుకుని వాణిజ్యప్రకటనలు రూపొందిస్తోంది. ఏం కొన్నా, ఏం తిన్నా, ఎక్కడికి వెళ్ళినా పిల్లలకే ప్రాధాన్యం. కనుకనే వాణిజ్య ప్రకటనల్లో ఇప్పుడు తండ్రీపిల్లల బంధం ప్రత్యేకాంశం. ఉత్పత్తులను మార్కెట్ చేసుకోవడానికి ఎన్నడూ లేనంతగా తండ్రి పిల్లల బంధం వాణిజ్యప్రకటనల రూపంలో దర్శనమిస్తోంది. ఈ కారణంగానే ఇప్పటి వాణిజ్య ప్రకటనల్లో సంప్రదాయ తండ్రి స్థానంలో అధునాతన నాన్న దర్శనమిస్తున్నాడు.



# నాన్నకో బహుమతి

పండగొచ్చినా, పబ్బమొచ్చినా చిన్న చిన్న బహుమతులు ఇచ్చిపుచ్చుకోవడం పరిపాటి. మదర్స్ డే రోజున అమ్మకిష్టమైనవి బహుమతిగా ఇస్తారు. లవర్స్ డే రోజున ప్రియురాలికి గులాబీల వర్షం కురిపిస్తారు. మరి ఫాదర్స్ డే రోజున...! ఫాదర్స్ డే సంకేతం గులాబి. జీవించి ఉన్న తండ్రికి శుభాకాంక్షలు చెబుతూ ఎర్రగులాబి ఇస్తారు. మరణించిన తండ్రికి తెల్ల గులాబితో నివాళి అర్పిస్తారు. గులాబీలు మారితే ఏకంగా అర్థం మారిపోతుంది. ఇక అమెరికా సహా పాశ్చాత్య ప్రపంచంలో మదర్స్ డే తరువాత అత్యధికంగా గ్రీటింగ్ కార్డులు ఇచ్చే వేడుక ఇదేనట. ఫాదర్స్ డే గిఫ్ట్‌గా ప్రపంచంలో ఎక్కువమంది ఇచ్చే బహుమతి నెక్‌టై. ఇక విందులు, వినోదాలు మామూలే!



పిల్లలు అమ్మ కంటే కూడా నాన్నకే చేరిక అవుతున్నారు. పిల్లలు తమ మనోభావాలను తండ్రి దగ్గర స్వేచ్ఛగా బయటపెట్టడంలో వెనుకంజ వేయడం లేదు. పిల్లలు తండ్రిని తమ మొదటి స్నేహితునిగా అభిమానిస్తున్నారు. పిల్లల సంరక్షణ విషయంలో ఎలాంటి గొప్పలకూ పోకుండా భార్యకు సహకరిస్తూ తన బాధ్యతలను నెరవేరుస్తున్నాడు. చదువుల్లో పిల్లల ప్రగతి, వైఫల్యాల గురించి ఆరా తీస్తూ వారి కలలను సాకారం చేసేందుకు నాన్న ఎంతగానో ఆలోచిస్తున్నాడు. పరీక్షల సమయంలో అనుక్షణం పిల్లలను మానసికంగా సన్నద్ధం చేస్తూ, వారికి ధైర్యాన్ని నూరిపోయడంలో నాన్న చేస్తున్న కృషి తక్కువేమీ కాదు.

### నాటికీ..నేటికీ...

ఒకప్పుడు పిల్లలు తల్లిచాటున మసలేవారు. తండ్రి ఎదురుగా వెళ్ళి ఏదైనా అడగాలంటే భయపడేవారు. తండ్రీపిల్లల మధ్య తల్లే రాయబారి. తండ్రి ఇంట్లో లేనప్పుడు ఎంత వీరంగం చేసేవారో, తండ్రి ఎదురుపడితే మాత్రం చప్పున పక్కకు తప్పుకునేవారు. కానీ నేటికాలంలో పిల్లలు తమకు ఏం కావాలన్నా నిర్మొహమాటంగా తండ్రి దగ్గరకి పరిగెడుతున్నారు. తమకు నచ్చని విషయాలను వ్యతిరేకించడానికి ఏమాత్రం సందేహించడం లేదు. నాన్న కూడా పిల్లల ఇష్టాఇష్టాలకు వ్యతిరేకంగా ఏ పనీ చేయాలనుకోవడం లేదు. పిల్లలకు నచ్చింది చేసినప్పుడు, వారి అభిరుచులు, అభిప్రాయాలను గౌరవించినప్పుడు ఎటువంటి కోపతాపాలు, ఒత్తిళ్ళకు తావులేకుండా, పిల్లలు కూడా మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా ఎదుగుతారని నాన్నలు గ్రహిస్తున్నారు. చదువు, పెళ్ళి వంటి విషయాల్లో కూడా పిల్లల మనోభావాలకే ప్రాధాన్యం ఇస్తున్నారు నేటి తండ్రులు. చాలామంది తండ్రులు పిల్లల పట్ల కఠినంగా వ్యవహరించాలనే భావన నుంచి బయటపడి విశాల దృక్పథాన్ని అలవర్చుకుని కుటుంబాన్ని సమర్థవంతంగా నడిపిస్తున్నారు. ఇలాంటి మార్పులే కుటుంబంలో మమతానురాగాలు వెల్లివిరియడానికి దోహదం చేస్తున్నాయి.

### హౌస్ హజ్బెండ్స్

మహిళా చైతన్యం పెరిగి ఉద్యోగాల్లో పోటీ పెరగటంతో భార్యాభర్తలిరువురూ ఉద్యోగాలు చేయగలుగుతున్నారు. అందుకే ఇంటి పనుల్లో సగం బాధ్యతను తండ్రి తీసుకుంటున్నాడు. నిరుద్యోగ సమస్య తీవ్రమవడంతో ఉద్యోగం కోల్పోయిన భర్త ఇంటి పట్టునే ఉండి పిల్లల బాధ్యతలు చూసుకుంటూ భార్యను వృత్తి జీవితానికి ప్రోత్సహిస్తున్నాడు. ఒక విధంగా చెప్పాలంటే వీరిని 'హౌస్ హజ్బెండ్స్' అని పిలవడం పశ్చిమ దేశాల్లో ఎక్కువవుతోంది. తండ్రి సంపాదనాపరుడైతే తల్లి ఎలా ఇంటి బాధ్యతలు నిర్వర్తిస్తుందో అంతకంటే ఎక్కువగా ఈ హౌస్ హజ్బెండ్స్ తమ పిల్లల పెంపకంలో తలమునకలై ఉంటున్నారు. తండ్రి నైట్‌షిఫ్టులో ఉద్యోగం చేసి పగటి సమయంలో పిల్లల బాధ్యతలను తీసుకుంటున్నాడు. తల్లి పగటి సమయంలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తుండడంతో పిల్లల పెంపకం, వారికి కావాల్సినవి అందించడం, వారిని స్కూళ్లకు పంపించడం, లంచ్ సిద్ధం చేయడం వంటి బాధ్యతలను తండ్రి తీసుకుంటున్నాడు. ఇంకా చిన్నపిల్లలను ఇంటి దగ్గరే సాకడంలో తల్లి పాత్రను నాన్న పోషిస్తున్నాడు. వారికి నేపీలు మార్చడం నుంచి జోలపాటలతో నిద్రపుచ్చడం వరకూ అన్ని పనులూ నాన్న చేస్తున్నాడు. ఇందుకోసం విదేశాలలో అయితే ఉద్యోగాలు చేసే నాన్నలకు ఆయా యాజమాన్యాలు పెయిడ్ లీవ్స్ కూడా మంజూరు చేస్తున్నాయి.

### విసుగనేదే లేదు

అప్పుడప్పుడు అమ్మలు పిల్లలమీద విసుక్కుంటారు. అవసరమైతే చేయి కూడా చేసుకుంటారు. క్రమశిక్షణలో ఉంచాలని కళ్ళతో బెదిరించే నేటి తల్లులు కొన్నిసార్లు పిల్లల పట్ల దురుసుగా ప్రవర్తిస్తారు. కానీ నేటి నాన్న తీరు పూర్తిగా విరుద్ధంగా ఉంది. పిల్లలను విసుక్కునే తండ్రులు అరుదుగా కనిపిస్తారు. నయానా చెప్పాలని చూస్తారే తప్ప భయానా క్రమశిక్షణ అలవరచాలని ప్రయత్నించరు. బుజ్జగించడం, బతిమిలాడడం ద్వారా పిల్లల్లో క్రమశిక్షణ తీసుకువచ్చేందుకు ప్రయత్నిస్తారు. విసుగు చూపాల్సిన సందర్భాల్ని కూడా ప్రేమగా అర్థం చేసుకుని ప్రేమగా వ్యవహరించడం నేటి నాన్న నైజం. నిజానికి పిల్లలను కొట్టాలన్న ఆలోచనకే తండ్రులు విరుద్ధం. అంతగా పిల్లల పట్ల ఆపేక్ష, మమతానురాగాలు తండ్రుల్లో ఉన్నాయి.





### విహారయాత్రలతో ఆనందంగా...

అవకాశం, ఆర్థిక వెసులుబాటు ఉన్నప్పుడల్లా పిల్లలతో విహార యాత్రలకు వెళ్లడానికి మక్కువ చూపుతున్నాడు నేటి నాన్న. పిల్లలను విహారయాత్రలకు తీసుకెళ్లి కొత్త కొత్త ప్రాంతాలను, అక్కడి మనుషుల అలవాట్లను, వింతలు, విశేషాలు పరిచయం చేయడానికి ఎంతో ఆసక్తి చూపిస్తున్నాడు. అందుకోసం ప్రతీ యేటా తమ ఆదాయంలో కొంత మొత్తాన్ని కూడా పక్కన పెట్టి పిల్లల సంతృప్తే తమ లక్ష్యంగా ముందుకు సాగుతున్నారు.

### నాన్న కోసం

"ఓ నాన్నా... నీ మనసే వెన్న... అమృతం కన్నా అది ఎంతో మిన్న..." అని పాట రాసినా, "ఔదార్యాన్ని, గాంభీర్యాన్ని, అనురాగాన్ని, త్యాగాన్ని రంగరిస్తే తయారయ్యే ఆత్మీయ రూపం నాన్న" అని ఓ కవి వర్ణించినా, "గమ్యం వైపు నడిపించే దీపస్తంభం నాన్న" అంటూ కవితాత్మకంగా వివరించినా అంతా నాన్న గొప్పతనం గురించే! ఎందరో ప్రముఖులు తమ కథల్లో, కవితల్లో నాన్నను ఆవిష్కరించారు. ఒకప్పుడు అమ్మప్రేమ మీద కవిత్వం పెల్లుబికితే నేడు ఎక్కువగా నాన్న మీద కవితలు పుట్టుకొస్తున్నాయి. అంతేకాదు. పాతతరం నుంచి వర్తమానం వరకూ ఎన్నో సినిమాలు కుటుంబంలో, సమాజంలో నాన్నకు గల ప్రాముఖ్యతను వివరిస్తూ వచ్చినవే. నాన్న, ఆకాశమంతా, నాన్నకు ప్రేమతో, సన్నాఫ్ సత్యమూర్తి... ఇలా ఎన్నో సినిమాలు నాన్నతో ఉన్న అనుబంధాన్నీ, ఆత్మీయతనూ వివరిస్తూ వచ్చాయి. ఇంకా వస్తున్నాయి.

—లక్ష్మీనర్మద



రాత్రి పదిదాటింది. రోడ్లమీద జనం పల్చబడు తున్నారు. సాధారణంగా బిజీగా ఉండే ఆ బంక్‌లో ఆదివారంరాత్రి మాత్రమే కొంచెం పని తగ్గుతుంది. శుక్ర, శనివారాల్లో రాత్రులు తిరిగే సాఫ్ట్‌వేర్‌వాళ్ళతో అసలు తీరిక ఉండదు. తెల్లారితే మళ్ళీ పనులకు వెళ్ళాలనే స్పృహవల్ల కాబోలు ఆదివారం రాత్రి పది తర్వాత మాత్రం పబ్లిక్‌నుంచి కొంచెం తీరుబడి దొరుకుతుంది. నరేష్ వెళ్ళి ఒక పక్కగా ఉన్న స్టూల్ మీద కూర్చుంటూ, పక్కనపెట్టిన బుక్ చేతుల్లోకి తీసుకున్నాడు.

పరీక్షలు దగ్గర పడుతున్నాయి. వారమంతా అస్సలు కుదరడంలేదు. ఇలా టైం దొరికినప్పుడే చదవగలుగుతున్నాడు. కాని అలసటవల్ల పుస్తకం పట్టుకోగానే నిద్ర వచ్చేస్తోంది.

నరేష్ జేబులో సెల్ వైబ్రేట్ అయ్యింది. బయటకు తీసి చూశాడు. "అమ్మ" అన్న అక్షరాలు మెరుస్తున్నాయి. గుండె భారమైంది. బంకులోంచి దూరంగా నడిచి "హల్లో అమ్మా" అని పలకరించాడు.

"చిన్నా అన్నం తిన్నావా?" ఆప్యాయంగా అడిగింది అమ్మ గొంతు.

నరేష్ గొంతులో వేదన సుడులు తిరిగి కళ్ళల్లో నీళ్ళరూపంలో బయటకి వచ్చే ప్రయత్నం చేస్తోంది.



# విచక్షణ

## మృదులాంజలి

రివ్వున బంకులోకి వచ్చి ఆగింది బైక్. అతని దగ్గరకొచ్చి "ఎంత" అడిగాడు నరేష్.

"టూ లీటర్స్ అన్నా" అంటూ జేబులోంచి సెల్‌ఫోన్ తీశాడు బైక్ కుర్రాడు.

"బంక్‌లో సెల్‌ఫోన్ వాడకూడదు" చెబుతూ టాంకులోకి పెట్రోల్‌గన్ పెట్టి "జీరో చూసుకో" అన్నాడు.

నరేష్ మాటకు విలువిచ్చి ఫోన్ మళ్ళీ జేబులోకి తోసేశాడు ఆ బైక్ కుర్రాడు.

పెట్రోల్ పోయడం అయ్యాక "టూ లీటర్స్‌కి తీస్కో" క్యాషియర్‌కి చెప్పాడు నరేష్.

"తిన్నానమ్మా, మీరెలా ఉన్నారు?" ఒకచేత్తో కన్నీటిని తుడిచేస్తూ, గొంతులో హుషారు పలికిస్తూ అడిగాడు.

"మేము బాగానే ఉన్నాం చిన్నా. నువ్వు జాగ్రత్త. ఉదయాన్నే కాలేజికి పోవాలి కదా, ఎక్కువసేపు మేల్కొని ఉండబాకు, త్వరగా పడుకో పరీచ్చలట కదా, జాగ్రత్తగా చదువుకో నాన్నా" అమ్మ జాగ్రత్తలు చెబుతోంది.

"నాన్న ఎలా ఉన్నాడమ్మా?"

"బానే ఉన్నాడయ్యా, ఇయ్యాలే పొలంలో మందులు తోలిపిచ్చినాడు. రేపు మందుచల్లేతానికి అందర్నీ పిలిచినాడు. ఈసారైన పత్తి మంచిగ వస్తాదని ఆ బగవంతుని మొక్కుతుండా, ఏమవుతాదో చూడాల."

ఈసారి తల్లి గొంతులో ఆవేదన. పంట వేసిన ప్రతీసారి ఇలాగే ఆశపడడం, చివరికి ఏదోరకంగా నష్టపోవడం జరుగుతూనే ఉంది. ఇప్పటికే చానా

## పరిణీతి అబద్ధాలు చెప్పిందా?

చెప్పిందనే అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఆ మధ్య ఓ ఇంట ర్వ్యూలో పరిణీతి చోప్రా తను చాలా పేదరికంలోంచి వచ్చాననీ, స్కూలుకు వెళ్ళేందుకు సైకిల్ ఉపయోగించేదాన్ననీ, ఆ సమయంలో కొంత మంది కుర్రాళ్ళు తన పట్ల అసభ్యంగా ప్రవర్తించేవారనీ, ఆ సమయంలో తన తల్లిదండ్రుల మీద తనకు విరక్తి కలిగిందంటూ చాలా కబుర్లు చెప్పి అందరి సింపతీ పొందే ప్రయత్నం చేసింది. ఇప్పుడు ఆ ప్రయత్నమే ఆమెను నలుగు రిలో నవ్వులపాలు చేసింది. అయితే పరిణీతి చెప్పేవన్నీ పచ్చి అబద్ధాలనీ, ఆ రోజుల్లో ఆమె కారులో స్కూలుకు వచ్చేదంటూ అందుకు సంబంధిం చిన కొన్ని ఫొటోలను ఆమె స్నేహితులు సోషల్ మీడియాలో పోస్ట్ చేసే సరికి పరిణీతి అసలు రంగు బయటపడింది.

---

అప్పులయ్యాయి. మరోవైపు, నరేష్ చెల్లెలు పెళ్ళికి ఎదిగివచ్చింది. పిల్ల పెళ్ళి చేయాలన్న గుబులు.

"అంతా బాగనే అవుతాదమ్మా, నువ్వేం పరే షాన్ కాబోకు" అమ్మకి ధైర్యం చెప్పాడు నరేష్. కానీ వాళ్ళని ఈస్థితికి తెచ్చింది తానేనన్న ఆలోచన అత డిని పురుగులా తొలిచేస్తోంది.

"మంచిది నాన్నా, త్వరగా పడుకో" అమ్మ చెబుతోంటే కన్నీటిధారలు ఆగలేదు.

ఫోన్ జేబులోకి తోస్తూ గట్టిగా నిట్టూర్చి బంకులో తను కూర్చున్న స్టూలు దగ్గరకు నడిచాడు నరేష్.

మూడేళ్ళ క్రితం నల్గొండజిల్లాలో ఓ మారు మూల గ్రామం నుంచి పదిమైళ్ళ దూరంలో ఉన్న మండల గవర్నమెంటు జూనియర్‌కాలేజీలో మంచి మార్కులతో ఇంటర్ పాసయ్యాడు తను. ఉస్మానియా ఇంజనీరింగ్ కాలేజీలో ఫ్రీ సీట్ తెచ్చుకున్నాడు. ఆ ఆనందంతో అమ్మానాన్నలవేకాక, ఊళ్ళో అందరి ఆశలూ మూటకట్టుకుని హైదరాబాదుకొచ్చాడు. బెరుగ్గా

> **ఆ పెట్రోలు బంకులోకి సర్రున దూసుకొచ్చిందో కారు. ట్యాంక్ ఫుల్‌చెయ్, డ్రైవింగ్ సీటులో యువకుడు దర్పంగా అన్నాడు. ఆ పని చేస్తున్న బంకులో కుర్రాడు యథాలాపంగా కారు వెనకసీట్లోకి చూశాడు. అతనికేదో సందేహం వచ్చి మళ్ళీ నిశితంగా గమనించి ముందు సీట్లోకి కూడా చూసి గుర్తుపట్టాడు ఆ ఇద్దరినీ. పెట్రోల్‌గన్ ఆ సీట్లోకి వదిలి అగ్గిపుల్లగీసి అంటించాలన్నంత ఆగ్రహం వచ్చిందా కుర్రాడికి. ఎందుకని?**

హైదరాబాద్‌లో బస్ దిగిన ఆ రోజు అతడి కళ్ళ ముందు మెదిలింది.

నాన్నకి సిటీ అస్సలు తెలియదని కాలేజీలో మాస్టారిని తోడు తెచ్చుకున్నాడు నరేష్. మంచి బ్రిలియంట్ కుర్రాడు, పైకిరావాలన్న పట్టుదల ఉన్న వాడన్న అభిమానంతో మాస్టారు సెలవుపెట్టిమరీ వచ్చి నరేష్‌ని కాలేజీలో, హాస్టల్లో చేర్పించి వెళ్ళారు.

కాలేజీ వాతావరణం అల వాటు కావడానికి పెద్ద ఇబ్బంది పడలేదుగానీ, హాస్టల్లో రకరకాల మనుషులతో నరేష్‌కి కొత్తకొత్త అనుభ వాలు ఎదురయ్యాయి. అయినా అవేమీ పట్టించుకోకుండా తన దృష్టి చదువుమీద పెట్టాడు. ఇంగ్లీష్ భాషమీద పట్టులేకపోవడం మొదట్లో బాధపెట్టినా, క్రమంగా పట్టుదలతో దాన్ని అధిగమించగలిగాడు.

ఇంగ్లీషు నేర్చుకోవడం కోసం ఎక్కువసేపు లైబ్ర రీలో పుస్తకాలు చదువుతూ, ఆడియోవిజువల్ సెక్షన్‌లో గడుపుతూ మొత్తానికి మొదటి సంవత్సరం క్లాసులో టాప్ స్టూడెంట్‌గా నిలిచాడు. ప్రొఫెసర్లు, మిగతా స్టూడెంట్లు అదేపనిగా పొగుడుతుంటే నరేష్ పొంగి పోయాడు. పొగడ్త ఎంత కొంపముంచుతుందో తెలియక ఆ ఊబిలో పడిపోయాడు. క్రమంగా తన మీద తనకే నమ్మకం పెరిగిపోయింది. చదువు నెమ్మదిగా అటకెక్కసాగింది.

అదిగో అప్పుడే "హాయ్, నాపేరు నిశిత" అంటూ దగ్గరకొచ్చిన అమ్మాయిని రెప్పలు ఆర్పకుండా చూశాడు నరేష్. పాలమీగడలో పసుపు కలిపినట్టు ఉన్న మేనిచాయతో, ఆల్చిప్పల్లాంటి కళ్ళతో పట్టు కుచ్చులాంటి జుట్టు తరచు కళ్ళమీద పడుతుంటే, పొడవైన వేళ్ళతో అలవోకగా చెవి వెనగ్గా పెట్టే ప్రయత్నం చేస్తున్న నిశిత, నరేష్ కళ్ళకి అద్భుతంగా కనిపించింది.

అసలింతవరకూ ఆ అమ్మాయి తన క్లాసే అన్న విషయం కూడా తనకి తెలియనందుకు నరేష్ తనను తానే తిట్టుకున్నాడు.

"హాయ్" అన్నాడు ఇబ్బందిగా.

"నిజంగా మీరు చాలా గ్రేట్ నరేష్. మీ అంత పట్టుదల నాకుంటే బాగుండును. ఇంతవరకు ఏ క్లాసులో ఉన్నా నేనే ఫస్ట్ తెలుసా! దిస్ ఈజ్ ద ఫస్ట్ టైం నేను ఫస్ట్ రాకపోవడం. అయినా అమ్మా యిల్లో నేనే ఫస్ట్ లెండి." నాజూకైన చేతిని చాస్తూ నిశిత అంటుంటే నరేష్‌కి ఊపిరి ఆడనట్టు అనిపిం చింది. పక్కనున్న ప్రసాద్ మోచేత్తో డొక్కలో పొడిస్తే ఉలికిపడి నిశిత చేయి అందుకున్నాడు.

"నా ఫ్రెండ్స్ అంకిత, రమ్య" పక్కనున్న అమ్మా యిలను పరిచయం చేసింది.

"హాయ్" అమ్మాయిలు, అబ్బాయిలు ఒకేసారి చెప్పారు. వెంటనే ఫక్కున నవ్వారు.

మరో పదినిమిషాల్లో అందరూ ఫ్రెండ్స్ అయి పోయారు. "కమాన్ క్యాంటీన్‌కి వెళదాం" అంకిత అన్నది.

నరేష్ గుండె కిందకి జారింది. క్యాంటీన్ అంటే ఖర్చు. అది తనకు సరిపోదు. "నాక్కొంచెం పనుంది" అన్నాడు.

"జస్ట్ టెన్‌మినిట్స్, అందరం వెళ్ళాలిగా." అంకిత మరోమాటకి తావివ్వకుండా ముందుకు నడిచింది.

ప్రసాద్ మళ్ళీ మోచేత్తో పొడిచాక నరేష్‌కి కద లక తప్పలేదు.

పదినిముషాలన్నది గంట అయ్యింది. కబుర్లకి, నవ్వులకి అంతులేకుండా పోయింది.

క్యాంటీన్ నుంచి బయటకి వచ్చినప్పుడు నరేష్ గుండె ఆనందంతో నిండిపోయింది. తన జీవితంలో అంత ఆనందం తను ఎప్పుడూ పొందిన గుర్తులేదు. చివరకు తనకి కాలేజీ ఫస్ట్ వచ్చినప్పుడు, ఉస్మాని యాలో సీట్ వచ్చినప్పుడు కూడా ఇంత ఆనందం అనిపించలేదు. ఆ ఆనందంలో తన పర్సు ఖాళీ అయిందన్న సంగతి కూడా నరేష్ మర్చిపోయాడు.

అది మొదలు ఇటు ప్రసాద్, అటు అంకిత కలిసి

నరేష్‌ని కొత్త బంగారులోకంలోకి తీసుకుపోయారు.

అమ్మాయిల వంకపెట్టి ప్రసాద్ నరేష్‌ని షాపులకి, హోటళ్ళకి తిప్పేవాడు. అటు అంకిత నరేష్ వంకతో ప్రసాద్‌ని లైన్లోపెట్టే ప్రయత్నంలో ఉందని నరేష్‌కి తెలియలేదు.

నిశిత చదువు గురించే మాట్లాడేది కానీ, ప్రసాద్, అంకితల లేనిపోని మాటలవల్ల నరేష్ మాత్రం నిశిత మాటల్లో గూఢార్థాలు వెతికే ప్రయత్నం చేసేవాడు.

సినిమాల ప్రభావంవల్ల నిశిత తనని ప్రేమిస్తోందని అనేసుకున్నాడు నరేష్. ప్రసాద్, అంకితలు దానికి కొంచెం మాటల సాయం చేస్తూ, మొత్తానికి నరేష్‌ని చదువునుంచి పక్కకి లాగేశారు.

రెండోసంవత్సరం పరీక్షల్లో అన్ని సబ్జెక్టుల్లో ఫెయిల్ అయ్యాడు నరేష్. మొదటిసంవత్సరంలో అతిగా పొగిడిన మాస్టార్లే, తలవాచేలా చీవాట్లు పెట్టేసరికి నరేష్ దిమ్మెరపోయాడు.

ఒక్కసారిగా మత్తువదుల్చుకుని చూసుకునేసరికి ఏముందీ, అసలు సరిగ్గా క్లాసులకు అటెండ్ అవ్వలేదు, పుస్తకాలు ముట్టలేదు, ఒక్క ప్రాక్టికల్ చేయడంరాదు. మరోపక్క ఆఫీజు, ఈఫీజు అంటూ రించాడు.

"ఏమిటి ప్రాబ్లం" పక్కనున్న చైర్ లాక్కుని కూర్చుంటూ అడిగింది నిశిత.

"ఏ ప్రాబ్లం?" ఎదురు ప్రశ్నించాడు.

"ఈసారి నేనెందుకు క్లాస్‌ఫస్ట్ వచ్చానో తెలుసా, నువ్వు సరిగ్గా చదవకపోబట్టి, ఎందుకు ఇలా తయారయ్యావు అని అడుగుతున్నాను" నిశిత అలా సూటిగా కళ్ళల్లోకి చూస్తూ అడుగుతుంటే నరేష్ తడబడ్డాడు.

"ఏమో నాకు తెలీదు" ఎటో చూస్తూ చెప్పాడు.

"ఇటు నావైపు చూసి చెప్పు" నిశిత గద్దించినట్టు అడిగేసరికి ఇక తప్పక ఆమె ముఖంలోకి చూశాడు.

"నన్ను ప్రేమిస్తున్నావా?" తుపాకీ గుండులా సూటిగా వచ్చిన ప్రశ్నకి ఉలికిపడ్డాడు నరేష్.

తలదించుకోబోతుంటే నిశిత నాజూకువేళ్ళ నరేష్ గడ్డంపట్టి పైకి లేపాయి.

"చూపు తిప్పుకోకుండా సూటిగా చెప్పు" ఆమె గొంతులోని అధికారానికి నరేష్ లొంగిపోయాడు.

అవును కాదన్నట్లు తలూపాడు.




ఇంటినుంచి తెప్పించిన డబ్బు లెక్కకు మిక్కిలిగా ఉంది. అసలు అంత డబ్బు తనెలా ఖర్చు పెట్టాడో, నాన్న ఎలా పంపగలిగాడో అన్న ఆలోచన మొదటిసారిగా నరేష్ మనసులోకి వచ్చింది.

క్లాసులో మాస్టార్ల తిట్లు, హాస్టల్లో మిగతా ఫ్రెండ్స్ హేళన నరేష్‌ని చెంపమీద చెళ్లుమని కొట్టినట్లు అనిపించింది. నెమ్మదిగా నిశిత గ్రూప్‌తో దూరంగా ఉండడం మొదలుపెట్టాడు. సెకండ్ ఇయర్‌లో నిశితే క్లాస్ ఫస్ట్!

తోటివారి హేళనమాటలు గుండెను కోస్తుంటే మాస్టర్లు వేలెత్తి చూపుతుంటే ఆత్మహత్య చేసుకోవాలన్న ఆలోచన నరేష్ మనసుని తొలిచేసింది. అంతలోనే అమ్మ, నాన్న పడుతున్న కష్టం గుర్తొచ్చింది. చెల్లెలు పెళ్ళికి తన ఆత్మహత్య ఆటంకం అవుతుందనిపించింది. కుటుంబం గుర్తొచ్చాక నరేష్ తన మానసిక దౌర్బల్యాన్ని గుర్తించాడు. సిగ్గుపడ్డాడు.

"హాయ్ నరేష్" లైబ్రరీలో ఒక మూలగా కూర్చుని ఆలోచనలో మునిగిపోయిన నరేష్ ఉలికిపడ్డాడు.

ఎదురుగా నిశిత. "హాయ్" ముక్తసరిగా పలకరించాడు.

నిశిత ఒక్క నిమిషం మౌనంగా ఉంది.

"నా గురించి పూర్తిగా తెలియదుకదా నీకు, ఇప్పుడు చెప్తా విను. మా నాన్న పెద్ద బిజినెస్ మ్యాగ్నెట్. ఆయనకు ప్రపంచవ్యాప్తంగా బిజినెస్ సెంటర్స్ ఉన్నాయి. ఆయన నెలలో మూడువంతులు విదేశాల్లో ఉంటారు. ఇక మా అమ్మ చాలా హైక్లాస్. ఎక్కువ సమయం కిట్టీ పార్టీల్లో గడుపుతుంది. కిట్టీ పార్టీలంటూ దుబాయ్, లండన్‌లలో అలవోకగా తిరుగుతుంది. వాళ్ళకి నేనొక్కదాన్నే సంతానం. నాన్న తన బిజినెస్ అంతా నాకు అప్పజెప్పాలనే ఆలోచనలో ఉన్నాడు. అమ్మ నన్ను మరో రిచ్‌మేన్‌కు ఇచ్చి సెటిల్ చేయాలని చూస్తోంది. నా గోల్ మాత్రం బిజినెస్‌లో రాణించడం. ఈ ప్రేమలు, దోమలు నాకు నచ్చవు. నువ్వు బ్రిలియంట్ స్టూడెంట్ అనీ, రూరల్ బ్యాక్‌గ్రౌండ్ నుంచి వచ్చావు కాబట్టి బాధ్యతగా ఉంటావని, నీతో స్నేహం చేశాను. అది కేవలం స్నేహం మాత్రమే! ఒకవేళ నా ప్రవర్తన ఏమన్నా తప్పుగా ఉండి నిన్ను దారి తప్పేలాచేస్తే ఐయాం సారీ! నీకు మంచి ఫ్యూచర్ ఉంది. నీ గోల్ గుర్తుంచుకుని బాగా చదువు. నీకు ఇష్టంలేకపోతే నేను నీతో మాట్లాడను కూడా. గుడ్‌బై" నిశిత లేచి వెళ్ళిపోతుంటే మూగవాడిలా ఉండిపోయాడు నరేష్.

గొంతెత్తి పిలవబోతుండగా ఫోన్ వైబ్రేట్ అయింది. "అమ్మ" అన్న అక్షరాలు మెరుస్తున్నాయి.

గబగబా లైబ్రరీ బయటకి నడిచి "హలో అమ్మా" అన్నాడు.

అవతలి నుంచి ఏడుస్తున్న శబ్దంతో పాటు అమ్మ గొంతు. "చిన్నా నాన్నకి అస్సలు బాగోలేదురా నువ్వు వెంటనే రా" ఫోన్ కట్ అయ్యింది.

నరేష్ ఎలా హాస్టల్ వరకు వచ్చాడో, అక్కడ నుండి బస్టాండ్‌కి ఎలా వెళ్ళాడో, ఇంటికి ఎలా వచ్చాడో తెలియలేదు.

ఇంటిదగ్గర ఎవరూ లేరు. నాన్నను తీసుకుని దవాఖానాకి వెళ్ళారంటే అటు పరుగెత్తాడు.

అమ్మ శోకదేవతలా మంచంపక్కన నిలుచుంది. చెల్లి ఏమీ చేయలేక అలా అని మౌనంగా ఉండలేక తత్తరపడుతోంది. మంచంమీద నాన్న నిస్త్రాణగా పడి ఉంటే నరేష్ కళ్ళు నిండుకుండలే అయ్యాయి. అమ్మ భుజం చుట్టూ చెయ్యేశాడు. "చిన్నా" అంటూ భోరుమంది అమ్మ.

మాట్లాడలేక అమ్మని గట్టిగా హత్తుకున్నాడు నరేష్. మంచంమీద నాన్న చాలా చిక్కిపోయి ఎముకలగూడులా ఉన్నాడు.

తిండి గురించి కూడా పట్టించుకోకుండా పని చేస్తున్నాడురా. కొంచెం తినిపోరాదా అయ్యా అంటే వినేవాడుగాదు. ఇయ్యాల పొద్దుగాలనే పొలానికని బైలెల్లి గుమ్మంలోనే కూలబడ్డాడు." ఏడ్చు కుంటూ చెపుతోంది అమ్మ.

నరేష్ గుండెను కత్తితో కోసినట్టు ఫీలయ్యాడు. కడుపు కట్టుకుని నాన్న తన చదువుకోసం డబ్బు పంపుతుంటే తను మాత్రం బాధ్యత మరచి జల్సాలకి అలవాటు పడ్డాడు. చదువు అటకెక్కి రోడ్డున పడే పరిస్థితి తెచ్చుకున్నాడు.

నిశిత మాటలు గుర్తొచ్చాయ్. పల్లెటూరివాడివని, బాధ్యతగా ఉంటావని నీతో స్నేహం చేశానన్న ఆమె మాటల్లో ఎంత నిజం ఉందో అర్థమైంది. తన బాధ్యతను నిశిత గుర్తుచేసినట్టనిపించింది నరేష్‌కి.

ఒకవేళ తను ఆవేశపడి ఆత్మహత్య చేసుకుని ఉంటే తన కుటుంబం ఏమైపోయేదో అన్న ఆలోచనతో వణికిపోయాడు నరేష్.

తర్వాత నాన్న కోలుకునేవరకు ఊళ్ళోనే ఉండి పొలం పనుల్లో సాయం చేసి ఆ తర్వాత హాస్టల్‌కి వచ్చాడు నరేష్.

"ఏరా మామా, ముందు సినిమా, తర్వాత హోటల్, ఓకేనా" ప్రసాద్ వచ్చి వాలిపోయాడు. ఇంతవరకు వాడి తియ్యని మోసపూరితమైన మాటలకి తనెంత ఫూల్ అయ్యాడో గుర్తుచేసుకుంటూ, "లేదురా మామా, కొంచెం పని ఉంది" అని చెప్పి గది సర్దుకునే పనిలో పడ్డాడు నరేష్.

"అబ్బ పనిదేముందిరా, వచ్చాక చేసుకోవచ్చు. నిశిత, అంకిత కూడా వస్తామన్నారు" చెప్పాడు ప్రసాద్.

నరేష్ ఒకసారి ఆలోచించాడు. ప్రసాద్ ప్రతీ

సారి అలానే చెప్పి బయలుదేరదీసేవాడు! కానీ నిశిత వచ్చేదికాదు. అంకిత మాత్రమే ఉండేది. నిశిత గురించి అడిగితే ఏదో కథ చెప్పేవారు. అదంతా ప్రసాద్, అంకిత కలిసి చేసిన జల్సా ప్లాన్ అని అర్థమైంది.

"అరే మామా, మీ డాడ్ యేం చేస్తార్రా?" మొదటిసారి ప్రసాద్‌ని అడిగాడు నరేష్.

గొంతులో వెలక్కాయ్‌పడ్డట్టు చూశాడు ప్రసాద్. వెంటనే తేరుకుని "ఏరా మామా, అంత సడన్‌గా అడిగావు?" అంటూ తేలిగ్గా తీసేయబోయాడు.

"మా నాన్న రైతురా. ఉన్నది రెండెకరాలేగానీ కష్టపడతాడు. మీనాన్న ఏం చేస్తాడు?" రెట్టించి అడిగాడు నరేష్.

"మా బాబు సర్కారీ నౌకరీలేరా" నెమ్మదిగా లేచి బయటకు నడుస్తూ అన్నాడు ప్రసాద్.

"అదే ఏ నౌకరీ అని అడుగుతున్నా" గట్టిగా అడిగాడు నరేష్. అతని మాటల్లోని వాడి, సూటిదనం అర్థం చేసుకున్న ప్రసాద్, "ఏ నౌకరి అయితే నీకెందుకు" అంటూ విసురుగా బయటకు నడిచాడు. ఇంతవరకూ తనని తీయని మాటలతో మోసంచేసి తన పబ్బం గడుపుకున్నాడని నరేష్‌కి అర్థమైంది. ప్రసాద్‌కి తోడుదొంగ అంకిత అని కూడా అర్థమైంది.

మరుసటిరోజు కాలేజీ ఆఫీసులో వాళ్ళిద్దరి చిరునామాలూ వెరిఫై చేశాడు నరేష్. ప్రసాద్ తండ్రి గవర్నమెంటు ఆఫీసులో పనేగానీ, అటెండర్. జీతం నెలకు పన్నెండువేలు. ఇంక అంకిత తల్లిదండ్రులు రోజుకూలీలు. తనద్వారా వాళ్ళ జల్సాలు తీర్చుకునేవారన్నమాట. వాళ్ళమీద కన్నా తనమీద తనకే కోపం వచ్చింది నరేష్‌కి. ఇప్పటికైనా తనకు బుద్ధొచ్చినందుకు ఆ భగవంతునికి కోటిదండాలు అనుకుంటూ క్లాసువైపు నడిచాడు నరేష్. నిశితను చూసి పలకరింపుగా నవ్వి తన సీట్లో కూర్చున్నాడు. నరేష్‌లో పూర్వపు పట్టుదల వేళ్లూనింది. ఆరోజే హాస్టల్‌కి దూరంగా ఉన్న పెట్రోల్‌బంక్‌లో పార్ట్‌టైం పనిలో చేరాడు. ఇక ఇంటి నుంచి డబ్బులు తెప్పించుకునే ప్రసక్తేలేదు అని దృఢంగా నిశ్చయించుకున్నాడు నరేష్.

షార్ప్‌గా హారన్ మోగిస్తూ ఓ కారు సర్రున బంకులోకి వచ్చి ఆగింది. ఆలోచనల్లోంచి బయటపడి పుస్తకం పక్కనపెట్టి లేచాడు నరేష్. చలిబాగా ఉండడంతో తలకిపెట్టిన మంకీక్యాప్ సర్దుకుంటూ కారువైపు నడిచాడు.

"హే టాంక్‌ఫుల్ చెయ్" డ్రైవింగ్ సీట్లో యువకుడు చెప్పాడు. ఆ అబ్బాయి వాలకం చూస్తుంటే బాగా తాగినట్టున్నాడు.

మౌనంగా పెట్రోల్‌గన్ తీసుకుని ట్యాంక్‌వైపు నడుస్తున్న నరేష్ వెనుకసీట్లో ఒకరిమీద ఒకరుపడి ఉన్న వాళ్ళకేసి పరిశీలనగా చూశాడు. చీకట్లో సరిగా కనిపించడంలేదు. "జీరో చూడండి" విండో గ్లాసు మీద కొట్టి చెప్పాడు.

గ్లాస్ సర్రున కిందకి జారింది.

"అక్కర్లేదు నువ్వే చూసి పోసేయ్. మేం అలాంటి చిల్లర విషయాలు పట్టించుకోం" కిటికీలో తలపెట్టి చెప్పాడు వెనక సీట్లో కుర్రాడు.

నరేష్ కొంచెం పరిశీలనగా వెనక సీటుకేసి చూశాడు. అతని అనుమానం నిజమే, వెనక సీట్లో ప్రసాద్, అతని ఒడిలో వాలిన మరో అమ్మాయి ఉన్నారు.

ఇద్దరూ బాగా తాగినట్టున్నారు. పెట్రోలుపోస్తూ మళ్ళీ ముందు సీటువైపు చూశాడు. డ్రైవింగ్ సీటులో కుర్రాడు కొత్తగా కనిపించాడు. అతని పక్కసీట్లో మాత్రం అంకిత.

"ఏంటి డార్లింగ్, ఇంకొంతసేపు ఉందామంటే డిస్కో నుండి బయటకు వచ్చేశావ్." ఆ అబ్బాయి జుట్టులో సుతారంగా వేళ్ళ కదుపుతూ అంటోంది.

వాళ్ళ మోసాలు తెలిసిన నరేష్‌కి మాత్రం కోపం సర్రున తలకెక్కింది. తనలాగే మరొకణ్ణి బకరా చేస్తున్నారన్న విషయం అర్థం చేసుకున్నాడు. ఒక్కసారి పెట్రోల్‌గన్ తీసి కారులోపలికి వదిలి ఒక్క అగ్గిపుల్ల గీసిపడేయాలని మనసు తొందరపెట్టింది.

అంతలోనే అతడి విచక్షణ వారించింది. ఇలాంటి వాళ్ళను చంపడంవల్ల తను హంతకుడవుతాడు. అమ్మానాన్నల ఆశలు గాల్లో కలిసిపోతాయి. ఈ మోసగాళ్ళు ఎలా పోయినాగానీ, తన జీవితం మాత్రం నాశనమైపోతుంది. ఇప్పటికే వాళ్ళవల్ల తను చాలా నష్టపోయాడు. ఇక వాళ్ళ గురించి ఆలోచించి తన సమయం వేస్ట్ చేసుకోకూడదు. అయినా ప్రసాద్, అంకిత లాంటివాళ్ళు మనచుట్టూ చాలామందే ఉంటారు. కానీ అలాంటివాళ్ళ నుంచి జాగ్రత్తగా ఉండడం తనలాంటి వాళ్ళకి చాలా అవసరం అనుకున్నాడు.

"సార్, అయ్యింది" ట్యాంకుమీద మూత బిగిస్తూ చెప్పాడు నరేష్.

డబ్బు చెల్లించి ఆ అబ్బాయి కారును రివ్వున బంకునుండి బయటకు దూకించాడు.

స్టూల్ మీదుంచిన పుస్తకం మళ్ళీ చేతిలోకి తీసుకుని, అమ్మానాన్నల ముఖాలు గుర్తుచేసుకున్నాడు నరేష్.

దేవుడిచ్చిన తెలివితేటలు అభివృద్ధిచేసుకోకుండా, జల్సాలంటూ తిరిగింది తను. దానికి మరొకరిని నిందించడమో, నిరాశపడి ఆత్మహత్యకి పాల్పడడమో మూర్ఖత్వమే అవుతుంది.

బాగా కష్టపడి చదివి అమ్మానాన్నల కలలు నిజం చేయాలి. చెల్లికి మంచి సంబంధంచూసి పెళ్ళిచేయాలి. ప్రస్తుతం తన లక్ష్యం అదే! దృఢంగా మనసులో అనుకుంటూ పుస్తకంలో తలదూర్చాడు నరేష్.

**సెల్: 98493 66519**




ఈ కవితను నేను
ఇప్పుడే రాసినట్టు నీ భావన.
నీ ముందే రాశాను కాబట్టి
ఇదెట్లా సాధ్యం అని ఆశ్చర్యం
కాగితం కనిపిస్తే చాలు

## సద్యఃకవిత

పెన్ను విలవిలలాడుతుందని నీ వెక్కిరింపు

స్థిమితంగా కూర్చున్నప్పుడు
ఆహా! జీవితం ఎంత బాగుందీ అని
ఎప్పుడూ అనిపించలేదా?
అసలు స్థిమితంగా ఉన్నదెప్పుడు
అని నా సమాధానం

ఇవాళ ఈ తోటలో
పక్షులు కలరవాలు వెదజల్లుతుంటే
ఎవరికో మొరపెట్టుకున్నట్టే ఉంది నాకు
పొద్దున్నే పారేసిపోయిన
వార్తాపత్రికలో
అక్షరాల వెంట పరుగెత్తుతుంటే
తరచుగా కళ్ళకు కాళ్లు విరుగుతాయి.
చూస్తుండగానే
కాగితం రక్తం రంగులోకి మారిపోతుంది.

పిడికిళ్ళు బిగుసుకుంటే
తెరిపారా చూస్తావు
చలిగాలిలో చెమటలేమిటని
విస్తుపోతావు.



ఒక్కమాట చెప్పనా!
ఈ అశాంతి బీజం
ఎప్పుడో పడింది
నువ్విప్పుడు చూస్తున్నది
దాని చిగుళ్ళు.

మిత్రుడా!
ఈ కవితను ఎప్పుడో రాశాను
ఇప్పుడు వ్యక్తమైందంతే!

–డా. ఎన్.గోపి



## ఆల్ ఇన్ వన్ ఆపిల్

రోజుకొక ఆపిల్ తింటే అదే సర్వరోగ నివారిణిలా పనిచేస్తుంది అంటున్నారు అధ్యయనవేత్తలు. దీన్ని ప్రతిరోజూ తీసుకునే వారిలో మెదడు చురుకుగా పనిచేయడంతో పాటు అల్జీమర్స్ వ్యాధి నుంచి కాపాడుతుందన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. దీనిలోని శక్తిమంతమైన యాంటీ ఆక్సిడెంట్లు పలు రకాల కేన్సర్లు రాకుండా అడ్డుపడుతాయన్న విషయం వీరి అధ్యయనంలో తేలింది. ఆపిల్ తినేవారిలో డయాబెటిస్ వచ్చే ముప్పు 30 శాతం తగ్గుతుందన్న విషయం తేలింది.

## నిద్రను దూరం చేసే ఒంటరితనం

ఒంటరితనంతో బాధపడేవారు నిద్రకు దూరమవుతారంటున్నారు లండన్ అధ్యయనవేత్తలు. 18 నుంచి 25 సంవత్సరాల వయస్సు కల 2500 మంది మీద వీరు దీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. ఇందులో కొందరు కుటుంబంతో కలిసి ఉండగా, మరికొందరు ఒంటరిగా ఉంటున్నారు. ఒంటరిగా ఉంటున్న వారిలో 30 శాతం మంది రాత్రి సమయంలో నిద్రకు దూరమవుతున్న విషయం గుర్తించారు. కుటుంబంతో ఉన్న వారిలో నిద్రలేమి అనేది ఉన్నా, మరీ ఎక్కువగా లేదని అధ్యయనవేత్తలు చెబుతున్నారు. ఒంటరితనం వల్ల నిద్రలేమితో పాటు పలు శారీరక, మానసిక సమస్యలు తలెత్తే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. ఒంటరిగా ఉన్నామన్న భావన రాకుండా నలుగురితో కలిసి మెలిసి తిరుగుతుంటే సమస్య నుంచి కొంత వరకూ తప్పించుకోవచ్చని వారు సూచిస్తున్నారు.




## అతి శుభ్రం అనర్థం



అతి ఎప్పటికైనా అనర్థమే అంటూంటారు. అలాగే అతి శుభ్రం కూడా పిల్లలను అనారోగ్యానికి గురి చేస్తుంది అని చెబుతున్నారు పరిశోధకులు. అతి శుభ్రం కారణంగా వారు చిన్న చిన్న వ్యాధుల బారిన పడే అవకాశం ఉందని అంటున్నారు. పెద్దవారి శరీరంలో కోటానుకోట్ల సూక్ష్మజీవులు సహజీవనం చేస్తూ ఉంటాయి. వాటిల్లో కొన్ని సూక్ష్మజీవులు శరీర ఆరోగ్యానికి దోహద పడతాయి. ఇలాంటి సూక్ష్మజీవులు చేతుల ద్వారా శరీరంలోకి ప్రవేశించి కడుపులో వృద్ధి చెందుతాయి. ఆ సూక్ష్మజీవులు పిల్లల శరీరంలో ప్రవేశించడానికి వీలు లేకుండా వారి చేతులను పదే పదే శుభ్రం చేస్తూంటే మంచి సూక్ష్మజీవులు పిల్లల శరీరంలోకి ప్రవేశించే అవకాశం ఉండదు. దీని కారణంగా వారు తరచూ చిన్న చిన్న అనారోగ్యాలకు గురవుతుంటారు. అందువలన పిల్లలను కొద్దిసేపు మట్టిలో ఆడుకోనివ్వాలని వారు సూచిస్తున్నారు. పిల్లలు ఆటల నుంచి వచ్చిన తరువాత తల్లులు పదే పదే వారి చేతులు సబ్బుతోనూ, లిక్విడ్‌తోనూ శుభ్రం చేస్తారు.

ఇలా చేయడం వలన మట్టి నుంచి లభించే మంచి సూక్ష్మజీవులను కూడా మనం పోగొట్టుకోవలసి వస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు. పిల్లలు ఆటల నుంచి ఇంటికి రాగానే వారి చేతులు నీటితో శుభ్రం చేస్తే సరిపోతుందని అంటున్నారు.

## పిల్లల గదిలో టీవీ ప్రమాదమే!



పిల్లల గదిలో టీవీ ఉంటే వారు ఊబకాయానికి దగ్గరవుతున్నట్టే అంటున్నారు పరిశోధకులు. ముఖ్యంగా ఆడపిల్లల గదిలో టీవీ ఉంటే 30 శాతం వరకూ ఊబకాయానికి గురయ్యే ప్రమాదం ఉందని చెబుతున్నారు. అదే మగపిల్లల్లో అయితే 20 శాతం ఊబకాయం వచ్చే అవకాశం ఉందని వారు స్పష్టం చేస్తున్నారు. ఈ మేరకు 12,500 మంది బ్రిటీష్ పిల్లల మీద దీర్ఘకాలం పరిశోధన నిర్వహించారు. మగపిల్లల కన్నా ఆడపిల్లలు త్వరగా బరువు పెరగడాన్ని వీరు గుర్తించారు. దీనికి గల కారణాలను కూడా వారు విశ్లేషించారు. పిల్లలు టీవీ చూస్తున్న సమయంలో సహజంగానే జంక్‌ఫుడ్‌ని ఇష్టపడతారు. ఆడపిల్లలు జంక్‌ఫుడ్ తింటూ ఒకచోట కదలకుండా కూర్చుంటే మగపిల్లలు గదిలోనే అటూ ఇటూ పరుగులు పెట్టడం, సోఫాలు, కుర్చీల మీద నుంచి గెంతడం వంటివి చేయడాన్ని పరిశోధకులు గుర్తించారు. మగపిల్లలు అటూ ఇటూ తిరగడం వలన వారిలో అధికబరువు అన్న సమస్య కొద్దిగా తగ్గిందనీ, అదే ఆడపిల్లల విషయానికి వచ్చేసరికి పెరగడానికి కారణం వారు ఉన్నచోట నుంచి కదలకపోవడమేనని వారు స్పష్టం చేస్తున్నారు. పిల్లల గదిలో టీవీలు, ల్యాప్ టాప్‌లు, కంప్యూటర్లు వంటివి ఉంచకూడదని వారు తల్లిదండ్రులకు సూచిస్తున్నారు.

—అవినాష్

## సరదాగా....

### అమ్మబడును

సంపత్ ఆఫీసునుంచి ఇంటికి తిరిగివస్తున్నాడు. దారిలో ఒకపక్క పెద్ద ఖాళీస్థలంలో టెంటు వేసి ఉంది. దానిముందు కట్టిన బ్యానర్‌లో "ఇచ్చట పెళ్ళికి సంబంధించిన అన్ని రకాల సరుకులు తక్కువ ధరలకే అమ్మబడును" అని రాసి ఉంది. సంపత్ టక్కున తన బైక్‌ను పక్కన పార్క్ చేసి లోపలికి వెళ్ళాడు. అక్కడ కౌంటర్ ముందున్న వ్యక్తి దగ్గరకు వెళ్ళి, "ఇక్కడ పెళ్ళికి కావలసినవన్నీ దొరుకుతాయా?" అని అడిగాడు. ఆ వ్యక్తి "మీకు ఏమేమి కావాలో చెప్పండి, అన్నీ చిటికెలో ప్యాక్ చేయించేస్తాను" అన్నాడు. వెంటనే సంపత్ "ముందు నాకు నలుగురు పెళ్ళికూతుళ్ళను చూపించండి. అందులో ఎవరైతే నచ్చారో వారిని వెంటనే కొనేసుకుంటాను" అని సీరియస్‌గా అడిగాడు.

### ఒక ప్రశ్న?

రామవరం ఒక మారుమూల పల్లెటూరు. పల్లెటూరన్న మాటేగానీ ఆ ఊర్లో సౌకర్యాలకు కొదవలేదు. గుడి దగ్గరనుంచి బడి వరకు, ఆస్పత్రి దగ్గరనుంచి ఆశ్రమాల వరకు అన్నీ ఉన్నాయి. ఆ ఊరంతటికీ పెద్ద దిక్కు వెంకట్రామయ్యగారు. ఆయనే ఆ ఊరి సర్పంచ్ కూడా! ఎవరికి ఏ సమస్య వచ్చినా వెంకట్రామయ్యగారి ఇంటిముందు వాలాల్సిందే. అవసరానికి ఆదుకునే ధర్మాత్ముడు ఆయన. ఊర్లో బడి, గుడి అన్నీ ఆయనే కట్టించాడు. ఊరి క్షేమం కోసం, ఊరివాళ్ళ బాగోగుల కోసం ఎక్కడికైనా వెళతాడు, ఎవరినైనా ఎదిరిస్తాడు. చుట్టుపక్కల గ్రామాల్లోనే కాదు ఆ జిల్లా మొత్తంమీద వెంకట్రామయ్య గారి గురించి తెలియనివారంటూ ఉండరంటే అతిశయోక్తి కాదు. ఆయన సతీమణి అన్నపూర్ణాదేవి. పేరుకి తగ్గట్టు నిజంగా అన్నపూర్ణే. పెట్టే చేతికి, తినే నోటికి అలుపంటూ ఉండదన్నట్టు ఆమె చేయి పెట్టే చేయే! ఆ దంపతుల చేతులమీదుగా ఎన్నో పెళ్ళిళ్ళు జరిగాయి. ఎన్నో నామకరణాలు జరిగాయి. మరి ఆ దంపతులకు సంతానం లేదా? అంటే ఎందుకు లేరు... పంచరత్నాలుగా పిలవబడే ఐదుగురు పుత్రరత్నాలున్నారు. ఆ పుత్రరత్నాలు ఐదుగురికీ, ఒక్కొక్కరికీ ఒక్కో చెల్లెలుంది. ఇంతకీ ఇక్కడ ప్రశ్న ఏమిటంటే వెంకట్రామయ్య గారి కుటుంబంలో ఎంతమంది ఉన్నారు? లెక్కలేసి, సమాధానం చెప్పేయండిక.

**సమాధానం**

ఎనిమిదిమంది. వెంకట్రామయ్యగారు, ఆయన సతీమణి అన్నపూర్ణాదేవి, వారి ఐదుగురు పుత్రరత్నాలు ప్లస్ వారికి గల ఏకైక చెల్లెలు.















②

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**మా కంపెనీ జీతం విషయంలో కూడా అంతర్జాతీయ ప్రమాణాలనే పాటిస్తుంది. వనజకు నెలకు అరవై వేలు జీతం. కన్వీయెన్స్, డ్రెస్ అలవెన్స్, లంచ్, వీకెండ్ ఔటింగ్స్, ఇయర్లీ పదిహేను రోజుల ప్లెజర్ ట్రిప్ వంటి పెర్క్స్, వసతులు కూడా ఉన్నాయి. ఇల్లు కొనుక్కుంటానంటే హౌసింగ్ ఋణం కూడా ఏర్పాటు చేస్తుంది. ఇవన్నీ ఎందుకంటే ఉద్యోగి కంపెనీ పట్ల లాయల్‌గా ఉంటూ వంద శాతం తమ శక్తియుక్తులను కంపెనీకే ధారపోయాలన్న పాలసీ. కాబట్టే మా కంపెనీలో ఉద్యోగం దొరకడమంటే ఎంతో పొటెన్షియల్ ఉంటేనే కానీ సాధ్యపడదు. పెద్ద పెద్ద ఐటీ కంపెనీల నుంచి రిజైన్ చేసి మా కంపెనీలో చేరుతుంటారు. ముప్పై వేలతో మొదలైన వనజ జీతం ఒక్క సంవత్సరంలోనే అరవై వేలకు చేరుకుంది.**

నేను నా ఐపీయస్ ఉద్యోగానికి రాజీనామా చేసి ఈ కంపెనీలో మూడు సంవత్సరాల కాంట్రాక్ట్ మీద సైన్ చేసి జాయినయ్యాను. అప్పుడే నేను చేరి రెండున్నర సంవత్సరాలు కావస్తోంది. నాది కాంట్రాక్టు కాబట్టి, టర్మ్స్ అండ్ కండీషన్స్ అన్నీ లీగల్ అగ్రిమెంట్ రూపంలో ఉంటాయి. నాకు నెలకు ముప్పై లక్షలు జీతం, ఛాఫర్డ్ 'ఆడీ' కారు వగైరా వగైరా వసతులు న్నాయి.

నేను అప్పట్లో అవమానకరమైన పరిస్థితుల్లో హైదరాబాద్ వదిలిపెట్టాల్సి వచ్చింది. మళ్ళీ జన్మలో హైదరాబాద్‌లో కాలు పెట్టనని ఆవేశంలో నిర్ణయం తీసుకుని ఈ కంపెనీలో జాయినయ్యాను కాబట్టి ఇక బెంగుళూరే నా స్థిర నివాసమనుకుని, కంపెనీలో చేరగానే 'వైట్ ఫీల్డ్'లో అపార్ట్‌మెంట్ కొనుక్కుంటానంటే, ఓ బ్యాంకు ద్వారా, నాలుగు కోట్ల రూపాయలు హౌసింగ్ లోన్ అరేంజ్ చేసింది కంపెనీయే. నాకు పెద్దగా ఖర్చులేమీ లేవు కాబట్టి నెలకు ఇరవై ఐదు లక్షలు ఇంటి లోనుకు అడ్జెస్ట్ అవుతుంది. ప్రతీ నెల మిగిలిన ఐదు లక్షలు కూడా నా బ్యాంకుఖాతాలోనే మూలుగుతుంటాయి. నేను కంపెనీలో జాయిన

య్యాక చాలా కేసులు, హై ప్రొఫైల్ వైట్ కాలర్ క్రైమ్స్‌ను విజయవంతంగా ఛేదించగలిగాను. దాంతో ప్రతీ సక్సెస్‌ఫుల్ కేసులోనూ క్లయింట్ నుండి కలెక్ట్ చేసిన రెమ్యునరేషన్‌లో కొంత పర్సంటేజ్ నా అకౌంటుకు ట్రాన్స్‌ఫర్ అవుతుంది. అదంతా వనజే చూసుకుంటుంది. ఏ కేసులోనైనా బోనస్ రాకపోతే అకౌంట్స్ డిపార్ట్‌మెంట్ వాళ్ళకు రిమైండర్ మెయిల్స్ పెట్టి వాళ్ళను చంపేస్తుంది. నాతో పాటూ తనక్కూడా బోనస్‌లో షేర్ ఉంటుంది. నా జీతం, బోనస్‌లు అన్నీ కలిపి సంవత్సరానికి సుమారు ఐదు కోట్ల వరకూ ఉంటాయి.



నేను ఆలోచనల్లో ఉండగానే, వనజ రెండు చేతుల్లో రెండు గ్రీన్ టీ మగ్గులు తీసుకుని లోపలి కొచ్చింది.

నిజానికి ఐయాం బ్యాడ్లీ ఇన్ నీడ్ ఆఫ్ ఏ టీ. 'థాంక్స్!' అన్నాను పొగలు కక్కుతున్న టీ మగ్ అందుకుని. నేను మామూలు టీ తాగను. గ్రీన్ టీ మాత్రం రోజుకు రెండు మూడు సార్లు తాగుతాను. అది కూడా కొంచెం ఎక్కువ మోతాదులోనే. అందుకే, మామూలు కప్పు కన్నా రెట్టింపు సైజున్న మగ్గులు వాడతాం. నన్ను చూసి వనజ కూడా అదే అలవాటు చేసుకుంది.

తను నా ఎదురుగా కూర్చుంటూ,

"ఆ బ్యాంకు వాళ్ళు కేసును సరిగ్గా డీల్ చేయడం లేదనిపిస్తోంది బాస్!" అంది. నన్ను 'బాస్' అని పిలవడం తనకు సరదాగా ఉంటుందంటే అదే కంటిన్యూ చేయమన్నాను. పారదర్శకంగా ఉన్న మగ్గుల్లో నుంచి బంగారు రంగులో పొగలు కక్కుతూ కనిపిస్తున్న టీని సిప్ చేసేసరికి ఉత్సాహం పొంగుకొచ్చింది. మేము తాగే గ్రీన్ టీలో వనజ నిమ్మరసం, పుదీనా, తేనె, కొత్తిమీరతో పాటు ఇంకా రెండు మూడు దినుసులు కలిపేసరికి ఒక గమ్మత్తయిన పరిమళం, రంగూ, రుచీ వస్తాయి. 'రెడ్ బుల్' తాగినంత శక్తి వస్తుంది. ఎంత అడిగినా అవేం దినుసులో చెప్పదు.

"అది అయ్యంగార్ ఫ్యామిలీ సీక్రెట్" అని తప్పించుకుంటుంది.

## జరిగిన కథ

**ఇం**టర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. బ్యాంకింగ్, పోలీసింగ్ అతడికిష్టమైన సబ్జెక్టులు. కేసులోకి ఎంటరయ్యాడంటే మొదటిరోజే ఫైల్లో సక్సెస్ అని రాసుకోవచ్చు. వైట్‌కాలర్ నేరాలను ఎన్నింటినో ఛేదించాడు. ఓ బ్యాంకు రాబరీ కేసు అతడికప్పగించారు. ఒకసారి ఆ కేసు ఫైలంతా చదివి, హైదరాబాద్ జోనల్ మేనేజర్‌తో మాట్లాడతాడు.

ఆ తర్వాత...

నేను టీ తాగుతూ రిలాక్స్‌డ్‌గా కూర్చుని,

"ఆ బ్యాంకు వాళ్ళ సంగతి నాకు బాగా తెలుసు. కింది నుంచి పై దాకా ఆఫీసర్లు, ఉద్యోగులు యూనియన్ విషయాలు తప్ప వారిలో బ్యాంకు బాగోగులు పట్టించుకునే నాథుడే లేడు. నా పర్సనల్ ఫైల్లో ఎక్కడా రాయలేదు గానీ నేను కొంతకాలం ఆ బ్యాంకులోనే పనిచేశాను" అన్నాను వనజతో.

"రియల్లీ!?" అని బోల్డంత ఆశ్చర్యపోయింది.

"అవును. మంచి ఆశయంతో స్వాతంత్ర్యం రాకముందే ఒక పేరు మోసిన వ్యాపార కుటుంబం స్థాపించిన ఆ బ్యాంకు ఈ రోజున యూనియన్ గొడవలతో, కుంభకోణాలతో, అల్లర్లతో, నష్టాలతో దిగజారే పరిస్థితి వచ్చింది. ఆ బ్యాంక్ ప్రధాన కార్యాలయం కోల్‌కతాలో ఉంది. అక్కడి నుంచే ఈ జాడ్యం మొదలయింది. లేకపోతే, ఇంత డబ్బూ, బంగారమూ చెస్ట్‌లో ఉన్నప్పుడు, నిన్నగాక మొన్న జాయినయిన ఒక జూనియర్ ఎంప్లాయీకి సీనియర్ మేనేజర్, హెడ్ క్యాషియర్ల దగ్గర ఉండాల్సిన రెండు సెట్ల తాళం చేతులు ఎలా దొరుకుతాయి? సీనియర్ ఆఫీసర్లు ఇద్దరికీ ఒకేసారి లీవు ఎలా ఇస్తారు? లీవ్ శాంక్షన్ చేసినా రిలీవర్ లేకుండా సీనియర్ అధికార్లు లీవులో ఎలా వెళ్తారు? ఇదంతా తప్పక యూనియన్ల ప్రభావమే అయి ఉంటుంది. ఉన్న నలుగురూ నాలుగు యూనియన్లకు చెందిన వారై ఉంటారు. ఎందుకంటే, ఆ బ్యాంకు ఉద్యోగులంతా రెండు మూడు యూనియన్లు, ఆఫీసర్లు రెండు యూనియన్లుగా విడిపోయి తన్నుకోవడమే వాళ్ళ ముఖ్య విధిగా ప్రవర్తిస్తుంటారు. మేనేజర్ ఒక యూనియన్‌కు చెందినవాడై, ఉద్యోగులంతా మరో యూనియన్ వారైతే ఇక ఆ బ్రాంచి బాగోగుల సంగతి పెరుమాళ్ళకే ఎరుక!" అన్నాను.

వనజకు కొన్ని పదాలు అర్థం కావు. అందుకే,

"పెరుమాళ్ళకే ఎరుక అంటే ఏమిటి బాస్!" అని అడుగుతూ వనజ నా వాక్ప్రవాహానికి అడ్డుకట్ట వేయకపోతే నేను అదే ధ్యాసలో పడి రెండు మూడు గంటలవరకు ఆ బ్యాంకు నిర్వాకాల

గురించి ఉపన్యసించేవాణ్ణే.

"ఓ మై గాడ్! ఐ లాస్ట్ మై ట్రాక్. జస్ట్ లీవిట్!" అని,

"సరే, నీ రిపోర్టులు సంగతి ఏమిటి?" అని ప్రశ్నించాను.

"బ్యాంక్ సెక్యూరిటీ ఆఫీసర్ కొన్ని మెయిల్స్ పంపాడు. ఫార్మల్‌గా పోలీసులకు ఇచ్చిన రిపోర్ట్ కాపీ, క్యాషియర్ పర్మనెంట్ అడ్రస్, బ్యాంక్ లొకేషన్స్ వంటి మరీ జనరల్ విషయాలు పంపాడు. నేనతనికి ఫోన్ చేసినా గ్రిల్ చేసినా అతనికేం తెలియదంటున్నాడు. అతనికి ఇంగ్లీష్ అర్థం కావడం లేదు. హిందీ, తెలుగు అసలే రావు. లొకేషన్లోనే ఉన్నాడు కానీ, బ్యాంకు వారికి పోలీసులకు మంచి సంబంధాలు లేనట్టున్నాయి. అతనికి కన్సర్న్ పోలీస్ ఆఫీసరెవరో తెలియదు. కనీసం పర్మనెంట్ మేనేజర్‌కు కూడా తమ బ్రాంచ్ ఏ పోలీస్ స్టేషన్ జ్యూరిస్డిక్షన్‌లోకి వస్తుందో కూడా తెలియదు. పోలీసులు కూడా వీళ్ళను పెద్దగా పట్టించుకోవడం లేదు. నామ్ కే వాస్తే ఎంక్వైరీ చేస్తున్నారు. ఇటీజ్ మెయిన్లీ బికాజ్ ఆఫ్ నాన్ కమ్యూనికేషన్ అండ్ నాన్ కోఆర్డినేషన్. మన హైదరాబాద్ బ్రాంచ్ ఆఫీసరేమో అది ఎక్కడో రిమోట్ విలేజ్ బ్రాంచ్ కాబట్టి తనకూ ఎక్కువ వివరాలు తెలియవని అంటున్నాడు" అని ఏదో చెప్పబోయి, ఆగింది.

నేను, ఆమె ముఖంలోకి చూసి "ఏంటి?" అని ప్రశ్నించాను.

"మీరు రంగంలోకి దిగాల్సిందే బాస్!"

"ఓ మై గాడ్! ఈ కేసు గురించి, నేను హైదరాబాద్ వెళ్ళాలా?" విస్తుపోయాను.

"యస్ బాస్!" అంది వనజ.

నాకు ఏడుపొచ్చేసింది. హైదరాబాద్ వెళ్ళాలంటే ఏదో బెరుకు. హైదరాబాద్ వదిలి నాలుగేళ్ళు అయినా, నేను ఇంత వరకూ ఆ ఊళ్ళో మళ్ళీ అడుగు పెట్టింది లేదు. ఎన్నో మంచి జాబ్ ఆఫర్లు వచ్చినా హైదరాబాద్‌లో పోస్టింగ్ అనడంతో ఒప్పుకోలేదు. కానీ, ఇప్పుడు తప్పేట్టు లేదు.

"ఇంతకూ ఆ బ్రాంచ్ మహబూబ్‌నగర్ జిల్లాలోనే కదా ఉంది? అక్కడ జిల్లా యస్పీ ఎవరో తెల్సా?" అని ఫైల్లో చూశాను.

"ఓహో! దుగ్గల్. వాడు నా బ్యాచ్ మేటే!" అంటూ దుగ్గల్‌కు ఫోన్ చేశాను.

కుశల ప్రశ్నలు అయ్యాక, 'బ్యాంక్ రాబరీ' గురించి అడిగాను.

"ఐ డోంట్ నో మచ్ యార్! వాటీజ్ యువర్ ఇంట్రెస్ట్?" అడిగాడు. పోలీస్ బుద్ధి పోనిచ్చుకున్నాడు కాదు. ఇంటరాగేషన్ మొదలుపెట్టాడు.

నేను నా పొజిషన్ క్లియర్ చేశాను.

"ఓ! దెన్ కం డౌన్. వీ విల్ సాల్వ్ ఇట్!" అన్నాడు.

స్పీకర్‌లో ఆ మాటలు విన్న వనజ లేచి నిలబడి నా వంక చూసింది. నేను టైం చూసుకున్నాను. మూడవుతోంది. హైదరాబాద్‌కు తర్వాతి ఫ్లైట్ ఆరు గంటలకు ఉంది.

"బుక్ ఇట్!" అన్నాను.

వనజ పరుగు పరుగున బయటకు నడిచింది. ఇక రెండు గంటల వరకూ ఆమెకు చేతినిండా పని. టికెట్లు, హోటళ్ళు, కార్లు బుక్ చేయాలి. అందరినీ అలర్ట్ చేయాలి.

"దుగ్గల్ గాడికి చెప్పాలా?" అని ఇంటర్‌కాంలో అడిగింది.

"ఏయ్! మైండ్ యువర్ లాంగ్వేజ్. 'గాడికి' కాదు 'గారికి'. నేను వాడూ, వీడూ అనొచ్చు. నువ్వు అనకూడదు" అని తెలుగు పాఠం చెప్పాను అంత హడావుడిలోనూ.

నేను రాజీవ్‌కు, "లీవింగ్ ఫర్ హైదరాబాద్ బై సిక్సో క్లాక్ ఫ్లైట్ ఆన్ బ్యాంక్ రాబరీ కేస్!" అని మెయిల్ పెట్టాను. ఆయన దగ్గర నుంచి "ప్రొసీడ్" అన్న సమాధానంతో పాటూ 'థమ్స్ అప్' సిగ్నల్ వచ్చింది.

నా ట్రావెల్ కిట్ ఒకటి ఆఫీసులో కూడా ఉంటుంది.

ఎప్పుడనుకుంటే అప్పుడు, ఎక్కడికంటే అక్కడికి వెళ్ళిపోవడమే. ఎవరికైనా చెప్పడానికి, వీడ్కోలు తీసుకోవడానికి నాకంటూ ఎవరైనా ఉంటేనే కదా బాధ!

నాకా బాధే లేదు. ఎందుకంటే నా కోసం ఎదురు చూసేవారూ, నా అన్న వాళ్ళూ నాకు ఎవ్వరూ లేరు.

**కేసు ఫైలు తిరగేశాడతను. సెక్రటరీతో కేసు పూర్వాపరాలన్నీ డిస్కస్ చేశాడు. మాట్లాడాల్సిన వాళ్ళతో మాట్లాడాడు. కానీ చివరకు చిన్న క్లూ కూడా దొరకలేదు. గ్రీన్ టీ తాగుతూ ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో సెక్రటరీ కల్పించుకుని 'బాస్ మీరు రంగంలోకి దిగాల్సిందే! హైదరాబాద్ వెళ్ళాల్సిందే!' అంది. ఉలికిపడ్డాడతను. మరి అతను హైదరాబాద్ వెళ్ళాడా లేదా?**

***

హైదరాబాద్ నా కలల నగరం.

ఆ పేరు తలుచుకుంటేనే నాకు ఒళ్ళు పులకరిస్తుంది.

వేలాదిమందిని, లక్షలాదిమందిని తమ తమ గమ్యస్థానాలకు చేర్చే అద్భుత విద్యా నగరం.

ప్రతీ సంవత్సరం వేలాదిమంది డాక్టర్లు, ఇంజనీర్లు; విదేశాలకు ఎగుమతి అయ్యే వేలాదిమంది సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు; వందలమంది ఐఏఎస్, ఐపీయస్, గ్రూప్ వన్, గ్రూప్ టూ, పోలీస్, మెడికల్ ఆఫీసర్లను తయారుచేసి వారి వారి జీవిత ఉన్నత శిఖరాలను అధిరోహింపచేసే శిక్షణా నగరం.

చిన్నప్పుడు మా ఊరి నుండి హైదరాబాద్‌కు వెళ్ళడం అంటే ఏదో సాహస యాత్ర చేసినంత హడావుడిగా ఉండేది.

తరువాత్తరువాత నేను హైదరాబాద్‌లోనే రెండు ఉద్యోగాలు చేశాను. డ్యూటీలో ఉండగా కర్కశంగా, నిర్దాక్షిణ్యంగా, నిక్కచ్చిగా, నిజాయితీగా ఉండేసరికి ఫలితం అనుభవించి, కంటినిండా కన్నీళ్ళతో, మనసునిండా అపజయ భావనతో, ఓడిపోయిన ఫీలింగుతో, నాకెంతో ప్రియమైన హైదరాబాద్ నగర నిష్క్రమణ చేశాను.

నగరం లేని దేశదిమ్మరినయ్యాను.

లక్కీగా ఇప్పుడు పనిచేస్తున్న కంపెనీలో ఉద్యోగం వచ్చి బ్రతికిపోయాను కానీ లేకపోతే నిరంతరం నన్ను వేధించే నా ఆలోచనలే నన్ను కాల్చేసేవి.

అందరూ నేను ఇప్పుడున్న ఉన్నత స్థానాన్ని చూసి, 'ఇంత చిన్న వయసులోనే ఈ క్రెడిట్ సాధించానని పొగుడుతుంటారు.' కానీ నేను ఇంతకు ముందే ఇంతకన్నా గొప్ప పదవినే అధిష్ఠించాననీ, విలువల కోసం పోరాడి ఆ పదవిని తృణప్రాయంగా వదులుకున్నానన్న విషయం వాళ్ళకు తెలియదు. నేనూ చెప్పలేదు.

చేతిలో 'జెఫ్రీ ఆర్చర్' తనను చదవడం లేదని



గోల చేస్తున్నా, మనస్సు నవల మీద లగ్నం కావడం లేదు. మనసంతా మాత్ర తిన్న నోరులా చేదుగా అయింది.

ఇంతలో శంషాబాద్ విమానాశ్రయానికి చేరుకుంటున్నామన్న ప్రకటన మైకుల్లో వినిపించింది.

నేను ఆలోచనలను కట్టి పెట్టేశాను, లగేజీ, ల్యాప్‌టాప్‌తో సహా.

***

ఏర్‌పోర్టులో దిగగానే, దుగ్గల్‌కు ఫోన్ చేశాను.

"ఊc! ఎక్కడ దిగావ్?"

నేను వీలైనంతవరకు హైదరాబాద్ నగరంలోకి అడుగుపెట్టకూడదనే నిర్ణయించుకుని, ఏర్‌పోర్టులోని 'నోవాటెల్' హోటల్లోనే ఉండడానికి ప్రిఫర్ చేశాను. ఒక్క రోజులో కేసు సాల్వ్ చేసే పని కోసం ఇంత హెవీ ట్రాఫిక్‌లో సిటీలోకి వెళ్ళడానికీ, రావడానికీ మూడు నాలుగ్గంటలు వేస్ట్ చేయడం ఎందుకని వనజకు ఇక్కడే మంచి సూట్ బుక్ చేయమని చెప్పాను. అదే విషయం దుగ్గల్‌కు చెప్పాను.

"గుడ్! ఎందుకంటే సిటీలోకి రావాలంటేనే నాకు భయం. ఐ హేట్ దట్ ట్రాఫిక్. శంషాబాద్ నోవాటెల్ అయితే నాకు ఇక్కడి నుంచి వన్ అవర్ జర్నీ. ఏర్‌పోర్ట్ కన్నా ముందే నీ హోటల్ వస్తుంది. ఇప్పుడు టైం ఎనిమిదైంది. ఐ విల్ రాపప్ మై వర్క్ హియర్ అండ్ జాయిన్ యూ బై టెన్, 'ఇన్ కాగ్నిటో'. అంటే రూల్స్ తెలుసు కదా! నేనొస్తున్నట్టు ఎవరికీ తెలియకూడదు. రహస్యంగా వస్తాను. నీతో మాట్లాడి రహస్యంగా వెళ్ళిపోతాను. మంచి వోడ్కా తెప్పించి పెట్టు. ఆన్ యువర్ క్లయింట్స్ అకౌంట్" అన్నాడు నవ్వుతూ.

నాకు తెలుసు. వర్కింగ్ యస్పీల మీద చాలా నిఘా ఉంటుంది. ఒక జిల్లా యస్పీ హెడ్‌క్వార్టర్స్ వదిలి రావడమంటే మామూలు మాటలు కాదు. ఇంటెలిజెన్స్, ప్రెస్, తీవ్రవాదుల ముఠాల కళ్ళన్నీ యస్పీ కదలికల పైనే ఉంటాయి. అందుకే దుగ్గల్ అన్ని జాగ్రత్తలు తీసుకోవడం.

ఇంత రిస్క్ తీసుకుని దుగ్గల్ నా దగ్గరికి రావడానికి కారణం, అకాడమీ నుంచీ మేమిద్దరం మంచి మిత్రులం. నేను ఐపీయస్ నుంచి రిజైన్ చేసేటప్పుడు కూడా 'చిన్న చిన్న విషయాలు పట్టించుకోకుండా నన్ను ఇంకొక్కసారి ఆలోచించుకోమని' పదేపదే పోరినవాడు కూడా దుగ్గలే. నేను వినలేదు. నా మనసు విరిగిపోయింది, ఐపీయస్ ఉద్యోగానికి రిజైన్ చేసేశాను.

నేను ఏర్‌పోర్టు నుండి బయటకి వచ్చేసరికి బ్యాంక్ సెక్యూరిటీ ఆఫీసర్, మా బ్రాంచ్ మేనేజర్ 'అరైవల్స్'లో నా కోసం ఎదురుచూస్తున్నారు. అందరం కలిసి హోటల్‌కి వెళ్ళాము. వారితో పది నిమిషాలు మాట్లాడే సరికి ఈ కేసుకు సంబంధించినంతవరకూ వాళ్ళు ఇద్దరూ వేస్టేననే నిర్ణయానికొచ్చాను.

అందుకే, పొద్దున్న ఆరింటికి రమ్మని, దొంగతనం జరిగిన బ్రాంచ్‌కు వెళ్దామని చెప్పి, వాళ్ళను పంపేశాను. ఫార్మల్ డ్రెస్ తీసేసి, ఫ్రెషప్ అయి, యోగా మ్యాట్ తీశాను.

నన్ను వేధించే ఈ ఆలోచనల నుండీ; గుచ్చుకునే జ్ఞాపకాల నుండీ; కేసుకు సంబంధించిన టెన్షన్ నుండీ, రిలీఫ్ కావాలంటే 'యోగా'నే పరిష్కారం. యోగా మ్యాట్ మీద పడుకుని, DRT అంటే 'డీప్ రిలాక్సేషన్ టెక్నిక్'కు సంబంధించిన ఆడియో ఫైల్‌ను సెల్‌ఫోన్‌లో సెలెక్ట్ చేసి హెడ్ ఫోన్స్ చెవుల్లో పెట్టుకుని ఆ సూచనల ప్రకారం చేయసాగాను. ప్రశాంతంగా ఉన్న ఆ వాతావరణంలో నా ఊపిరి తప్ప మరేమీ వినిపించడం లేదు.

ఆడియో ఫైల్‌లోని స్వరం వినగానే, నాగస్వరం విన్న నాగుపాము పరుగు పరుగున వచ్చినట్టుగా నిద్రాదేవత వేగిరమే వచ్చి, నా శరీరాన్నే ఒక వీణగా మార్చి, నా శరీర తంత్రులను శృతి చేసి అద్భుత దేహ సంగీతాన్ని సృష్టించింది. దాంతో ఒక గాఢమైన నిద్రా తరంగం నన్ను ఆవహించినట్టయింది. నేను ఎప్పుడు చేతనావస్థలో నుండి సుషుప్తిలోకి జారుకున్నానో నాకే తెలియదు.

సెల్ మోగుతుంటే లేచి చూశాను.

దుగ్గల్ 'పావుగంటలో వచ్చేస్తున్నా! రూము నెంబరెంత?' అని అడిగాడు.

ఆడియో ఎప్పుడో ఆగిపోయింది. టైం చూస్తే పది కావస్తోంది. అంటే గంటసేపు నిద్ర పోయానన్న మాట. అది మామూలు నిద్ర కాదు. యోగనిద్ర! యోగా చేయడం వల్ల పట్టిన నిద్ర. శరీరంలోని అణువణువునూ ఉత్తేజ పరిచి, విశ్రాంతపరిచే ఈ నిద్రలో మామూలు నిద్ర కన్నా మనసుకి, శరీరానికి రెండు మూడు రెట్లు ఎక్కువ రెస్ట్ లభిస్తుంది.

ఐయాం నౌ ఫుల్లీ రిజువనేటెడ్!

రూం సర్వీస్‌కి ఫోన్ చేసి పెట్టేస్తుండగానే, డోర్ బెల్లు మోగింది.

***

భూమి గుండ్రంగా ఉంటుందన్న సత్యానికి నిదర్శనంగా మళ్ళీ బెంగుళూరు హైవే మీదే మా కార్లు పరిగెడుతున్నాయి. సూర్యుడు అప్పుడప్పుడే పైకి వస్తున్నాడు. నా కోసం 'టొయోటా క్రిస్టా' కారు అరేంజ్ చేశారు. వెళ్ళేది చిన్న ఊరు కాబట్టి రోడ్ల పరిస్థితి ఎలా ఉంటుందో తెలియదు కాబట్టి సున్నితంగా ఉండే 'ఆడి' కారుకన్నా స్టర్డీగా, బలిష్టంగా ఉండే యస్యూవీ చూడమని, నేనే చెప్పాను.

నా వెనుక, బ్యాంకు కారులో బ్యాంక్ సెక్యూరిటీ ఆఫీసర్, మా బ్రాంచ్ మేనేజర్ ఫాలో అవుతున్నారు. వాళ్ళిద్దరికీ తెల్లవారుజామున లేచే అలవాటు లేనట్టుంది. ఇద్దరూ నిద్రలో జోగుతున్నారు.

మహబూబ్‌నగర్ చేరుకోగానే యస్పీ క్యాంప్ ఆఫీసుకు పోనివ్వమని చెప్పాను. దుగ్గల్ నన్ను బ్రేక్‌ఫాస్టుకు ఆహ్వానించాడు. నాతో వచ్చిన వారికి కారు యస్పీగారి ప్రాంగణంలోకి ప్రవేశించేసరికి నిద్ర పారిపోయింది. నేను రెసిడెన్షియల్ క్వార్టర్‌లోకి వెళ్ళాను. వాళ్ళు ఆఫీసులోనే కూర్చుని టిఫిన్ చేశారు.

మేమిద్దరం కలిసి టిఫిన్ చేసి వచ్చి దుగ్గల్ ఛాంబర్లో కూర్చున్నప్పుడు, 'మాకనూరు' ఏరియా డీయస్పీ వచ్చి అటెన్షన్‌లో నిలబడ్డాడు. అతన్ని చూడగానే దుగ్గల్ పోలీస్ భాషలో విరుచుకు పడ్డాడు.

"ఇంత పెద్ద క్రైం జరిగి ఇన్ని రోజులైతే ఏం చేస్తున్నారు. నిద్ర పోతున్నారా? గడ్డి పీకుతున్నారా? ఐ వాంట్ రిజల్ట్స్ బై నైట్! బ్లడీఫూల్స్!"

డీయస్పీ వణికిపోయాడు. రెండు నిమిషాలకు దుగ్గల్ శాంతించాడు. డీయస్పీకి కూడా కాఫీ తెప్పించాడు. ఆయన కాఫీ తాగాక,

"చూడండి! ఛ! ఎంత నామోషీ! ఇన్సిడెంట్ జరిగి ఇన్ని రోజులైనా ఒక్క క్లూ కూడా దొరకలేదంటే మన పోలీస్ వ్యవస్థకే మచ్చ కదా! నాకు రిజల్ట్స్ కావాలి, వెంటనే. మన ఇనెఫిషియెన్సీ వల్ల

బెంగుళూరు నుంచి నా ప్రియమిత్రుడు రావాల్సి వచ్చింది. డీయస్పీ గారూ! డూ యూ నో హిం? హీ ఈజ్ ఎక్స్ ఐపీయస్. బెస్ట్ ఐపీయస్ ఆఫీసర్ ఇన్ కంబైన్డ్ స్టేట్. నౌ రిజైన్డ్. మీకు తెలుసనుకుంటా!" అని డీయస్పీని కూల్ చేసే ప్రయత్నం చేశాడు.

"యస్సర్! ఓకే సర్! నో సర్!" అన్న మాటలు తప్ప డీయస్పీ నోటి నుండి మరో మాట రాలేదు.

"సార్ కూడా వస్తాడు. అతన్ని ఫాలో కండి. వెంటనే, నాలుగైదు టీమ్స్ ఏర్పాటు చేయండి. లాజిస్టిక్స్ సెర్చ్ చేయండి. బట్, నాకు రాత్రికల్లా రిపోర్టు రావాలి. అర్థమైందా?" గద్దించాడు.

"ఓకే, యూ క్యారీ ఆన్!" అంటూ అతను వెళ్ళడానికి అనుమతించాడు.

పాపం డీయస్పీ బిక్కచచ్చిపోయాడు. సెల్యూట్ చేసి బయటకు నడిచాడు. బయటకు వెళ్ళి నిశ్చయంగా, 'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకునే ఉంటాడు.

ఈ విధమైన డీలింగ్ పోలీస్ వ్యవస్థలో మామూలే. ఒక వ్యక్తి మన ముందుకు రాగానే మాటలతో అతన్ని బొంబార్డ్ చేస్తే అతని తప్పు ఉన్నా లేకపోయినా కంగారు పడతాడు. తను చేసిన ఏ తప్పుకు ఇప్పుడు ఈ శిక్ష పడుతుందిరా భగవంతుడా! అనే కన్ఫ్యూజన్‌కు గురై పూర్తిగా చేతులెత్తేస్తాడు. అప్పుడు మనం, అతనితో చేయించాల్సిన పని చెప్పి 'ఆ పని చేసైనా బాస్ మెప్పు పొందాలనుకునే' విధంగా అతణ్ణి సంసిద్ధుణ్ణి చేయాలి.

దుగ్గల్ అతనితో మాట్లాడుతున్నంత సేపు నేను కూడా ముఖం సీరియస్‌గా పెట్టుకునే కూర్చున్నాను.

డీయస్పీ వెళ్ళిన తర్వాత నన్ను చూసి కన్ను గీటుతూ దుగ్గల్ నవ్వాడు.

"యూ మీన్ బాస్టర్డ్!" అంటూ నేనూ అతని నవ్వులో శృతి కలిపాను. ఎందుకంటే, సబార్డినేట్స్‌ను ఎలా మా దారికి తెచ్చుకోవాలో మా ఇద్దరికీ వెన్నతో పెట్టిన విద్య.

పోలీస్ వ్యవస్థలో అది వంద శాతం ఫలితాలను తెచ్చిపెడితే, నేను పనిచేసే ప్రైవేట్ రంగంలో జీరో ఫలితాలను ఇస్తుంది. మేం మా సబార్డినేట్స్‌ను కొలీగ్స్‌గా ట్రీట్ చేస్తాము. వారిని మా కాన్ఫిడెన్సులోకి తీసుకుని వాళ్ళ కంట్రిబ్యూషన్‌ను కూడా ప్రోత్సహిస్తాము. గుర్తిస్తాము.

కానీ, పోలీస్ వ్యవస్థలో అలా జరగదు.

'అంతా పైవాడి దయే!'

"ఓకే మ్యాన్! బెస్టాఫ్ లక్! నేను కూడా ఇక్కడొక చిన్న టీమ్ ఏర్పాటు చేసి నీకు లాజిస్టిక్ సపోర్టు ఉండేలా చూస్తా!" అన్నాడు దుగ్గల్ కారు దగ్గరకు వచ్చి వీడ్కోలు చెబుతూ.

"థాంక్స్!" అని నేననగానే నన్ను కౌగలించుకుని, "ఐయాం హ్యాపీరా! రిజైన్ చేసినప్పుడు నువ్వు ఏమైపోతావోనని భయపడ్డాను. కానీ, నువ్వు హ్యాపీగా ఉన్నావు. బట్! ఎప్పుడే అవసరం వచ్చినా, డోంట్ హెసిటేట్. జస్ట్ గివ్ మీ ఏ రింగ్" అన్నాడు.

దూరంగా అటెన్షన్లో నిలబడ్డ డీయస్పీ మా ఇద్దరినీ అంత సన్నిహితంగా చూసి ఆశ్చర్యపోయాడు.

దుగ్గల్ లోపలికి వెళ్ళగానే నా దగ్గరకొచ్చి,

"సార్! నేను నా వెహికల్‌లో మిమ్మల్ని ఫాలో అవుతాను" అన్నాడు.

నేను అతని భుజం మీద చేయి వేసి,

"రెడ్డిగారూ! డోంట్ వర్రీ! నా దగ్గర ఫార్మాలిటీస్ అవసరం లేదు. నేను ఇప్పుడు ఐపీయస్ కాదూ మీరు నా సబార్డినేటూ కాదు. నన్ను మీ ఫ్రెండ్ అనుకోండి. నా కారులోనే వెళ్దాం పదండి" అన్నాను.

నాకు తెలుసు అతను చచ్చినా నా కారులో రాడు. కానీ, పాపం మానవుడు కొంచెం సర్దుకుంటాడు. రిలాక్స్‌గా ఫీలవుతాడు.

"లేదు సార్! నా వెహికల్ ఉంది సార్! ఐ విల్ ఫాలో యూ సార్!" అన్నాడు.

నేను 'సార్' అన్న పిలుపు విని చాలా రోజులయింది. నాకు చిరాకుగా అనిపించింది.

"ప్లీజ్! నన్ను 'సార్' అని మాత్రం పిలవకండి. నా పేరు పెట్టి పిలవండి." అన్నాను.

"ఓకే సార్!" అంటూ తన వెహికల్ దగ్గరకు వెళ్ళాడు.

మళ్ళీ ప్రయాణం మొదలయింది.

సివిల్ సర్వీసెస్‌లో నా ఆప్షనల్ సైకాలజీ. నాకు బాగా నచ్చిన సబ్జెక్ట్. అప్పటి నుండి నాకు మనుషుల సైకాలజీని, విభిన్న పరిస్థితుల్లో వాళ్ళు ప్రవర్తించే తీరును పరిశీలించడం అలవాటైంది. నా పరిశీలనలో అర్థమయిందేమిటంటే, ఈ లోకంలో ఎదుటివాణ్ణి భయపెట్టడం వల్ల ఏ పనులూ కావు. తాత్కాలికంగా వారు భయపడ్డట్టు నటించినా, వారి వంద శాతం సిన్సియారిటీని పొందలేము. ఎదుటివారిని మనతో సమానంగా గుర్తించి వారికి అవకాశాలు కల్పిస్తే వాళ్ళు కూడా కేసులో ఇన్వాల్వ్ అయి అద్భుతాలు చేయగలరు.

నేను వెస్ట్‌జోన్ డీసీపీగా ఉన్నప్పుడు కూడా అదే పద్ధతి ఫాలో అయ్యాను. నా దగ్గర ఈ పోలీస్ మొరటు పద్ధతులు పని చేయకపోయేవి. అందుకే నన్ను మా స్టాఫ్ అంతా ప్రేమించేవారు. నేను చెబితే ప్రాణాలకు తెగించైనా పోరాడేవారు. అందుకే నేను ఉన్నన్ని రోజులు వెస్ట్‌జోన్ నేరాలను అరికట్టడంలో ప్రథమ స్థానంలో ఉండేది.

అందుకే నేను డీయస్పీ రెడ్డి భుజం మీద చేయి వేయడమన్నది, ఒక సింబల్, ఒక సంజ్ఞ. మనిద్దరం సమానమైన మనుషులమే అన్న భావన కలిగించడానికి శారీరక స్పర్శ ఉపయోగపడుతుంది. అందుకే ప్రైవేట్ రంగంలో కౌగిలింతలు, పెగ్గులు, హగ్గులు, పెక్‌లు, షేక్‌హ్యాండ్లు ఎక్కువగా ఉంటాయి.

పోలీస్ వ్యవస్థ మాత్రం ఇంకా కరుడుగట్టిన బ్రిటీష్ విధానాల్లోనే మగ్గిపోతోంది. సబార్డినేట్ అంటే అంటరానివాడిగా చూస్తారు. సబార్డినేట్ చేత చండాలపు పనులన్నీ చేయించుకుంటారు గానీ, అతని చేయి తగిలితేనే మలినమైనట్టుగా ఫీలవుతారు. ఒక్క ర్యాంకు చిన్నదైనా సరే, సబార్డినేట్‌కు షేక్‌హ్యాండ్ ఇవ్వడానికి కూడా కుంచించుకుపోతారు.

యస్పీ చేతిలో ఈ ట్రీట్‌మెంట్ పొందిన డీయస్పీ కూడా తన సబార్డినేట్స్ అయిన సీఐలను, యస్సైలను, కానిస్టేబుల్స్‌ను ఇంతకంటే ఘోరంగా, బూతులు తప్ప మరో మాట లేకుండా తిడతాడని దుగ్గల్ చెప్పాడు.

దుగ్గల్‌ను అతని పై అధికారి తిడతాడు. దుగ్గల్ తన కింది అధికారులను తిడతాడు. అదో పెద్ద విష సంస్కృతీ వలయం.




**(ఇంకా వుంది)**

# పీసీఓడీ తగ్గదని ఎవరన్నారు?

కొంతమంది స్త్రీలలో హార్మోన్ల అసమతుల్యత వల్ల నెలసరి సక్రమంగా రాకపోవడం, రుతుస్రావంలో లోపాలు, అధిక రక్తస్రావం లేక తక్కువ రక్తస్రావం కావడం, బరువు అధికంగా పెరగడం, అవాంఛిత రోమాలు రావడం జరుగుతుంది. దీనికి ప్రధాన కారణం అండా శయంలో నీటి బుడగలు ఏర్పడటం. దీన్ని పాలిసిస్టిక్ ఓవేరియన్ డిసీజ్(పీసీఓడి)అని అంటారు. మన వ్యావహారిక భాషలో అండాశయంలో నీటి బుడగలు లేదా అండాశయంలో తిత్తులు అంటారు. మహిళల్లో వచ్చే హార్మోన్ సమస్యలలో ఇది ప్రధాన సమస్య.

**ఎవరికి వస్తుంది? :** ఆడవారిలో 12 నుంచి 14 సంవత్సరాల వయసులో ఈ సమస్య వస్తుంది. 5-10శాతం మహిళల్లో యుక్త వయసులో కూడా ఈ సమస్యను చూస్తాం. ఇది వంశపారంపర్యంగా వచ్చే అవకాశం కూడా ఉంది. అధిక బరువు ఉండటం ఈ సమస్యను మరింత జఠిలం చేస్తుంది. పీసీఓడీ సమస్యలో ఆండ్రోజన్స్ అధికంగా ఉత్పత్తి అవడం వలన హార్మోన్స్ సమతుల్యత లోపించి లక్షణాలు రావడం జరుగుతుంది. దీనికి తోడు ఇన్సులిన్ రెసిస్టెంట్, ప్రొలాక్టిన్ హార్మోన్స్ తేడా వలన సమస్య మరింత జటిలమవుతుంది.

**చికిత్స :** పీసీఓడీ సమస్యను త్వరగా గుర్తించి వైద్యం తీసుకోవడం చాలా ముఖ్యం. పీసీఓడీ సమస్యకు హోమియోలో చికిత్స ఉంది. హార్మోన్ల సమతుల్యతను సాధించడం ద్వారా పీసీఓడి సమస్యను చక్కదిద్దవచ్చు. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుల దగ్గర చికిత్స తీసుకుంటే పీసీఓడీ నుంచి విముక్తి లభిస్తుంది.

# హెచ్ఐవి, హెర్పిస్‌లను అణచడం సాధ్యమే

ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స :** హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగిస్తుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.





# సైనసైటిస్ తగ్గదని ఎవరన్నారు?

ముక్కు, కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

### గుర్తించటం సులభం

తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

### సర్జరీ అవసరం లేదు

హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందులు వాడిన చాలా మందికి సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్ తొలగిపోయింది. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్స వల్ల సైనసైటిస్ సమస్య సమూలంగా తొలగిపోతుంది. మళ్లీ మళ్లీ బాధించడం జరగదు.

# హెపటైటిస్ ఇలా తగ్గింది

ఒకరోజు సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

### చికిత్స తరువాత

హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో అందుబాటులో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. ఇతర కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు. హోమియో వైద్యం నాకు పునర్జన్మను ప్రసాదించిందని కృతజ్ఞతలు చెప్పుకొచ్చాడు.




# వేసవి విజృంభణ:శంఖకర్ణుని హితోపదేశం

**కృష్ణుని మాయాజాలంతో వ్రేపల్లెలో వేలకొలది తోడేళ్ళూ, అడవిపందులూ, అనేక క్రూరమృగాలూ ఉద్భవించాయి. పశువులనూ, పంటపొలాలనూ నాశనం చేశాయి. చూసి తట్టుకోలేకపోయారు పెద్దలు. అంతా ఒకచోట చేరారు. చర్చించుకున్నారిలా. ఏది ఏమైనా ఈ వ్రేపల్లెను విడచిపెట్టి పోకూడదనుకున్నాం కాని, పరిస్థితి చూస్తోంటే ఇక్కణ్ణుంచి వెళ్ళక తప్పదనిపిస్తోంది. బృందావనం అన్ని విధాలా బాగుంటుందని పిల్లలు అంటున్నారు. అక్కడకి వెళ్ళిపోవడం మంచిదనిపిస్తోంది. అయితే అక్కడి అడవుల్లో కూడా క్రూరమృగాలుసహా రాక్షసులు అనేకులు ఉన్నారని చెబుతున్నారు. ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. అర్థంకాకపోవడానికి ఇందులో ఏమున్నది? గత్యంతరం లేదు కాబట్టి ఇక్కణ్ణుంచి వెళ్ళిపోక తప్పదనుకుంటే, బృందావనానికి బయల్దేరాల్సిందే అన్నారు.**

నందగోపుని అభిప్రాయం కోసం అతనివైపు చూశారు.

ఏం మాట్లాడాలి? ఏం మాట్లాడతాడు తను? లేకలేకపుట్టిన కృష్ణుణ్ణి తీసుకుని, బృందావనానికి బయల్దేరాలా? రాక్షసులకు ఆటపట్టు ఆ ప్రదేశం. వాళ్ళు కృష్ణుణ్ణి ఏం చేస్తారో ఏమో! భయపడ్డాడు నందుడు. కళ్ళు మూసుకున్నాడు. అంతలో అక్కడికి నారదుడు విచ్చేశాడు. నందుణ్ణి తట్టి పిలిచాడు. కళ్ళు తెరచి నారదుణ్ణి చూసి, కొంత ధైర్యం తెచ్చుకున్నాడు నందుడు. చేతులు జోడించి నమస్కరించాడతనికి.

మన ఇద్దరం కాసేపు ఏకాంతంగా మాట్లాడుకోవాలి, రా అంటూ ముందుకు దారి తీశాడు నారదుడు. అతన్ని అనుసరించాడు నందుడు. ఇద్దరూ ఓ చెట్టుచాటుకి చేరుకున్నారు.

చెప్పండి మౌని అడిగాడు నందుడు.

మీ పల్లెపెద్దలు వ్రేపల్లె విడచిపెట్టిపోక తప్పదంటూనే బృందావనంలోని రాక్షసుల గురించి మాట్లాడుకుంటున్నారు. అలాగే నువ్వు కూడా నీ కృష్ణుని గురించి ఆలోచిస్తూ భయపడుతున్నావు. నీకు ఆ భయం అనవసరం. నీకు ఓ నిజం చెబుతున్నాను. జాగ్రత్తగా విను. కృష్ణుడు సామాన్యబాలుడు కాదు. అతడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణదేవుడు.

నమ్మలేనట్టుగా చూశాడు నందుడు.

నేను చెప్పింది నిజం. ఈ భూమి మీద దానవులను సంహరించేందుకు ఆ శ్రీమన్నారాయణుడే నీ కుమారుడిగా జన్మించాడు. అలాగే బలరాముడు కూడా సామాన్యుడు కాదు. అతడు కూడా నారాయణాంశే!

స్వామీ అని విస్తుపోయాడు నందుడు.

బలరామకృష్ణులు మహాశక్తి సంపన్నులు. నీకు తెలియని నిజాలు చెబుతాను, విను. విషం పూసిన చనుమొనలతో పాలిచ్చి కృష్ణుణ్ణి చంపాలని చూసింది పూతన. ఆఖరికి తానే ప్రాణాలు కోల్పోయింది. అలాగే శకటాసురుడు, బండిరూపంలో నీ కృష్ణుణ్ణి తుత్తునియలు చేయాలనుకున్నాడు. చివరికి వాడే తుత్తునియలు అయ్యాడు. కృష్ణుడు ఒక తన్ను తంతే విరిగి ముక్కలయ్యాడు అని చెప్పాడు నారదుడు.

అవునా! అని విస్తుపోయాడు నందుడు.

రేపు బృందావనిలో కూడా జరిగేదిదే! అనేక మంది రాక్షసులను కృష్ణుడు మట్టుబెట్టబోతున్నాడు. ఇది రహస్యం. ఏ ఒక్కరికీ తెలియకూడదు. కృష్ణుడు గురించి నువ్వు భయపడుతోంటే అతనికి ఏమీ కాదని చెప్పేందుకే నీకు ఇవన్నీ వివరించాను. ఈ విషయాలు మూడోకంటికి తెలియకూడదు. జాగ్రత్త అన్నాడు నారదుడు. నందుణ్ణి హెచ్చరించాడు.

వస్తాను అని అక్కడ సెలవుతీసుకుని, నేరుగా కృష్ణుణ్ణి సమీపించాడు నారదుడు. కృష్ణునికి చేతులు జోడించి నమస్కరించి తెలియజేశాడిలా.

**నారదుని ఉపదేశం విని అబ్బురపడిన నందుడు వ్రేపల్లె విడిచి వెళ్ళడానికి అంగీకరించాడు. దాంతో అంతా బృందావనంచేరి స్థిరపడి తమ సంపద పెంచుకున్నారు. బలరామకృష్ణులు కోడెకారు వయసుకెదిగారు. అంతలోనే యమునాతీరాన్ని వింతవ్యాధి చుట్టుముట్టింది. పశువులు, పక్షులు, గోపక సంతతి మృత్యువాతపడసాగింది. అప్పుడు బలరామకృష్ణులు ఏం చేశారు? గోపప్రముఖుడు ఏం చెప్పాడు?**

కృష్ణా! ముల్లోకాల సృష్టిస్థితిలయాలను అవలీలగా కొనసాగించగలిగే నువ్వు, ఏమీ తెలియని వాడిలా, అమాయకుడిలా గోపకుమారుడివై జన్మించి ఆనందిస్తున్నావు. బృందావనానికి వెళ్ళి వినోదించాలనుకుంటున్నావు. నిన్ను అడ్డుకునేదెవరు? కాదనేదెవరు? వెళ్ళిరా! ఇంకెందుకు ఆలస్యం అన్నాడు నారదుడు. కృష్ణుని దగ్గర నుంచి నిష్క్రమించి నిజాశ్రమానికి చేరుకున్నాడు.

నారదుడు చెప్పిన మాటలకు ఆనందిస్తూ, ఆశ్చర్యపోతూ చెట్టుచాటునే ఉండిపోయాడు నందుడు. తప్పుకుని రాలేదు. ఇంకా రాని నందుణ్ణి వెదుక్కుంటూ పల్లె పెద్దలే అతన్ని సమీపించారు. అడిగారిలా.

ఏమయ్యా! బృందావనానికి వెళ్దామా? వద్దా? నువ్వేమంటావు?

అందరం బృందావనం వెళ్ళిపోదాం. అక్కడే మనకి అన్నిరకాలుగా బాగుంటుందని అనిపిస్తోంది. ఇక ఆలస్యం అనవసరం. బయల్దేరండి అన్నాడు నందుడు. అతని మాటతో వ్రేపల్లెలోని వారంతా సరుకులతో, సంసారాలతో బృందావని బాటపట్టారు. ఆలమందలను ముందు నడిపించారు. వాటి ముందు కర్రలూ, కత్తులూ పట్టుకుని గోపాలకులు నిలిచారు. ముందు నిర్భయులైన గోపాలకులూ, వారి తర్వాత ఆలమందలూ, వాటి తర్వాత పెద్దలూ, పిన్నలూ, వారి తర్వాత గోపికలూ, వారి తర్వాత దివ్యాంగులూ, వారిని అంటిపెట్టుకుని యువకులూ...ఇలా బృందావనానికి వ్రేపల్లె వాసులంతా బయల్దేరారు. ప్రయాణించి బృందావనానికి చేరుకున్నారు. ఆమడమేర అర్ధచంద్రాకారంలో శకటాల్ని నిలిపారక్కడ. పనిపాట్లలో పడ్డారు. గోపప్రముఖులకోసం పర్ణశాలలు నిర్మించారు. పెనుపొదరిళ్ళను నివాసగృహాలను చేశారు. లతలు అల్లుకున్న మర్రిచెట్లనీడల్లో నెలవులు ఏర్పరిచారు. అన్ని రకాలుగా వసతులు ఏర్పరుచుకుని, అంతా స్థిరపడ్డారు. గోసంరక్షణ, వాణిజ్యాదివృత్తులు ఎప్పటిలాగానే చేపట్టారు.

గురివిందపూసలూ, గోరింటపువ్వులను అలంకరించుకుని, గోపయువతులు బృందావనానికి వన్నె తెచ్చారు. బలిష్ఠులై, సుదీర్ఘదేహాలతో గోపకులు బృందావని అంతటా యథేచ్ఛగా విహరించసాగారు. ఎక్కడ పడితే అక్కడ పసిమిపచ్చిక విచ్చుకుంటే, ఆ పచ్చికను మేసి, క్రూరమృగాల భయం అన్నదే లేకుండా యమునా నదీతీరాల్లో ఆలమందలు సంచరించసాగాయి.

కృష్ణనిరూపంలోఉన్న శ్రీహరికనుసన్నల్లో గోపకులంతా పశుసంపత్తితో, పాడిపంటలతో శ్రీమంతులైనారు. మండువేసవిలో కూడా మూడువానలు కురిసేవక్కడ. ఫలితంగా పసిమిపచ్చికకు కొదవలేకుండాపోయింది. నానాటికీ పశువుల క్రయవిక్రయాలు పెరిగాయి. పెరిగి, బృందావని అంటే వాణిజ్యానికి పెట్టింది పేరు అన్నట్టుగా ప్రసిద్ధి చెందింది.

బలరామకృష్ణులిద్దరూ కౌమారప్రాయానికి చేరుకున్నారు. పదహారేళ్ళవాళ్ళయ్యారు. పదహారేళ్ళవాళ్ళయినా బలిష్ఠంగా ఉండి, యువకుల్లా కనిపించ

సాగారు. కోడెకాడు కృష్ణుణ్ణి చూసిన ఏ గోపికా చూపు మరల్చుకోలేని స్థితిలో పడింది.

బృందావనిలో వసంతం గడిచింది. వేసవి వచ్చింది. గోపికలు అడవిమల్లెలు తురుముకుని అందంగా తయారయ్యారు. వారి మల్లెలవాసన మత్తెక్కించేదందరికీ. రానురానూ వేసవిని భరించలేని రోజులు వచ్చాయి.

వేసవిని భరించలేని బ్రహ్మ, శీతలంగా ఉండే తమ్మిపూసెజ్జపై విశ్రమించాడు. విష్ణుదేవుడు చల్లని పాలకడలి తరంగాల్లో తలదాచుకున్నాడు. ముక్కంటి మంచుకొండగుహల్లో కూర్చుని మౌనం వహించాడు. బడబాగ్ని పెచ్చరిల్లిందా? లేదంటే శివుడి కంఠం లోని కాలకూటం వెలికొచ్చిందా అన్నట్టుగా వేడివేడి గాడ్పులతో మండుటెండ అందరినీ హింసించ సాగింది. చల్లనిపాలను తాగుతూ, గోపాంగనల ఆలింగనాలలో గోపకులంతా వేసంగిని గడిపేశారు. గండం గట్టెక్కిందనుకున్నారు.

కొంతకాలం గడిచింది.

అకస్మాత్తుగా పశువులు వ్యాధులపాలయ్యాయి. వందలు, వేలల్లో మరణించసాగాయి. గోపపెద్దలకది అంతుచిక్కలేదు. మంత్రతంత్రాలతో, వేర్వేరు చికిత్స లతో పశువులను కాపాడబోయారు. అయినా ఫలితం లేకపోయింది. యమునాతీరంలో కూడా పరిస్థితి విషమించింది. ఆ తీరంలో తిరుగాడే జంతువులూ, చెట్లమీది పక్షులూ నేల రాలి మరణించసాగాయి. ఆ వింతవ్యాధులు మనుషులకు కూడా సోకాయి. చాలామంది మరణించారు. కొందరు జ్వరతీవ్రతతో స్మృతివిహీనులై చనిపోతే, ఇంకొందరు వ్యాధిసోకిన వెంటనే రక్తం కక్కుని మృతి చెందారు. ఎటు చూసినా యమునాతీరంలో దారుణ నరమృగపక్షి ఆర్తనాదాలు వినిపించసాగాయి.

యశోద, రోహిణి, నందగోపులు కూడా విష జ్వరాలపాలబడ్డారు. చిక్కిశల్యమయ్యారు.

అన్నీ గమనించిన కృష్ణుడు, అన్న బలరాము నితో కలసి చర్చించాడు. చెప్పాడిలా.

కొన్నాళ్ళు ఈ ప్రాంతానికి దూరంగా ఉండి చూద్దాం, ఏమవుతుందో?

నీ మాట కాదంటానా కృష్ణా! నువ్వు ఎలా చెబితే అలాగే అన్నాడు బలరాముడు.

అన్న అనుమతితో కొన్ని మందలపశువులు, గోపాలకులుసహా తాను కూడా కోసుదూరంలో కొన్నాళ్ళు నివసించాడు కృష్ణుడు. అక్కడ అందరికీ ఆరోగ్యాలు కుదుటపడ్డాయి. ఆ సంగతి చెప్పి, రోహిణి, యశోదానందులను కూడా అక్కడికి తోడుకుని పోయే ప్రయత్నం చేశాడు కృష్ణుడు. అందుకు వారు అంగీక రించలేదు. అయినవాళ్ళనీ, ఆత్మీయులనీ విడిచిపెట్టి రామన్నారు. అందరితో పాటే తామూ అని భీష్మిం చారు. చేసేదిలేక ఊరుకున్నాడు కృష్ణుడు. అయితే వారంతా రోగాలు అనుభవిస్తోంటే చూసి, తట్టు కోలేక దుఃఖించసాగాడు.

బలపరాక్రమాలకు కొదవలేదు. మంచిచెడుల నిర్ణయంలో వారిని మించినవారు లేరు. అయినా బల రామకృష్ణులకు కరచరణాలాడలేదు. పరిస్థితిని ఎలా అధిగమించాలో తెలియక, ఏ రీతిని పరిష్కరించాలో అంతుబట్టక విలవిల్లాడారు. అప్పుడు అక్కడికి విదేహ దేశం నుండి గోపప్రముఖుడొకడు విచ్చేశాడు.



అతడు అంతా ఆకళింపు చేసుకున్నాడు. చెప్పాడిలా.

ఆలమందలను కాచుకుని జీవించేవాళ్ళం. వాటికీ, మనకీ చేటువాటిల్లిందిప్పుడు. పశుగణాలకు అధీశ్వ రుడు పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుణ్ణి అర్చిస్తే ఆప దలు తొలగిపోతాయనిపిస్తోంది. వేదవేదాంగపారంగ తులు విప్రులను పిలిపించి, శాస్త్రోక్తంగా శివపూజ ప్రారంభించండి. అంతా మంచి జరుగుతుంది.

సరేనంటే సరేనన్నారు పెద్దలు. మంత్రతంత్రా లతో శంకరదేవుని పూజించేందుకు పరమప్రజ్ఞా నిధులైన విప్రులను రప్పించారు. వేడుకుని, వారిని పూజలారంభించమన్నారు.. పూజలు ఆరంభించారు విప్రులు. పంచామృతాలు, పంచగవ్యాలు, పరిశుద్ధ జలాలతో ముక్కంటికి అభిషేకాదులు చేశారు. ధూప దీపనైవేద్యాలు అర్పించారు. శివునిసహా పార్వతీ దేవికీ, కుమారస్వామికీ, నందీశ్వరునికీ, వినాయ కునికీ విశిష్టపూజలు చేశారు. యథావిధిగా హోమా దులు నిర్వర్తించారు. మృత్యుపరిహారకాలు, ఉపద్ర వనివారకాలైన వేదమంత్రాలు పఠించి, పరమేశ్వరుని ముందు ఆవేశపూరితంగా నర్తించారు.

శివుని పాదాలచెంత నర్తిస్తున్న ఒక విప్రుడు ఊగి పోతూ, తూగిపోతూ కర్ణకఠోరంగా వికటాట్టహాసం చేశాడు. అతని నవ్వుకి అంతా విస్తుపోయారు. భయం భయంగా చూశారతన్ని. అప్పుడు ఆ విప్రుడు ఇలా చెప్పాడు.

మహనీయులారా! నేను పరమేశ్వరుని కింక రుణ్ణి. నా పేరు శంఖకర్ణుడు. నేరుగా కైలాసం నుండి వచ్చానిక్కడకి. ఆ మహదేవుడు చెప్పమన్నదే మీకు చెబుతున్నాను, వినండి. మీరు చేసిన పూజలకు దేవదేవుడు ఎంతగానో ఆనందించాడు. ఆనందించి, ఓ విప్రుణ్ణి ఆవేశించి, తన మాటగా మీకు ఈ వివ రాలు చెప్పమన్నాడు. విరోచనుని కుమారులలో బలిచక్రవర్తి కన్నా ముందు ఓ రాక్షసుడు జన్మిం చాడు. వాడి పేరు కాలకలి. ద్వాపరయుగాంతంలో ప్రజలను పీడించేందుకు రాక్షసులంతా వివిధ రూపాలు సంకల్పించుకోవడంతో ఆ కాలకలి బృందా వనంలో, యమునానది దక్షిణతీరంలో విషమయ మైన వెలగచెట్టుగా జన్మించాడు. వాడి భటులంతా విషకంటకాలు కలిగిన వేలకొలది చెట్లుగా మారి, ఆ వెలగచెట్టు చుట్టూరా వెలిశారు. కాలకలికి ఏడు గురు భార్యలు. ఆ ఏడుగురూ ఏడుగోవులైనారు. వేలకొలది పశుసంతతిని కని, పెంచి పోషించారు. వారంతా కంటబడిన మానవులనే కాదు, పశుపక్ష్యా దులను కూడా సంహరించి, ఆరగిస్తున్నారు. కాలకలి వెలగచెట్టుగా పుట్టి, ఈనాటికి పన్నెండేళ్ళయింది. ఇప్పుడు ఆ చెట్టు పూచింది. ఆ పువ్వులు విషంతో నిండిన కాయలైనాయి. ఆ కాయల్ని తిని అతని సంతతి అంతా ప్రాణికోటి ప్రాణాలను హరిస్తున్నది.

వెలగచెట్టు మీద నుండి వెలువడిన గాలి విష పూరితమై మిమ్మల్నందరినీ అనారోగ్యపీడితుల్ని చేస్తున్నది. గోపాలకులంతా ఆ విషమారుతం పీల్చడం తోనే ఇన్ని ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నారు. ఆ గాలి సోకే యమునానది కూడా విషపూరితం అయింది. అందుకే వీటికి దూరంగా ఉన్నవారు ఆరోగ్యంగా ఉంటున్నారు. దగ్గరగా ఉన్నవారు అనారోగ్యానికి గురవుతున్నారు. బలరామకృష్ణులు తలచుకుంటే చేయలేనిది ఏదీ లేదు. తలచుకుని ఆ ఇద్దరూ వెలగ చెట్టుని తుత్తునియలు చేస్తే బృందావనం మెరుగు పడుతుంది. మెరుస్తుంది. లేని పక్షంలో ఈ బాధలు తప్పవు.

శంఖకర్ణుడు విప్రుణ్ణి విడచాడేమో! కైలాసానికి వెళ్ళిపోయాడేమో! నీరసపడి నిలువునా కూలి పోయాడు విప్రుడు. అతన్ని చుట్టుముట్టారంతా.

—అరణి




# గివ్ యువర్ బెస్ట్

"ఏం పని చేశావన్నది ముఖ్యం కాదు
ఎలా చేసి గెలిచావన్నదే ముఖ్యం"
—(ఫ్రాన్సిస్ బేకన్)

**"నచ్చినపని దొరకలేదని చింతించేకన్నా, దొరికినపనినే నచ్చేట్టుగా మార్చుకోవడంలోనే నీ ప్రత్యేకత చాటాలి. నీకు నచ్చిన పనిని పదిమందికి ఉపయోగపడేలా తీర్చిదిద్దడం నీ చేతల్లో ఉంటుంది". వృత్తి, ప్రవృత్తి ఏదైనా దాన్నొక ఆటలా, నచ్చిన పాటలా, అందరికీ పనికొచ్చే బాటలా తీర్చిదిద్దగలిగే వాళ్ళే విజేతలు.**



ఏ పనిచేసినా 'సంపాదన' కంటే 'సంతృప్తి' ముఖ్యం. సంతృప్తిలేని సంపాదన ఎండిన చెరువులో ఈత లాంటిది, ఎండమావి వెనక పరుగులాంటిది'.

జీవితం అందరికీ వడ్డించిన విస్తరి కాదు. అల్లా వుద్దీన్ నూటికొక్కడే ఉంటాడు. వాడికే అద్భుత దీపం దొరుకుతుంది.

శక్తి, యుక్తి, సామర్థ్యం ఉన్నవాళ్ళు ఎలాంటి గుర్రాన్నైనా అవలీలగా ఆధీనంలోకి తెచ్చుకుని గెలుపుస్వారీ చేస్తారు.

అందిన దానిని అందంగా మలుచుకుని, ఆ కృషిలో ఎదురయ్యే అవరోధాలను అవకాశాలుగా మార్చుకోగల్గిన వాళ్ళే విజయం సాధిస్తారు.

అనుకున్న పని సాధించేవరకు పట్టు వదలకూడదు.

**"పట్టు పట్టరాదు పట్టు విడవరాదు
పట్టు పట్టేనని బిగియపట్టవలెను
పట్టి విడుచుట కంటే పడి చచ్చుట
మేలు
విశ్వదాభిరామ! వినురవేమ"**

కార్యసాధకుల ప్రథమలక్షణం పట్టుదల.

పట్టుదల ఎంతటి అసాధ్యాన్నైనా, సుసాధ్యం చేస్తుంది.

"మనలో చాలామంది చాలాసార్లు మంచి నిర్ణయాలు తీసుకుంటారు, పట్టుదలతో అమలు చెయ్యలేకపోతూ ఉంటారు.

మంచి నిర్ణయాన్ని ఆచరణలో పెట్టగల్గిన వాళ్ళే అద్భుతాలు సాధిస్తారు.

## అసంతృప్తే అవరోధం

యువతీయువకుల్ని ఎవర్ని కదిలించినా అసంతృప్తి, అసంతృప్తి...సమాజం, కుటుంబం, వృత్తి... ఏ పరంగా చూసినా ఇదే సమాధానం. నూరుశాతం సంతృప్తిగా ఉన్నానని ఏ వ్యక్తీ ఒప్పుకోడు.

* వైద్యవృత్తిలో ఉన్న యువడాక్టర్‌కి అసంతృప్తి. 'నా ఫ్రెండ్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. లక్షలు సంపాదిస్తున్నాడు. నన్ను చూడండి.. పి.జి.లో సీటుదొరక్క, కోట్లు పెట్టి కొనలేక పాలీక్లినిక్‌లో పనిచేస్తున్నా. ముప్పయ్ఏళ్ళు దాటినా లైఫ్‌లో సెటిలవ్వలేదు' అని అసంతృప్తి వెళ్ళబోస్తాడు.
* ఏ సినీతారను కదిలించినా "డాక్టరు కాబోయి యాక్టరయ్యా" అంటుంది.
* కలెక్టరవుదామని కలలు కని, చివరికి టిక్కెట్ కలెక్టరయ్యాను అంటారింకొకరు.

ఈ నిరాశావాదులంతా మరచిపోతున్నదేమిటంటే..

**మొదటిది:** డాక్టరు వృత్తి రాంగ్ సెలక్షనా? డబ్బు సంపాదనే దాని పరమార్థమా? లేక చేస్తున్న వృత్తిమీద గౌరవం లేకపోవడమా?

**రెండవది:** డాక్టరు కంటే యాక్టింగ్‌లోనే బాగా డబ్బులు, పేరు, ప్రతిష్ఠ వస్తాయి కదా! అయినా అసంతృప్తి ఎందుకు? యాక్టరుగా వృత్తిపరమైన సవాళ్ళు ఎదుర్కోలేకపోవటమా? లేక ఎక్కువకాలం కొనసాగలేమన్న అపనమ్మకమా? అలాగే టిక్కెట్ కలెక్టర్ కూడా.

'కలకానిది.. విలువైనది' అన్నారు శ్రీశ్రీ.

కలకానిది ఎప్పుడూ విలువైనదే. యాక్టరో డాక్టరో కావాలని 'కల' కన్నాడుగానీ, సాకారం చేసుకోవడంలో విఫలమయ్యాడు. 'సంపాదనే' లక్ష్యంగా ఉన్న డాక్టరు తోటివారి ఎదుగుదలతో అసంతృప్తి చెందుతున్నాడు.

## నిర్ణయమే కీలకం

మనిషి చేసే పనులకన్నా ఎక్కువగా ఆలోచిస్తుంటాడు. కుప్పతెప్పలుగా వచ్చే ఆలోచనలన్నీ కార్యరూపానికి సాధ్యపడవు. అందులో మనకు దగ్గరగావున్న ఆలోచనల్ని ఎంచుకుని ఆచరణలో పెడతాం. అలా ఎన్నుకోవటమే 'నిర్ణయం'.

నిర్ణయం తీసుకుంటే వెనుకంజ, పలాయనవాదం ఉండకూడదు. అందుకే డాక్టరు కావాలనుకున్నామె యాక్టరు, కలెక్టర్ కావాలనుకున్న వ్యక్తి రైల్వే టి.సి. అయ్యారు. అంటే నిర్ణయంలో లోపమే అసంతృప్తికి కారణం.

"నిర్ణయం తీసుకునేముందు వాటి మంచి చెడులను పరిపూర్ణంగా విశ్లేషించుకుంటాను. నిర్ణయం సరైన

దని అనిపించినప్పుడే కార్యాచరణలో పెడతాను. అప్పుడిక వెనక్కి చూడను." —బిల్‌గేట్స్

**అసంతృప్తిని తరిమెయ్యడం ఎలా?**

ఈదితేనే అవతలి ఒడ్డుకు చేరగలం. ప్రవాహం వాలుగా ఉన్నా, ఎదురుగా ఉన్నా, లోతెక్కువైనా ఈదాల్సిందే.

పడవ ప్రయాణంలో మనసు ఎంత హాయిని అనుభవిస్తుందో ఈదుతున్నప్పుడు కూడా అదే ఆనందం అనుభవిస్తే మనసులో అసంతృప్తి స్థానాన్ని సంతృప్తి ఆక్రమిస్తుంది.

మీరు ఈదుతున్నప్పుడు, ఒక పిల్లాణ్ణి కాపాడాల్సి వస్తే, మునిగిపోకుండా ఆ పిల్లాణ్ణి కాపాడగలనన్న కాన్ఫిడెన్స్ మీలో ప్రవేశిస్తే చాలు, మీలో అనూహ్యమైనశక్తి చొరబడి, అది ఆ పిల్లాణ్ణి కాపాడేలా చేస్తుంది. ఆ సమయంలో మీలో చేస్తున్న పని మీద అనుమానం వైదొలగి ఆశాభావం ప్రవేశిస్తుంది.

నిరాశలోనూ... 'ఆశ' సాక్షాత్కారిస్తుంది.

మీ శక్తినంతా వినియోగించి ఆ పిల్లాణ్ణి ఒడ్డుకు చేర్చి మరణం తప్పించారు. అప్పుడు ఆ పిల్లాడు కృతజ్ఞతగా మీవైపుచూసే ఒక్కచూపు చాలు. మీరు విజయకేతనం ఎగరెయ్యడానికి.

అసంతృప్తిని తరిమెయ్యాలంటే, చేస్తున్న పనిలో సంతృప్తి వెదుక్కోవాలి.

**ఓర్పు నేర్పు**

చేస్తున్న పనిలో నిరాశను వెదుకుతూ, అక్కరకురాని ఊహల్లో, కలల్లో బతికేవారికి, ఒకవేళ నిజంగా నచ్చిన పని లభించినా కూడా నెగ్గుకొస్తారన్న గ్యారంటీ లేదు.

చేస్తున్న వ్యాపారం, వ్యవసాయం వదిలేసి సినిమాలుతీసిన కుబేరులు చాలామంది కుచేలురయ్యారు. అంటే, అభిరుచిలేనిరంగంలో ఉన్నవారు ఎప్పటికీ అట్టడుగునే ఉండిపోతారన్న నిబంధనలేదు.

కావల్సిందలా.. ఓర్పు... నేర్పు..

పుట్టగానే స్థిరమైన భావనలు ఏర్పడవు. మన అభిరుచులు, ఆశయాలు, లక్ష్యాల్లో మార్పులొస్తుంటాయి. అందుకే ఏ పనిచేసినా ఓర్పు, నేర్పు, ప్రతిభ, పట్టుదల ఉంటే చాలు, ఏదో ఒకరోజు మనకు అభిరుచిగల పనిలో స్థిరపడతాం.

"లోక్‌సత్తా పార్టీ నాయకుడు డాక్టర్ జయప్రకాష్ నారాయణ మెడిసిన్ చదివి డాక్టరయ్యారు. తర్వాత సివిల్స్ రాసి కలెక్టరుగా పనిచేశారు. చివరకు తనకిష్టమైన రాజకీయాల్లో స్థిరపడ్డారు. ఏ పదవిలో ఉన్నా పదిమందికి ఉపయోగపడేలా తనదైన ముద్ర కనబడేలా పనిచేసి, చివరికి తనకిష్టమైన పనిలో ప్రవేశించారు.

**గివ్ యువర్ బెస్ట్**

కోరుకున్నది అందనప్పుడు అందిన దాంట్లోనే ప్రతిభ చాటాలి. కావాలనుకున్నది సాధించేంత వరకూ కృషి మానకూడదు. శక్తివంచన లేకుండా చేస్తున్న పనికి న్యాయం చెయ్యాలి.

"వారణాసిలో ఒక ఆటోరిక్షా డ్రైవర్ నారాయణ జైస్వాల్. ముగ్గురు ఆడపిల్లలు, పదకొండేళ్ళ కొడుకు ఉన్నారు. కొడుకు పేరు గోవింద్ జైస్వాల్. అక్కడే సంపన్నుల ప్లేగ్రౌండ్స్ ఉండేవి. స్కూలు నుండి వచ్చాక గోవింద్ అక్కడికి వెళ్ళేవాడు. గ్రౌండులోకి ప్రవేశంలేదు. బయట నిలబడిచూస్తూ వాళ్ళకి బాల్ అందించేవాడు. అలా ఆ మైదానంలో ఆడుకునే ఓ ఉన్నత కుటుంబీకుల పిల్లాడికి గోవింద్ నచ్చాడు. తన ఇంటి గ్రౌండ్‌లో ఆడుకోవడానికి గోవింద్‌ను తీసుకెళ్ళాడు. రిక్షాపుల్లర్ కొడుకని తెలుసుకుని ఆ కుర్రాడితండ్రి గోవింద్‌ని బైటికి గెంటేశాడు. అవమాన భారంతో కుంగిపోయాడు గోవింద్. తండ్రి తేలిగ్గా తీసుకున్నాడు. కానీ తండ్రి స్నేహితుడు మాత్రం గోవింద్‌ను ఓదార్చి "నువ్వు బాగా చదివి కలెక్టర్ అయితే నీకింద ఎంతోమంది పని చేస్తారు. అయినా నీలాంటి పేదవాడికి ఆ చదువు అసాధ్యం అని చెప్పాడు. అంతే...ఆ మాటలు గోవింద్ మనస్సులో నివురును తొలగించి నిప్పు రగిలించాయి. తండ్రికి చెప్పి చదువుకునేందుకు ఢిల్లీ వెళ్ళాడు. ట్యూషన్లు చెబుతూ 14 ఏళ్ళు కష్టపడ్డాడు. తండ్రి తనకున్న చిన్న ఫ్లాట్ అమ్మి కొడుక్కి డబ్బు పంపేవాడు. ఆ కష్టాలమధ్య తనలో స్ఫూర్తి, పట్టుదల తగ్గకుండా అబ్దుల్‌కలాం 'వింగ్స్ ఆఫ్ ఫైర్' పుస్తకం చదివేవాడు. అది తనకు తక్షణ శక్తినిచ్చే గ్లూకాన్-డి లాంటిదని చెప్పుకున్నాడు. అలా గోవింద్ జైస్వాల్ సివిల్ సర్వీసెస్ పరీక్షల్లో 48వ ర్యాంకు సాధించి కలెక్టర్ పదవి చేపట్టి చరిత్ర సృష్టించాడు.



"నాకు చేతకాదు అని ఎన్నడూ అనొద్దు. మీలోని శక్తి అనంతం. మీరు సర్వశక్తి సంపన్నులు. మీ స్వభావం ముందు దేశ కాలాలన్నీ స్వల్పమే. చేపట్టిన పనిని మీరు సాధించగలరు" —వివేకానంద

"ఎవడు కొడితే దిమ్మ తిరిగి మైండ్ బ్లాంక్ అయిపోతుందో...."

"ఎప్పుడొచ్చావన్నది కాదన్నయ్యా! బుల్లెట్ దిగిందా? లేదా?" వంటి పంచ్ సినిమా డైలాగులు వినగానే... రోమాలు నిక్కబొడుచుకుంటాయి.

ఎవరి గురించి చెబితే రోమాలు నిక్కబొడుచుకుంటాయో వాళ్ళే విజేతలు. వాళ్ళే చేపట్టిన పనిలో 'బెస్ట్ షాట్' ఇవ్వగల ధీరులు.

---

## హేట్సాఫ్ ఎమ్వీయల్




వృత్తిని, ప్రవృత్తిని సమానంగా చూసి, రెండింటిలోనూ సంతృప్తి పొందే వ్యక్తులు అరుదు. అలాంటి అరుదైన వ్యక్తి, స్నేహశీలి, సాహితీవేత్త కీ.శే. ఎమ్వీఎల్. "ముత్యాలముగ్గు" సినీ నిర్మాతగా అందరికీ సుపరిచితులు. పూర్తి పేరు మద్దాలి వెంకట లక్ష్మీ నరసింహారావు.

సెప్టెంబర్ *21*న *1944*లో జన్మించారు. డిగ్రీ వరకు బందరులో, ఉస్మానియాలో ఎం.ఎ. చదివారు. నూజివీడు కళాశాల ప్రారంభం నుండి తెలుగు శాఖాధ్యక్షులుగా ఉంటూ ఎందరో సాహితీ ప్రియుల మన్ననలు పొందిన రచయిత ఎమ్వీఎల్. మృదుభాషణం, పదాల పొందిక, హృద్యమైన కథనం, అవిరళధారణ అన్నీ కలిస్తే ఎమ్వీఎల్.

తెలుగు సాహిత్యంలోని అందమైన మధురమైన మాటలన్నీ ఒకేచోట పోగై వారి గొంతులో స్నేహం చేసేవి. నన్నయ భారతం నుండి ఆధునిక కవిత్వం వరకు కవిత్వతత్వాన్ని కళ్ళకు కట్టించి, సాహిత్యం లోతుల్ని చూపించి, సుమధురంగా పాఠ్యాంశం బోధించడంలో మహోపాధ్యాయుడు ఎమ్వీఎల్. పాఠం చెప్పడంలో, పద ప్రయోగంలో తనదైన ప్రత్యేక ముద్ర ఆయనకే సొంతం.

తెలుగు నాట బళ్ళారి నుండి బరంపురం వరకు తన ఉపన్యాసాల పన్నీటి జల్లులతో, సాహితీ అభిమానులను ఓలలాడించిన 'మెలోడియస్ వాయిస్ ఆఫ్ లిటరేచర్' ఆయన వాణి. అది ఆయన వృత్తి.

ప్రవృత్తిగా సినీరంగంలోనూ తనదైన ముద్ర వేసుకున్న అజరామరుడు. తెలుగు వాకిట 'ముత్యాల ముగ్గు' వేసి 'గోరంత దీపం' వెలిగించి, 'స్నేహం' హస్తాలు అందించి, ప్రతి ఇంట్లో ఉండే "ఓ ఇంటి భాగోతం" చూపించారు. బాపు, రమణ, ఆరుద్ర వంటి సినీ దిగ్గజాలకు సన్నిహితులు ఎమ్వీఎల్. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి పరిశోధనలకు సాయపడ్డారు.

మలుపు-మరుపు, నిన్నస్వప్నం, నేటి సత్యం, కవితాహారతి, కానుక, కదనవనం, ఉడుగర వంటి విలక్షణ రచనలు, సినిమాలకి మాటలు ఎమ్వీఎల్ ప్రత్యేకతలు.

యువకవుల మినీ కవితలను ఆంధ్రదేశమంతటా తననోట విన్పించి వారిని ప్రోత్సహించిన సాహిత్య వారధి, వాగ్వైభవ శోభితులు, సాహిత్య రసవేత్త. పిన్నవయసులోనే పరమపదించిన అమరజీవి ఎమ్వీఎల్.



# మొక్కు

## జొన్నలగడ్డ రామలక్ష్మి

**ఆ రోజు గురువారం. శనివారం అమ్మ మొక్కు తీర్చడానికి యాదగిరిగుట్ట వెళ్ళాలి.**

**నిన్నటి నుంచీ ఆకాశం మేఘావృతమై ఉంది. ఉండుండి వాన తుంపర పడుతోంది. వాతావరణ శాఖ అంచనా ప్రకారం, రేపటికిది పెనుతుఫానుగా మారొచ్చు.**

**"వెధవ వాన. సరిగ్గా సమయానికి పట్టుకుంది" విసుక్కున్నాను.**

"యోగముంటే ఈ శనివారం వెడతాం. లేకుంటే పై శనివారం వెళ్ళొచ్చు. అనవసరంగా వానని తిట్టకు" మందలించింది అమ్మ.

ఎండిన బీడుని పచ్చని తోటగా మార్చేదీ వానే. పండిన పంటని తడిపిముద్దచేసి నిరర్థకం చేసేదీ వానే. నదుల్ని నింపేదీ వానే. ఊళ్ళని ముంచేదీ వానే.

ఎవరి జాగ్రత్తల్లో వాళ్ళుండాలి కానీ ప్రకృతి ప్రసాదించిన వానని ఏమీ అనకూడదు.

అమ్మకి అలాగే అనిపిస్తుంది. ఆమె మొక్కు కూడా వానలాంటిదే.

మా క్షేమంకోసం తను మొక్కుకుంటుంది. అది తీర్చడానికి నేను ఇబ్బంది పడాలి.

ఇదిగో ఇప్పుడు యాదగిరిగుట్టకి ప్రయాణం అలాంటిదే!

వాన గురించి అమ్మకంటే నేనే కలవరపడ్డాను కానీ, శుక్రవారం సాయంకాలానికే వాన పూర్తిగా తెరిపిచ్చి, కొంచెం ఎండపొడ కూడా కనిపించింది.

***

శనివారం ఉదయం ఆరుగంటలకే కార్లో యాదగిరిగుట్టకి బయల్దేరాం.

నేను డ్రైవింగ్ సీట్లో, పక్కనే నా భార్య లత, వెనక సీట్లో డెబ్బయ్యో పడిలోని అమ్మానాన్నలు, ఐదేళ్ళ నా కొడుకు చింటూ.

ఇలాంటి యాత్రలు మాకు మామూలే. అమ్మకి భక్తి ఎక్కువ. ఆ భక్తితో మొక్కే మొక్కులూ ఎక్కువే. తనకి నేను లేక లేక పుట్టిన ఏకైక పుత్రరత్నాన్ని. నా పుట్టుక తన మొక్కుల ఫలితమే అంటుంది అమ్మ. ఫలితంగా ఇప్పుడు ఆమె మొక్కులు తీర్చే బాధ్యత నాదైంది.

నాన్నగారికి కొత్త కొత్త ప్రదేశాలు చూడ్డం, ప్రదేశం పాతదైనా ప్రకృతిని ఆస్వాదించడం చాలా ఇష్టం. ఆయనకి భక్తి ఉంది కానీ మొక్కుకునే అలవాటు లేదు. ఆధ్యాత్మిక గ్రంథాలు విపరీతంగా

చదువుతారు. స్నానం చేశాక ఓ గంట జపం చేస్తారు. ఆధునికుల కోసం దాన్ని మెడిటేషన్ అన్న పేరుతో సమర్థించుకుంటారు.

నా ఆఫీసుకి శని, ఆదివారాలు సెలవు. ప్రతి శనివారం విహారయాత్ర అలవాటైపోయింది మాకు.

సాధారణంగా నెలలో మూడువారాలు గుళ్లూ, గోపురాలకు వెడతాం. ఒక వారం నాన్నగారికి నచ్చే ప్రదేశాలు చూస్తాం. ఆదివారం ఇంట్లోనే విశ్రాంతి. ఇవీ మా వారాంతపు కార్యక్రమాలు.

శనివారాలు అమ్మకి ఉపవాసం. అంటే పళ్లు మాత్రమే తింటుంది. నాన్నగారికి ఉపవాస నియమం లేదు కానీ ఆరోజుకి మాత్రం అమ్మతో పాటే తనూ పళ్ళు మాత్రమే తింటారు. ఉపవాసమనడం ఆయనకి ఇష్టముండదు. ఫ్రూట్ డైట్ అంటారు. మేమైతే ఏదో ఒక హోటల్లో నార్తూ, సౌతూ, చైనీసూ వగైరాలు మార్చి మార్చి తింటుంటాం.

ఎప్పుడు ఏ గుడి ప్రోగ్రాం పెట్టుకున్నా, తీర్చుకోవడానికి అమ్మకి ఏదో ఒక మ్రొక్కుంటుంది. ప్రయాణంలో చింటూ అమ్మ పక్కనచేరి కబుర్లు మొదలెడతాడు. వాడికి ఎన్ని సందేహాలో. మేమైతే విసుక్కుంటాం కానీ అమ్మ మాత్రం చాలా ఓపికగా వాడి సందేహాలు తీరుస్తుంది.

విహారయాత్రలకి వెళ్ళినప్పుడు చింటూ నాన్నగారి పక్కన చేరతాడు. మామూలుగా కనిపించే ప్రకృతిని గురించి వాడికి సైంటిస్టులకి పనిచెప్పే సందేహాలెన్నో కలుగుతాయి. నాన్నగారు వాడి వయసుకి తగ్గట్టు ఆసక్తికరంగా జవాబులిస్తారు.

విశేషమేమిటంటే అమ్మ, నాన్నగారు కూడా చింటూ అడిగే ప్రశ్నలకోసం ఎదురుచూస్తున్నట్లు కనిపిస్తుంది. అందుకని వాడికి శనివారమంటే మహా ఇష్టం. బడికెళ్ళడానికి పొద్దుట ఏడింటికి కూడా లేవడానికి మారాం చేసే చింటూ, శనివారం నాడు ఐదవకుండా లేచి కూర్చుంటాడు.

నేను, నాన్నగారు చదివే ఆధ్యాత్మిక గ్రంథాలతో పాటు, ఫిక్షన్, చరిత్ర పుస్తకాలు కూడా చదువుతాను. అమ్మలాగ భక్తీ ఉంది. అమ్మంత కాకపోయినా అడపాదడపా మ్రొక్కుకునే అలవాటు నాకూ ఉంది.

లత కాసేపు టీవీ చూస్తుంది. పుస్తకాలు చదవడం తక్కువ. మహా అయితే పత్రికలు తిరగేస్తుంది. పూజలూ పునస్కారాలూ చెయ్యదు కానీ గుడికెడితే మాత్రం దేవుడి విగ్రహానికి నిష్ఠగా దణ్ణం పెట్టుకుంటుంది.

నేను డ్రైవ్ చేస్తున్నాను. కాలక్షేపానికి పాటలు పెట్టుకునేందుకు లేదు. లత పక్కనే ఉన్నా తనతో మాట్లాడడానికి లేదు. వెనుక సీట్లో చింటూ తొణగనివ్వడు!

వాడి ప్రశ్నల పరంపర మొదలైంది, "నానమ్మా! మొక్కు అంటే ఏమిటి?" అని.

వివరంగా చెప్పాలనుకుందేమో, అమ్మ గొంతు సవరించుకుంది. "మనమేదైనా ఒక పని జరగాలని అనుకున్నామనుకో. మనమెంత ప్రయత్నించినా అది జరగలేదనుకో. అంటే దానికి మానవ ప్రయత్నం చాలదన్న మాట. భగవంతుడి సాయం కావాలి. అప్పుడు మనం 'నాయనా, తండ్రీ నాకీ పని జరిగేలా చూడు' అని దేవుడికి చెప్పుకుంటాం. ఉత్తినే చెయ్యమంటే మా చింటూ మాత్రం ఏ పనైనా చేస్తాడా? తాయిలం కావాలంటాడు. మ్రొక్కు అంటే దేవుడికి తాయిలం అన్నమాట! చింటూకైతే పనికి ముందే తాయిలం ఇచ్చేయాలి. దేవుడికైతే పని జరిగాక మ్రొక్కు తీర్చుకుంటే చాలు"

**ఏదైనా సాధించాలంటే ముందు మానవ ప్రయత్నం చెయ్యాలి. మన బలం సరిపోనప్పుడు ఆ దేవుడికి మన సమస్య చెప్పుకుని మ్రొక్కుకోవాలి, మనవడికి వివరంగా చెప్పింది బామ్మగారు. చిన్నచిన్న వాటికి మనం మ్రొక్కులు మొక్కకూడదని కూడా మనవడికి కౌన్సెలింగ్ చేసిందాబామ్మగారు. ఒక శుభముహూర్తాన ఆ మనవడు కూడా దేవుడికి మాంఛి మ్రొక్కు మొక్కుకున్నాడు. ఏమిటా మ్రొక్కు?**

"ఓc" అన్నాడు చింటూ. విషయం అర్థమైనప్పుడు వాడలాగంటాడు. వాడి వయసుకలాగనడం చాలా ముద్దుగా ఉంటుంది. వాడిచేత 'ఓc' అనిపించడానికే అమ్మా నాన్నా వాడి ప్రశ్నలకి బదులిస్తారేమో అనిపిస్తుంది.

"మరిప్పుడు దేనికి మొక్కావు?" అన్నాడు చింటూ.

"మొన్న మీ నాన్నకి కాలు బెణికి ఓ పట్టాన తగ్గలేదుగా. యాదగిరిగుట్టకి వస్తానని మ్రొక్కుకోగానే తగ్గిపోయింది. ఆ మ్రొక్కు తీర్చుకుందుకే ఈ ప్రయాణం"

"ఓc ఇంకా ఏమైనా మొక్కులున్నాయా నానమ్మా?" అడిగాడు చింటూ.

"రెండ్రోజుల క్రితం నీకు జలుబు చేసిందిగా, అప్పుడు శ్రీశైలం వస్తానని మ్రొక్కుకున్నాను. ఎప్పుడో మీ నాన్నే తీసుకెళ్ళాలి" అంది అమ్మ నేను కూడా వినాలని కాస్త గట్టిగా.

"ఓc" అన్నాడు చింటూ ముద్దుగా.

వాళ్ళిద్దరి మధ్యా మాటలు జరుగుతున్నాయి. మిగతా ముగ్గురం కేవలం శ్రోతలం.

అమ్మ ప్రతి చిన్న సమస్యకీ మ్రొక్కుకుంటుంది. ఒక్కగానొక్క కొడుకుని కాబట్టి వాటిని తీర్చడం నాకు తప్పదు. ఎప్పుడైనా విసుగనిపించినా, "పెద్దావిడ. అల్పసంతోషి. మ్రొక్కేది కూడా తన కోసం కాదు, మనకోసం" అని లత నన్ను మందలిస్తుంది. తను అలా సమర్థిస్తే అమ్మ కోరిక తీర్చడం మరింత బాధ్యత నాకు.

ఆ శనివారం యాదగిరిగుట్ట మ్రొక్కు అయిపోయింది.

***

అమ్మ ఇండెంట్ పెట్టింది కాబట్టి ఆ పై శనివారం శ్రీశైలం ప్రోగ్రాం వేశాను. అంత దూరం డ్రైవింగ్ కష్టమనిపించి క్యాబ్ బుక్ చేశాను. ఇంట్లో తెల్లవారుజామున నాలుగుకి బయల్దేరాం. అంత పొద్దున్నే లేచి తెమలడం చింటూవల్ల ఔతుందా అనుకున్నాం కానీ, వాడే మూడు కాకుండా లేచి మమ్మల్ని నిద్ర లేపాడు.

డిసెంబరు నెల ఆఖరు వారం. చలి ఎక్కువగా ఉంది. చింటూకి చలి తెలుస్తున్నట్లు లేదు. హుషారుగా కారెక్కాడు. డ్రైవరు పక్కసీట్లో నేను. వెనుక సీట్లో లత, అమ్మ, నాన్నగారు. చింటూ లత ఒడిలో.

కారు నెమ్మదిగా బయల్దేరి స్పీడందుకుంది. కారులోకి చలిగాలి కొడుతుండడంతో అద్దాలు మూయించేశాను.

"నాన్నా! అద్దాలు ఎందుకు మూయించేశారు?" అన్నాడు చింటూ నన్నుద్దేశించి.

"చలిగాలి వేస్తోంది కదా అందుకు!" అన్నాను.

"ఓc మరి మనందరం స్వెట్టర్లు వేసుకున్నాం కదా! డ్రైవరంకుల్ కూడా స్వెట్టరేసుకున్నారు కదా! అయినా చలి వేస్తోందా?" అన్నాడు చింటూ.

"చలేస్తోందో లేదో నువ్వే చెప్పు" అన్నాను.

"వెయ్యడం లేదు. అందుకే అడిగాను. తలుపులు మూసేశారెందుకని!" అన్నాడు చింటూ.

"ఎందుకంటే చలిగాలి మొహానికి తగుల్తుందిగా.



అందువల్ల జలుబు చేస్తుంది. జ్వరం కూడా రావచ్చు."

"ఓc" అని ఊరుకున్నాడు చింటూ. కానీ కాసే పటికే, "నాన్నా! బయటకు చూడండి" అన్నాడు.

బయటకు చూశాను. నాకక్కడ ప్రత్యేకంగా ఏమీ అనిపించలేదు. "ఏముందిరా అక్కడ?" అన్నాను.

"రోడ్లపక్కన ఎంత మంది బజ్జున్నారో! ఎవరికీ కప్పుకోవడానికి కంఫర్టర్లు కూడా లేవు. మరి వాళ్ళకి చలెయ్యదా? జలుబు చెయ్యదా? జ్వరం రాదా?" అన్నాడు చింటూ.

నేనే కాదు, ఒక్కసారిగా కార్లో అందరం వాడి ప్రశ్నకి ఉలికిపడ్డాం. నిజమే, ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటూ కూడా జలుబు, జ్వరం గురించి బెంగ పడుతున్నాం మేము. బయట మా తోటివాళ్ళు ఒళ్ళు కప్పుకుందుకు కూడా బట్టలు లేకుండా ఉంటే ఆ విషయం తట్టనైనా లేదు మాకు.

ఏం చెప్పాలా అని నేనాలోచిస్తుండగా అమ్మ గొంతు సవరించుకుని, "వాళ్ళు పూర్వజన్మలో పాపం చేశారు నాన్నా! అందుకే అలా బాధ పడుతున్నారు. అందుకే మనం కూడా ఈ జన్మలో పాపం చెయ్యకూడదు. చేస్తే వచ్చే జన్మలో మనమూ వాళ్ళలాగే బాధలు పడతాం" అంది.

"ఓc" అన్నాడు చింటూ. అంతలోనే వాడికి మరో సందేహం. "మరి నానమ్మా! వాళ్ళు కూడా నీకులాగా దేవుడికి మొక్కుకోవచ్చుగా" అన్నాడు.

నాన్నగారు కలగజేసుకుని "అందరికీ మొక్కుల గురించి తెలియదురా నాన్నా! చెప్పడానికి వాళ్ళకి మీ నానమ్మలాంటి వాళ్ళు లేరు" అన్నారు.

డ్రైవర్ ముసిముసిగా నవ్వాడు. నేను కిసుక్కున నవ్వాను. నా నవ్వుతో అమ్మ నవ్వు కూడా కలిసింది.

లత మాత్రం నవ్వినట్లు లేదు. అమ్మానాన్నల విషయంలో లత చాలా జాగ్రత్త తీసుకుంటుంది. అదేమంటే, 'భయం కాదు గౌరవం' అంటుంది.

అలా దారి పొడుగునా చింటూ కబుర్లతో, అమ్మానాన్నల స్పందనలతో ప్రయాణంలో టైం తెలియలేదు. మధ్యలో ఒక చోట టిఫిను తినడానికి కారు ఆపుకున్నాం. అమ్మానాన్న మాత్రం దైవదర్శనమయ్యేదాకా పండ్లు కూడా తీసుకోమన్నారు.

కొండ చేరుకుని స్పెషల్ దర్శనం టికెట్ తీసుకుని మల్లన్ననీ, భ్రమరాంబనీ దర్శించుకుని బైటకొచ్చేసరికి సాయంత్రం నాలుగైంది.

అప్పుడు పళ్ల తిన్నారు అమ్మానాన్నలు. మేము హోటల్లో ప్రయత్నిస్తే టిఫిన్లే దొరికాయి.

"నాకు టిఫినొద్దు. అన్నమే కావాలి" అని పేచీ పెట్టాడు చింటూ.

"అందాకా టిఫిన్ తిను నాన్నా! రాత్రికి అన్నం పెట్టిస్తాగా" అంది లత.

"రాత్రే టిఫిను తింటాను. ఇప్పుడు అన్నమే కావాలి" అన్నాడు చింటూ.

"ఉత్తప్పుడు అన్నం వద్దని పేచీ పెట్టే వెధవ్వి, ఇప్పుడు నీకు అన్నం కావాల్సొచ్చిందా?" అని విసుక్కున్నాను.

"పిల్లలంటే అంతేరా! నిజం చెప్పాలంటే ఇలాంటి ప్రయాణాల్లో పిల్లలు ఎంత ఏడిపిస్తారో తెలుసా? మన చింటూ బంగారు తండ్రి. అస్సలు ఏడిపించడు" అంది అమ్మ చింటూకి లబ్జు వేస్తూ.

"ఔను. పుట్టినప్పట్నించీ నీ మొక్కులతో ప్రయాణాలు అలవాటైపోయి రాటుదేలాడు మన చింటూ" అన్నారు నాన్నగారు. అమ్మపై విసుర్లు... ఆయన కదో ముచ్చట!

డ్రైవరు మళ్ళీ ముసిముసిగా నవ్వాడు. లత ముఖంలో నవ్వు కనిపించకుండా దాచుకుంది. నేను కొంచెం గట్టిగానే నవ్వాను.

"నవ్వండి. నవ్వండి. మీరంతా ఇలా నవ్వుతూ సుఖంగా ఉన్నారంటే నా మొక్కులవల్లే" అంది అమ్మ. ఆ గొంతుని బట్టి చిన్నబుచ్చుకుందా అనిపించింది.

చింటూ వెంటనే, "నానమ్మా! నాకిప్పుడు అన్నం దొరకాలని మొక్కుకో" అన్నాడు. వాడి కళ్ళల్లో అన్నం కావాలన్న కాంక్ష. వాడి గొంతులో మొక్కుకుంటే అన్నం దొరుకుతుందన్న ఆశ.

అమ్మ వాణ్ణి దగ్గరగా తీసుకుంది. "దేవుడికి మొక్కకపోయినా, మనకి అన్నమెలాగూ దొరుకుతుందిరా! ఇలాంటి చిన్నివాటికి మొక్కుకోకూడదు. దేనికైనా సరే, బాగా ఆలోచించుకుని అప్పుడు మొక్కుకోవాలి" అంది. వాడు సర్దుకుని సరేనని అప్పటికి టిఫినుకి ఒప్పుకున్నాడు.

తిరుగు ప్రయాణంలో అమ్మ నాతో, "పక్కనుండే దేవుళ్ళైతే ఏమో కానీ, శ్రీశైలం ప్రయాణం చాలా కష్టం. ఓపిగ్గా భరించి నా మొక్కు తీర్చావు. నిన్ను మెచ్చుకోవాలిరా" అంది.

"ప్రయాణం ఎంత కష్టమో తెలిసిందిగా. మన వడికి చెప్పడం కాదు. ఇకమీదట మొక్కుకునే ముందు నువ్వు కూడా బాగా ఆలోచించాలి" అన్నారు నాన్నగారు.

అమ్మ ఏదో అనేలోగా, "ఓc మొక్కుకునే ముందు బాగా ఆలోచించాలన్నమాట!" అన్నాడు చింటూ.

తన మాటలో వ్యంగ్యముందని వాడికి తెలియకపోవచ్చు. కానీ మిగతావాళ్ళకి తెలుస్తుందిగా. అమ్మ నవ్వింది. నాన్నగారు నవ్వారు. నేనూ నవ్వాను. డ్రైవరు నవ్వాడు. మాట చింటూది కాబట్టి లత కూడా తటపటాయించకుండా మనసారా నవ్వింది.

అంతమంది నవ్వితే తనూ నవ్వాలి కామోసనుకుని చింటూ కూడా గట్టిగా నవ్వాడు.

రాత్రి ఎనిమిదికి ఓ హోటలు దగ్గర ఆగాం. అమ్మానాన్నలు అక్కడేం తినరు. మిగతా పెద్దల్లో డ్రైవరుకి తప్ప ఎవరికీ ఆకలి లేనట్టుంది. చింటూ కోసం భోజనం ఆర్డరిస్తే, వాడు అప్పటికే నిద్రపోతున్నాడు. లేపితే నిద్ర తిక్క. లత ఎలాగో వాడి నోట్లో ఇంత పెరుగన్నం కూరి, మిగతాది తనే తినాల్సొచ్చింది.

ఇల్లు చేరేసరికి బాగా రాత్రయింది. అంతా త్వరగా నిద్రకి పడ్డాం.

***

మర్నాడు ఉదయం నిద్ర లేస్తూనే చింటూ




## కన్నీటి వాసన

పూర్ణమో... అసంపూర్ణమో
బహుళ నాలుకల మీద తారాడే...
'బోర్' అనే భాషా భావాన్ని బహిష్కరిద్దాం.
నక్షత్రాల పౌరశాలువా కప్పుకుని బజ్జుందాం

ముక్కలై... ఛిద్రమై.....
దురాచారాల అంధకారంలో
మూఢనమ్మకాల బొగ్గుల బస్తా దొర్లించుకుని
కాలాన్ని కరిగిస్తున్న సమాజాన్ని
ప్రమిదల పల్లకి ఎక్కిద్దాం
ఆకలి అగ్ని రవ్వో...
దుఃఖాల చిల్లుల గూడో
అస్థిపంజరంలాంటి మనుషులు
నిప్పుల గుండంలో నిలబడి
నిరీక్షణ కాగడా చూపిస్తున్నారు
ఆకలి నిండిన కడుపులు మనవి...
ఆశలు తీరిన మనసులు మనవి
చేయి అందిద్దాం...
ఆ స్పర్శకు మొలకెత్తే మనుషులను చూసి
మన మనసుల్ని కూడా తృప్తితో నింపుకుందాం.
గురి గింజలో...
పులి పంజాలో...
అహంకారానికి, ఆత్మన్యూనతా భావానికి పట్టం గట్టి



వ్యక్తిత్వానికి అర్థాలే మార్చేస్తున్నాయి.
త్యాగాలు వద్దు
ఒకరికోసం ఒకరు కొద్దిగా జీవిద్దాం.

**—డా. పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి**
**సెల్: 94402 79594**

## అందుకే తప్పుకుందా?

శ్రుతిహాసన్‌తో 'సంఘమిత్ర' సినిమా చేస్తున్నట్టు చిత్ర యూనిట్ ఎప్పుడో ప్రకటించింది. 'బాహుబలి' తరువాత ఖరీదైన బడ్జెట్‌తో రూపొందుతున్న సినిమా తమదే అని గొప్పలు కూడా చెప్పుకుంది. ఈ సినిమా కోసం శ్రుతిహాసన్ కష్టతరమైన యుద్ధ విన్యాసాల్లో శిక్షణ కూడా తీసుకుంది. ఎక్కువ బడ్జెట్, స్టార్ హీరోయిన్ అన్నీ ఈ సినిమాకు ప్లస్ పాయింట్లవుతాయనీ, సినిమా మంచి విజయాన్ని సొంతం చేసుకుంటుందని విమర్శకులు అంచనాకు వచ్చేశారు కూడా! కేన్స్ ఉత్సవంలో 'సంఘమిత్ర' సినిమా పోస్టర్‌ను విడుదల చేశారు. సరిగ్గా ఇక్కడే తేడా కొట్టింది అంటున్నారు సినీ జనాలు. ఆ పోస్టర్ ఎవరినీ ఆకట్టుకోకపోగా, దానిమీద బీభత్సమైన విమర్శలు వచ్చాయి. పోస్టర్‌లో ఉన్నది శ్రుతిహాసన్ నిజమైన ఫొటో కాదు. పెయింట్. దాంతో ఆ పోస్టర్ ఎవరినీ ఆకర్షించలేకపోయింది. కేన్స్‌లో మెరిసిపోదామని ఆశించిన శ్రుతికి ఈ విమర్శలు తీవ్ర నిరాశనే మిగిల్చాయట! పోస్టరే ఇలా ఉంటే సినిమా విడుదల తరువాత పరిస్థితి ఎలా ఉంటుందో అన్న అనుమానం శ్రుతికి కలిగింది అంటున్నారు. అందుకే తప్పుకుందనీ, ఈ సినిమా నుంచి వైదొలగడానికి చెబుతున్న కారణాలు నిజం కాకపోవచ్చని కొందరు అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఈ సినిమా కోసం దాదాపు రెండు సంవత్సరాల డేట్లు ఇమ్మంటున్నారనీ, అది కుదరకనే శ్రుతి తప్పుకుందన్నది మొదటి కారణం. అసలు కథ చెప్పినప్పుడు డేట్ల విషయం కూడా చెబుతారు. వారు చెప్పిన డేట్లకి కొద్దిగా అటూ ఇటూ కావడం తరచూ జరుగుతూనే ఉంటుంది. మొదట నెలో రెండు నెలలో అని చెప్పి ఒక్కసారి రెండు సంవత్సరాలు అని అనరు కదా? అన్నది కొందరి అనుమానం. పూర్తి స్క్రిప్ట్ శ్రుతికి ఇవ్వలేదన్నది రెండో అనుమానం. ఇది కూడా అనుమానాలకే తావిస్తోందట! మొత్తానికి ఈ సినిమా నుంచి శ్రుతి ఎందుకు తప్పుకోవలసి వచ్చిందో, అందుకు దారితీసిన కారణాలు తదితరాల మీద బోలెడన్ని అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి.

---

అమ్మదగ్గరికి పరిగెత్తుకొచ్చాడు.

"ఏమిట్రా హడావిడి?" అంది అమ్మ.

"నానమ్మా! రాత్రి నేను దేవుడికి మొక్కుకున్నా!" అన్నాడు చింటూ.

అమ్మ తెగ ఆనందపడిపోయి, "మా తండ్రీ, మా నాయనే, మా బంగారే" అని ముద్దులాడేసింది వాణ్ణి.

ఆ తర్వాత పెద్దగా అరిచి ఇంట్లో మమ్మల్నందరినీ పిలిచి, "చూశారా, ఎవరెన్ని నవ్వుకున్నా వీడికి నేనే ఆదర్శం. రాత్రి దేవుడికి మొక్కుకున్నాట్ట" అంది.

నాన్నగారి ముఖంలో ముచ్చటతో కూడిన కుతూహలం. "చింటూ, ఏమని మొక్కుకున్నావురా?" అన్నారు.

చెప్పడానికి షరతు పెట్టాడు చింటూ. వాడికి హోటల్లో అన్నం తినాలన్న మనసు నిన్న తీరలేదుట. అదీవేళ తీరిస్తేనే చెబుతానన్నాడు.

లత వాడితో బాగా దెబ్బలాడింది కానీ అమ్మ వాణ్ణి సమర్థించింది. "నిన్న ప్రయాణంలో ఒళ్ళు పులిసిపోయింది. ఈ రోజుకింక వంటపని లేకుండా వాడు చెప్పినట్లు చెయ్యడమే మంచిది" అంది.

ఆ రోజు మధ్యాహ్నం హోటల్లో భోంచేసి ఇంటికి వచ్చాక అంతా ఒకచోట కూర్చుని చింటూని అడిగాం వాడేం మొక్కుకున్నాడో చెప్పమని.

అంత అటెన్షన్ వచ్చేసరికి వాడికి చాలా గొప్పొచ్చేసింది. పెద్దవాడిలా పోజిస్తూ "నాకెప్పుడు తినాలనిపిస్తే అప్పుడు అన్నమే దొరకాలని మొక్కుకున్నా" అన్నాడు చింటూ.

అది విని అంతా నిరుత్సాహపడ్డాం. "మరీ ఇంత చిన్నవాటికి మొక్కుకున్నావంటే నానమ్మ పోలిక బాగా వచ్చేసిందన్నమాట!" అన్నారు నాన్నగారు గొణుగుతున్నట్లు.

చింటూ గొప్పముఖం పెట్టి నవ్వాడు. "కష్టమైనవి కోరుకుంటే జరక్కపోవచ్చుగా. మొక్కు తీర్చుకోవాలంటే సులభంగా జరిగేవే కోరుకోవాలి. ఆలోచించే వాళ్ళు అలాగే చేస్తారు. కదూ నానమ్మా!" అన్నాడు.

అమ్మ ఆప్యాయంగా చింటూ భుజం తట్టి, "అవున్రా చింటూ!" అంది. తర్వాత నా వైపు తిరిగి, "విషయం పెద్దదా, చిన్నదా అని చూడకూడదు. మొక్కింది చిన్నవాళ్ళా అన్న పట్టింపు ఉండకూడదు. మొక్కుంటే మొక్కే. అది తీర్చాల్సిందే" అంది అమ్మ.

నా గుండెల్లో రాయి పడింది. ఇష్టమో, కష్టమో అమ్మతో నిష్ఠూరమెందుకని వారం వారం ఏదో గుడికి తీసుకెడుతున్నాను. అగ్నికి ఆజ్యంలా ఇప్పుడు అమ్మకి చింటూ తోడైతే....

"ఏ దేవుడికి మొక్కుకున్నావురా?" అన్నాను కాస్త బెంగగా.

"శ్రీశైలం మల్లన్నకి..." అన్నాడు.

"నిన్ననే కదరా వెళ్ళొచ్చాం. మళ్ళీ అంత ప్రయాణం చేసి వెళ్ళాలంటే కష్టం కదా! దేనికైనా ఆలోచించి మొక్కుకోవాలి" మందలించింది లత.

"ఆ విషయం నిన్న కార్లో తాతగారు చెప్పారుగా. అందుకని బాగా ఆలోచించే మొక్కుకున్నాను" అన్నాడు చింటూ మళ్ళీ గొప్పగా మొహం పెట్టి.

నిన్నటిలా వాడి మాటకి ఈరోజు కూడా అంతా నవ్వుతారనుకున్నట్లున్నాడు. తనవంతుగా నవ్వడానికి సన్నద్ధుడౌతున్నాడు చింటూ. కానీ, "ఆలోచిస్తే శ్రీశైలం వస్తానని కాదు, ఊరి చివర్లో ఉన్న ఏ గుడికో వస్తానని మొక్కుకునేవాడివి" అని చిరాకు పడింది లత.

"నేను శ్రీశైలం వస్తానని మొక్కుకోలేదమ్మా! మనం శ్రీశైలం వెళ్ళేటప్పుడు ఊళ్ళోనే దారిలో రోడ్డు పక్కన చలిలో వణుకుతూ బజ్జున్నారు చూడు. వాళ్ళకి కంఫర్టర్లు ఇస్తానని మొక్కుకున్నా. మనం శ్రీశైలందాకా వెళ్ళక్కర్లేదు. వాళ్ళకి కంఫర్టర్లిచ్చి వచ్చెయ్యడమే" అన్నాడు చింటూ.

అక్కడున్న పెద్దలందరం అవాక్కైపోయాం.

ఎన్నేళ్ళ నుంచో రోడ్డుపక్కన అభాగ్యుల్ని చూస్తున్నాం. వాళ్ళని చూసి చలించిపోయిన సిద్ధార్థుడు, వివేకానందుడు, మథర్ థెరిసాల గురించి చదువుకున్నాం. కానీ ఆ అభాగ్యుల గురించి ఓ లేత మనసులో కలిగిన స్పందన మాలో ఎవ్వరికీ కలగలేదు.

మొక్కు మూఢ నమ్మకం కాదు. స్వార్థం కాదు. మన దేశాన్ని వేధిస్తున్న ఎన్నో సమస్యలకి సామాన్యులనుంచే గొప్పదైన సులభ పరిష్కారం!

కానీ మనలో ఎందరం చింటూలాం కాగలం?

సెల్: 98856 20065

# సురభి

## పజిల్ దీవి

వార్తాపత్రికల్లో పిల్లలను ఆకర్షించేది 'దారి కనుక్కోండి' అనే పజిలే! పార్కుల్లో కూడా మొక్కలతో మేజ్‌లు తయారుచేస్తారు. అయితే ఇలాంటి తికమకపెట్టే పజిల్స్ ఓ దీవి నిండా ఉన్నాయి. ఎన్నో ఏళ్ళ చరిత్ర కలిగిన ఆ దీవి రష్యాలో ఉంది.



రష్యా తెల్ల సముద్రంలోని బోల్షోయ్ జయత్స్కీ ద్వీపంలో డజన్ల కొద్దీ తికమక పజిల్స్ దర్శనమిస్తాయి. అవి క్రీస్తుపూర్వం ముప్పై వేల సంవత్సరాల క్రితంనాటివట. ఒక్కోటి 0.4 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో ఉండే ఈ వింత చిక్కుదారుల్లో కొన్నింటిని రాళ్లు పేర్చి, మరికొన్నింటిని మట్టిదిబ్బలు, పుట్టలు వంటివాటితో తయారు చేశారు. అసలు వీటిని ఎందుకు ఏర్పాటు చేశారో తెలియలేదు. కానీ దుష్ట ఆత్మల్ని పట్టి బంధించడానికి చేసేవారని అనుకుంటున్నారు. ఈ దారులు చక్రీయంగా వంపులు తిరుగుతూ ఒకదాన్నొకటి చూసుకునే సర్పాల తలల మాదిరిగా వింతగా గమ్మత్తుగా ఉంటాయి. కొన్ని వేల సంవత్సరాలనాటివైనాగానీ, ఇప్పటికీ చెదిరిపోకుండా ఉండటం విశేషం.

## మిస్టీరియస్ లైబ్రరీ

అనగనగా అమెరికాలో ఓ గ్రంథాలయం. చరిత్ర తెలుసుకోవాలనుకుంటే ఆ లైబ్రరీకి వెళ్ళకండి. పోనీ పురాతన గ్రంథాల కోసమో, వర్తమాన అంశాల కోసమో అయితే అస్సలు వెళ్ళనక్కరలేదు. ఎందుకంటే ఆ గ్రంథాలయంలో అన్నీ మిస్టరీ పుస్తకాలు, నవలలు మాత్రమే ఉంటాయి. అమెరికా ప్రింటింగ్ రంగానికి చెందిన ఒట్టో పెంజ్లర్‌కి మిస్టీరియస్ ప్రెస్ ఉండేది. డెబ్భైయ్యోదశకంనుండి అక్కడ ముద్రితమైన మిస్టరీ కథల పుస్తకాలన్నీ భద్రపరిచేవాడు ఒట్టో.



అలా నాలుగు దశాబ్దాలపాటు సేకరించిన పుస్తకాలతో గ్రంథాలయం ఏర్పాటుచేశాడు. ఈ లైబ్రరీలో మిస్టరీ, క్రైమ్, ఫిక్షన్, స్పైయింగ్, థ్రిల్లర్ కథల పుస్తకాలు బోలెడున్నాయి. షెర్లాక్‌హోమ్స్ రచనలన్నీ ఈ గ్రంథాలయంలో లభించడం విశేషం. అలా ప్రపంచంలోనే అత్యంత పురాతనమైన, అతిపెద్ద మిస్టీరియస్ గ్రంథాలయంగా దీనికి పేరొచ్చింది.

## బుడతడి స్కేటింగ్ రికార్డ్



కాళ్ళకి స్కేటింగ్ షూ వేసుకుని రయ్...మని దూసుకుపోతున్నాడు ఆ బుడతడు. మెల్లగా కిందికి వంగిపోతూ 30 సెంటీమీటర్ల హర్డిల్స్ కింది నుంచి చక్కగా వెళ్ళి గిన్నిస్‌బుక్‌లో కెక్కేశాడు. మణిపూర్‌కి చెందిన టిలుక్ క్రైసమ్ లిండో సాధించిన ఘనత ఇది. ఎనిమిదేళ్ళ వయసుగల ఈ బుడతడికి స్కేటింగ్ అంటే మహా ఇష్టమట. ఆరేళ్ళప్రాయంలో తను సృష్టించిన గిన్నిస్ రికార్డ్‌ని రెండేళ్ళ తర్వాత ఇప్పుడు మళ్ళీ తానే బ్రేక్ చేసి శభాష్ అనిపించుకున్నాడు. 475 అడుగుల దూరాన్ని కేవలం 30 సెంటీమీటర్ల ఎత్తుగల హర్డిల్స్ కిందినుంచి స్కేటింగ్ చేస్తూ వెళ్ళి అందరిచేతా శభాష్ అనిపించుకున్నాడు.

## చర్చ్‌లో రోబో ఫాదర్!

మనుషులు చేసే పనులన్నీ దాదాపు రోబోలే చేస్తున్నాయి. పెద్దవాళ్ళకు వంటింట్లో సహాయంగానే కాదు, హాస్పిటల్స్‌లో డాక్టర్లకు చేదోడుగా ఉంటూ ఆపరేషన్లు సైతం చేస్తున్నాయి. ఇప్పుడు మీకు దేవుని దీవెనలు అందించేందుకు చర్చ్ ఫాదర్‌గా అవతరించింది! 'బ్లెస్‌యూ 2' రోబో!

జర్మనీ, విట్టెన్‌బర్గ్‌లోని ఓ చర్చిలో రోబో ఫాదర్‌ను ఏర్పాటుచేసి వచ్చినవారికి ఆశీర్వాదాలు ఇప్పిస్తున్నారు. మత గురువు మార్టిన్ లూథర్ 500 ఏళ్ళ క్రితం విట్టెన్‌బర్గ్‌లో తన సిద్ధాంతాలను ప్రచురించిన సందర్భాన్ని పురస్కరించుకొని ఈ చర్చిలో ప్రత్యేక వేడుకలు నిర్వహిస్తున్నారు. ఈ వేడుకలకు ప్రత్యేక ఆకర్షణ కోసం 'బ్లెస్‌యూ 2' అనే రోబోని తీసుకొచ్చారు. ఈ రోబో వచ్చినవారికి స్వాగతం పలకడంతోపాటు వారిని ఆశీర్వదిస్తోంది కూడా. అంతేకాదండోయ్ మీకు ఎలాంటి దీవెన కావాలి? ఏ స్వరంతో మిమ్మల్ని ఆశీర్వదించాలి? అనే ఆప్షన్లు కూడా ఆ రోబోకు ఉన్న స్క్రీన్‌పై ఉంటాయి. నచ్చినదాన్ని ఎంపిక చేసుకుంటే, దానికి తగ్గట్టు రోబో మిమ్మల్ని ఆశీర్వదిస్తుంది. దీంతో రోబోను చూడటం కోసం ప్రజలు భారీ సంఖ్యలో చర్చికి వస్తున్నారట.



## ఇంద్రధనుస్సు గ్రామం

ఆ గ్రామంలో ఎటుచూసినా, ఏ ఇల్లు చూసినా సప్తవర్ణాలతో కళ్ళు మిరుమిట్లు గొలుపుతాయి. ఇండోనేసియాలోని ఆ గ్రామం పేరు కంపంగ్ పెలంగి. మొన్నమొన్నటి వరకూ మామూలు మట్టిగోడలతో ఉండే ఆ గ్రామంలోని ఇళ్ళు ఇప్పుడు త్రీడీ బొమ్మలతో, ఏడురంగుల్లో మెరిసిపోతున్నాయి. అందుకే ఈ గ్రామానికి ఇంద్రధనుస్సు గ్రామం అని పేరు కూడా పెట్టేశారు.



తమ ఊరికో గుర్తింపు తీసుకురావాలని, పర్యాటక ప్రాంతంగా మార్చాలనే ఉద్దేశంతో వినూత్నంగా ఆలోచించి, తమ గ్రామాన్ని రంగుల్లో ముంచేత్తారు. ప్రభుత్వసాయంతో గ్రామంలోని 232 ఇళ్ళు, కార్యాలయ భవంతులు, బస్టాప్‌లు, వంతెనలు, వాటర్ ట్యాంకులు...అన్నింటికీ గ్రామ ప్రజలు రంగులు వేశారు. ఈ పని పూర్తి చేయడానికి నెలరోజులు పట్టిందట వారికి. ఇప్పుడీ గ్రామం ఫొటోలు సోషల్‌మీడియాలో హల్‌చల్ చేస్తున్నాయి.

—నర్మద వాసిరెడ్డి

## శృంగార సమస్యలను ఎందుకు దాయడం?

డాక్టర్ టి.ప్రభాకర్, MD హోమియో
MS సైకాలజీ & కౌన్సెలింగ్,
పీజీ డిప్లొమా ఇన్ సెక్సాలజీ
బెస్ట్ డాక్టర్ 2016, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000 , 77 3000 4000



**అంగస్తంభన :** శారీరకంగా దాంపత్య సుఖం అనుభవించుటకు తగినంత అంగం గట్టిపడకపోవడాన్ని అంగస్తంభన సమస్యగా గుర్తించవచ్చు. నంపుసకత్వము, మగతనం లేకపోవుట, ఇంపొటెన్సి అని కూడా అంటారు. దీనివల్ల సామాజికంగా, మానసికంగా కుంగిపోతారు. ఎవ్వరికిచెప్పుకోవాలో తెలియక, ఎక్కడికి వెళ్లాలో తెలియక లోలోపల బాధపడుతుంటారు.

### ఎందుకు ఇలా?

- మానసిక ఒత్తిడులు ● శారీరక శ్రమ అధికం
- అంగంకు రక్తసరఫరా తగ్గడం
- ఇతర మందులు వాడటం వల్ల సైడ్ఎఫెక్ట్స్ రావడం.
- ఎక్కువగా హస్తప్రయోగం చేయడం
- మధుమేహం, బ్లడ్‌ప్రెషర్
- ఫిట్స్, వెన్నెముక గాయాలు ● స్ట్రోక్
- యాంత్రిక జీవన విధానం
- నైట్‌షిఫ్ట్‌లు, ఓవర్‌టైమ్ డ్యూటీలు
- ఇంట్లో బయట ఆర్థిక ఇబ్బందులు
- పిల్లల చదువులు, పెళ్లిళ్లు. ● ఉద్యోగాలు, ఒత్తిళ్లు.
- వ్యాపార, ఆదాయ సమస్యలు ● హార్మోన్ సమస్యలు
- గుండె వ్యాధులు, కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉండటం
- రేడియేషన్ ఎఫెక్ట్ ● యాంగ్జయిటీ మందులు వాడటం
- పెప్టిక్ అల్సర్ ● సెక్స్‌పై సరియైన అవగాహన లేకపోవడం
- సెక్స్ వర్కర్ల దగ్గర చీత్కారింపులు
- ప్రొస్టేట్ వాపు

### క్లినికల్ హిస్టరీ

రోగి యొక్క సమగ్రవిచారణ
జననేంద్రియాల పరీక్ష
హార్మోన్ పరీక్షలు
కలర్ డాప్లర్ టెస్ట్
పెనైల్ కలర్ డాప్లర్ స్టడీ
రెజిస్కాన్

**చికిత్స :** వ్యాధి మూలాలకు చికిత్స. కారణం తెలుసుకుని దానిని ఎలా నివారించాలి. వయాగ్రాలాంటి మందుల ద్వారా చికిత్స కొంతవరకు ఉపశమనం ఉంటుంది. కాని సైడ్ఎఫెక్ట్స్ చాలా ఉంటాయి. పైగా అది శాశ్వత చికిత్స కాదు. రక్తనాళాలు కుచించుకుపోతే రక్తనాళాల సర్జరీ చేయాల్సి ఉంటుంది. ఇంప్లాంట్స్ కృత్రిమ అంగం వేస్తారు. కానీ వీటివల్ల ఇతర రిస్కులు ఉంటాయి.

### ప్రిమెచ్యూర్ ఎజాక్యులేషన్

అంగస్తంభన ఉంటుంది కానీ తొందరగా స్ఖలనం అవుతుంది. దీనినే శీఘ్రస్ఖలనం అంటారు. దీనివల్ల జీవితంలో తీరని అసంతృప్తి, దాంపత్య కలహాలు, సాన్నిహిత్యలేమి, కలతలు, మనస్పర్థలు, విడాకులు.

**కారణాలు :** మానసిక ఒత్తిడులు, సమస్యలు, తీరని వేదన, ఆర్థిక ఇబ్బందులు, సెక్స్‌కు పనికిరానేమోననే భావన, భాగస్వాముల దగ్గర చులకన, మానసిక ఆందోళన, దాంపత్య సమస్యలు

**రకాలు :** 1) అంగస్తంభన ఉంటుంది కానీ అంగ ప్రవేశం కంటే ముందే స్ఖలనం అవుతుంది.

2) స్తంభన, అంగ ప్రవేశం ఉంటుంది. శీఘ్రస్ఖలనం జరుగుతుంది.

## సోరియాసిస్, హైపోథైరాయిడిజం మూలాలకు చికిత్స

డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 1000, 77 3000 2000



**సోరియాసిస్** దీర్ఘకాలిక చర్మవ్యాధుల్లో ముఖ్యమైనది. ఈ వ్యాధి శారీరకంగానే కాకుండా మానసికంగా తీవ్రంగా బాధపెడుతుంది. చర్మంపై దీర్ఘకాలంగా ఎర్రటి, వాపుతో కూడిన పొడలుంటాయి. ఈ పొడల మీద చేప పొలుసుల వలే తెల్లటి వెండి రంగులో ఉండే పొలుసులు కనిపిస్తాయి. దీనితో పాటు తీవ్రమైన దురద ఉండి, గోకిన తరువాత తెల్లటి పొలుసులు బయటకు వచ్చి ఇబ్బందికి గురిచేస్తాయి.

**ప్లేక్ సోరియాసిస్ :** ఈ రకం సోరియాసిస్‌లో పొడలు ఎర్రగా ఉండి, తెల్లటి పొలుసులు ఎక్కువగా ఉంటాయి. ఇవి ఎక్కువగా మోచేయి, మోకాళ్లు, తల, ఛాతీ, వీపు, మెడ, నడుం భాగంలో ఉంటాయి.

**తలలో సోరియాసిస్ :** తలలో చుండ్రులా చిన్న గడ్డల మాదిరిగా ఉండి తలకు అతుక్కుని ఉంటాయి. షాంపూతో స్నానం చేసినా పూర్తిగా పోకుండా వెంట్రుకలకు అతుక్కుని ఉంటాయి. దీన్ని చాలా మంది చుండ్రులా భావిస్తారు.

**ఎరిత్రోడెర్మిక్ సోరియాసిస్:** ఇది తీవ్రమైన సోరియాసిస్. శరీరమంతా పొడలతో నిండిపోతుంది. పొడలు ఎర్రగా ఉంటాయి.

**పామోప్లాంటార్ సోరియాసిస్ :** అరిచేతుల్లో, అరికాళ్లల్లో మాత్రమే కనిపిస్తుంది. పగుళ్లు లోతుగా ఉండి మానడం కష్టమవుతుంది.

**సోరియాటిక్ ఆర్థ్రైటిస్ :** దీర్ఘకాలంగా సోరియాసిస్ ఉన్నప్పుడు కీళ్లనొప్పులు రావడం జరుగుతుంది. సోరియాసిస్ కొన్నిసార్లు గోళ్ల మీదకు విస్తరించి గోళ్లరంగుమారి, గుంతల మాదిరిగా తయారవుతాయి.

**హోమియో వైద్యం :** సోరియాసిస్ తెలియగానే హోమియో వైద్యం ప్రారంభిస్తే ఉత్తమమైన ఫలితాలు వస్తాయి. రోగి మానసిక ఒత్తిడి, ఆందోళన, ఆర్థిక సమస్యలు మొదలైన కారణాలను తెలుసుకుని, వారి శారీరక, మానసిక ధర్మాలను పరిశీలించి చికిత్స ఇవ్వడం జరుగుతుంది. వ్యాధికి, వ్యాధి వెనకాల ఉన్న మనిషికి మందు ఇవ్వడం ద్వారా మంచి ఫలితాలు సాధించవచ్చు. ఈ చికిత్సను హోలిస్టిక్ ట్రీట్‌మెంట్ అంటారు.

### హైపోథైరాయిడిజం

సీతాకోకచిలుక ఆకారంలో ఉండే థైరాయిడ్ గ్రంథి శరీరంలో మెడ ముందు భాగంలో ఉంటుంది. ఈ గ్రంథికి కుడి, ఎడమ భాగాలుంటాయి. ఈ రెండు భాగాలను 'ఇస్తమస్' అనే భాగం కలుపుతుంది.

**థైరాయిడ్ హార్మోన్లు :** మొదట మెదడులో ఉండే హైపోథాలమస్ అనే భాగం టీఆర్‌హెచ్ (థైరాయిడ్ రిలీజింగ్ హార్మోన్)ను ఉత్పత్తి చేస్తుంది. టీఆర్‌హెచ్ మెదడులోనే ఉండే పీయూష గ్రంథి ముందు భాగాన్ని ప్రేరేపించి టీఎస్‌హెచ్ (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్)ను విడుదల చేస్తుంది. ఈ టీఎస్‌హెచ్ థైరాయిడ్ గ్రంథిని ప్రేరేపించి టి3(ట్రై ఈయిడో థైరోనిన్),టి4 (థైరాక్సిన్)ను విడుదల చేస్తుంది. .

**హైపోథైరాయిడ్ లక్షణాలు :**

మానసిక, శారీరక ఎదుగుదల లేకపోవడం, అధిక బరువు ఉండడం, క్రమేపీ బరువు పెరగడం, జుట్టు రాలడం, అతి నీరసం, నిద్ర ఎక్కువగా రావడం, ఆడపిల్లల్లో నెలసరి ఆరంభం కాకపోవడం, మతిమరుపు, నెలసరి లేటుగా రావడం, నెలసరి వచ్చినా ఎక్కువ కావడం, చాలా రోజులు ఉండటం, థైరాయిడ్ వాపు, చర్మం, జుట్టు పొడిబారడం, కండరాల నొప్పులు, నెలసరి సమస్య వల్ల సంతానలేమి వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స**

హోమియో మందుల వల్ల ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా థైరాయిడ్ లక్షణాలు తగ్గిపోతాయి. హైపోథైరాయిడ్ వల్ల వచ్చే సంతానలేమి, అధిక కొలెస్ట్రాల్, మలబద్ధకం, డిప్రెషన్ కూడా దూరమవుతాయి.



9

# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**ల్యాండ్ ఫోన్ రింగ్ అయ్యింది.**

**"వినయ్ నీ కోసమే" అంది రిసీవర్ అందుకుని విన్న శాంతమ్మ. కాఫీ కప్పును టీపాయ్ మీద పెట్టి ల్యాండ్ ఫోనున్న టేబుల్ వైపు నడిచాడు వినయ్.**

**"వినయ్ హియర్" అన్నాడు రిసీవర్ అందుకుని.**

**"హాయ్ వినయ్! హౌ ఆర్ యూ టుడే" స్త్రీ కంఠం అమెరికా యాసతో అంది.**

"హూ ఈజ్ దట్, ప్లీజ్" వినయ్ అర్థం కానట్టు అన్నాడు. టెలిఫోన్‌లో కంఠస్వరం ఎవర్నో గుర్తుకు తెస్తోంది. కానీ ఈ ల్యాండ్‌లైన్ నెంబర్ని ఏ స్త్రీకి ఇవ్వలేదు తను.

"ఇండియాలో అడుగు పెట్టగానే నన్నూ, నా కంఠాన్నీ మరిచిపోయినట్టున్నారే?" టెలిఫోన్‌లో కంఠం కిలకిలా నవ్వింది.

ఆ నవ్వు ఆమె ఎవరో పట్టిచ్చేసింది. "హలో! చందనా! ఎక్కణ్ణించీ? యుఎస్ నుంచేనా? ఈ నెంబరెవరిచ్చారు?"

"నువ్వివ్వలేదు. నేను తెలుసుకున్నాను!" చందన నవ్వుతూ అంది. "నేనిప్పుడు ఎక్కడున్నానో తెలుసా?"

"ఎక్కడ...? సిలికాన్ వ్యాలీలో... కరెక్ట్"

చందన కిలకిల నవ్వింది. "నో! మన దేశంలో. మీ సిటీలో!"

'రియల్లీ? సర్‌ప్రైజింగ్!"

"ఎస్! హోటల్ 'హైదరాబాద్ ఇన్'. రూం నెంబర్ త్రీ నాట్ త్రీలో"

"ఇంతకీ ఎప్పుడొచ్చావ్? ఎందుకొచ్చావ్?" వినయ్ అడిగాడు.

"రాత్రి బాగా పొద్దుపోయాక ఫ్లయిట్ దిగాను. నిన్ను డిస్ట్రబ్ చేయడం ఇష్టం లేక ఫోన్ చేయలేదు. ఎందుకొచ్చానో మనం కలుసుకున్నప్పుడు చెప్తాను. ఎక్కడ కలుసుకుందాం? మీ ఇంట్లోనా? నా హోటల్ గదిలోనా?" చందన కంఠంలో ఉత్సాహం ధ్వనించింది.

"ఒక్కటి చెప్పు చందనా. ఇది అఫీషియల్ ట్రిప్పా? పర్సనల్ ట్రిప్పా? ఎందుకంటే నేను బిజీగా ఉన్నాను. ఆఫీసు పనిమీద కాన్‌సన్‌ట్రేట్ చేయలేను."

"ప్యూర్లీ పర్సనల్ వినయ్. లెటజ్ మీట్. ఎప్పుడో, ఎక్కడో నువ్వే చెప్పు."

చందన తను పనిచేసే ఆఫీసులోనే పనిచేస్తోంది. తనకి సీనియర్. త్వరలో బాస్ అయ్యే అవకాశాలు న్నాయి. కలుసుకోలేనని చెప్పడం మర్యాద కాదు. తన ఇంటికి రమ్మనడమూ మర్యాద కాదు.

"నేనే హోటల్‌కి వస్తాను..." వినయ్ అన్నాడు.

"వెరీగుడ్.. ఎన్నింటికి?"

"ఇప్పుడే రానా?" వినయ్ అడిగాడు.

"నో...నో...నో...ఇటీజ్ టూ ఎర్లీ! ఇప్పుడే నిద్ర లేచాను. ఇంకా స్నానం కూడా చేయలేదు. రెడీ అయి, ఒక ఫ్రెండింటికి వెళ్ళాలి. నా కాలేజ్ మేట్. లంచ్ అక్కడే. సాయంత్రం రాగలవా? ఇట్ విల్ బీ కంఫర్టబుల్.."

"ఎన్నింటికి?"

"ఆరున్నర. ఏడు... రూంకి తిరిగి రాగానే ఫోన్ చేస్తా, ఒకే!"

"ఒకే..." వినయ్ అన్నాడు.

***

హోటల్ హైదరాబాద్ ఇన్.

## జరిగిన కథ

అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. శోభనం రాత్రే ఆమె స్పృహతప్పి పడిపోతుంది. ఆ తరువాత రెండోసారి ఏర్పాటుచేసిన మొదటిరాత్రి, అమెరికా వెళ్ళిన తరువాత కూడా ఇద్దరూ దూరంగానే ఉంటారు. దాంతో సంధ్యని సెక్సాలజిస్ట్ డాక్టర్ జాన్‌డేవిడ్ దగ్గరకి తీసుకెళతాడు. సంధ్యకు ఫ్రిజిడిటీ అని తేలుస్తారు. ఫ్రెండు పెళ్ళి ఉందంటూ ఇండియాకు వస్తుంది సంధ్య. సడన్‌గా వినయ్‌ని ఇండియాకు వచ్చేయమంటూ ఫోన్ చేస్తుంది అతడి చెల్లెలు సుధ. ఇండియా వచ్చిన వినయ్‌కి అతడి తల్లిదండ్రులు సంధ్య వేసిన అభాండం గురించి చెబుతారు. ఎలాగైనా ఆమెని ఒక్కసారి కలుసుకోవాలనుకుంటాడు వినయ్.

ఆ తర్వాత...

త్రీ నాట్ త్రీ గది ముందు నిలబడి, వినయ్ రిస్ట్‌వాచీ చూసుకున్నాడు. ఏడూ ముప్పై. ట్రాఫిక్ జామ్ తన రాకని అరగంట ఆలస్యం చేసింది. వినయ్ చూపుడు వేలు కాలింగ్ బెల్ స్విచ్‌ని నొక్కింది. లోపల బజర్ మోగింది. ఆ శబ్దం కోసమే ఎదురు చూస్తున్నట్టు తలుపు లోపలికి జరిగింది.

చందన ఫ్రేములో పెయింటింగులా, ద్వార బంధం మధ్య నిలుచుని ఉంది. నవ్వుతో ఆమె ముఖం వికసించింది. పళ్ళు తెల్లగా మెరిశాయి. "హాయ్ వినయ్! కమిన్!"

"హాయ్!" వినయ్ చిరునవ్వుతో అన్నాడు. ఇంత వరకూ తను ఎప్పుడూ చూడని డ్రస్‌లో ఉంది చందన. మినీ స్కర్ట్, స్లీవ్‌లెస్ బ్లౌజ్. భుజాల మీదుగా విచ్చలవిడిగా వేళ్ళాడుతున్న జుత్తు. ఆమె శరీరం నుండి ఖరీదైన సెంటు గుబాళిస్తూ గాలిలో తేలుతోంది.

"కమిన్ వినయ్!" చందన నవ్వుతూ హెచ్చరించింది.

వినయ్ గదిలోకి వెళ్ళాడు. చందన తలుపు మూసి గొళ్ళెం బిగించింది. వెనుదిరిగి గది మధ్య ఉన్న సోఫాల వైపు నడిచింది. ఆమె నడకలో తాను ఇంతవరకూ చూడని కదలిక కనిపించింది వినయ్‌కి. బహుశా డ్రస్ వల్ల కావచ్చు.

"సిడౌన్!" సోఫాల ముందు నిలబడి అంది చందన.

వినయ్ కూచున్నాడు.

"ఇందాక గుమ్మంలో నుంచుని నువ్వు నన్ను ఆశ్చర్యంగా చూస్తుంటే గమనించాను. ఎలా ఉన్నాను ఈ డ్రస్‌లో?" చేతుల్ని కిందికి స్టయిల్‌గా చాపుతూ అంది చందన.

"డిఫరెంట్‌గా ఉన్నావు. ఇంతవరకూ ఈ డ్రస్‌లో నిన్ను చూడలేదు."

"ఇది ఆఫీస్ గెటప్ కాదు! ఇంట్లో ఉన్నప్పుడు, షాపింగ్‌కి వెళ్ళినప్పుడు ఐ వేర్ స్కర్ట్ అండ్ బ్లౌజ్." చందన నవ్వుతూ అంది.

"ఆఫీసుకు వేసుకొచ్చే డ్రస్ కూడా నీకు బాగుంటుంది" వినయ్ నవ్వుతూ అన్నాడు.

"థాంక్స్!" చందన అతని ఎదురుగా సోఫాలో కూచుంటూ అంది. కూచుని, స్కర్ట్‌ని వేళ్ళ కొసల్తో మోకాళ్ళ మీదికి లాక్కుంది.

"వినయ్, తిరుపతిలో నీకు తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారా?" చందన ప్రశ్నించింది.

"ఏం?"

"శాన్‌ఫ్రాన్సిస్కోలో నా ఫ్రెండుంది. డాక్టర్ జలజ! బాలాజీ లడ్డూలు కావాలంది. తెప్పించగలవా? ఎవరైనా ఉన్నారా?" చందన సోఫాలో వెనక్కి వాలుతూ అంది.

వినయ్ మాటలు మరిచిపోయి చూస్తూ ఉండిపోయాడు. డాక్టర్ జలజ... చందన ఫ్రెండా?!

"ఏమిటి వినయ్... నా ప్రశ్న వినిపించలేదా?" చందన నోరారా నవ్వుతూ అంది. "తిరుపతి లడ్డూలు వినయ్! తెప్పించే వీలుందా?"

వినయ్ ఉలికిపడి సర్దుకున్నాడు. "సారీ చందనా... అలాంటి కనెక్షన్స్ లేవు మనకు. అయినా ట్రై చేద్దాం. ఎప్పటికి కావాలి?"

"ఇంకా వారం రోజులు టైముందిలే!" చందన తేలిగ్గా అంది.

"ఓకే...సర్‌ప్రైజ్ విజిట్? నేను లీవు పెట్టినప్పుడు మాటమాత్రం కూడా చెప్పలేదే? ఉన్నపళాన ఊడిపడ్డావ్?" వినయ్ అన్నాడు.

"ఈ విజిట్ నాక్కూడా సర్‌ప్రైజే! నిజం చెప్పాలంటే, పెళ్ళి సంబంధం చూడ్డానికొచ్చాను."

"ఎవరికి?" వినయ్ అడిగాడు.

"డోంట్ బీ సిల్లీ వినయ్! ఎవరికో సంబంధం చూసే ఖర్మ నాకేంటి? నాకే!"

"ఓహ్! వెరీనైస్! స్వీట్ న్యూస్! ఎవరా అదృష్టవంతుడు!"

"ఈ ఊరే..." చందన అంది. "తెలిసిన అబ్బాయే.."

"ఇక్కడే ఉంటాడా? ఎందుకడుగుతున్నానంటే పెళ్ళైతే నువ్విక్కడికి ఇంపోర్టవుతావా? అతనక్కడికి ఎక్స్‌పోర్టవుతాడా?" వినయ్ చిన్నగా నవ్వాడు.

"అనుకున్నట్టు జరిగితే మా కాపురం సిలికాన్ వ్యాలీలోనే!"

"సో... నేన్నిన్ను మిస్సవను" వినయ్ అన్నాడు.

"యా! యూ వోంట్ మిస్ మీ... అది సరే



గానీ నీ సంగతి చెప్పు. హౌ ఈజ్ యువర్ బెటర్ హాఫ్?"

"నెవర్ బెటర్!"

"తల్లి కాబోతోందా?"

"నో నో... అదేంలేదు."

"ఊ... పుట్టింటికి వెళ్ళిందంటే అందుకే అనుకున్నా. ఏం? ఇప్పుడప్పుడే పిల్లలు వద్దనుకున్నారా?" చందన నవ్వుతూ అంది.

'అలా అనుకుందాం. ఆవిడకి ఇప్పుడే తల్లి కావాలని లేదు."

"ఇవాళ నన్ను నువ్వు మీ ఇంటికి ఇన్వైట్ చేస్తావనుకున్నాను. మీ ఆవిణ్ణి చూడాలనుకున్నాను. ఐ హర్డ్ షీ ఈజే బ్యూటీ!"

"షీ ఈజ్ గుడ్ లుకింగ్" వినయ్ సాదాగా అన్నాడు.

"సంధ్యను నాకు యుఎస్‌లో ఎలాగూ పరిచయం చేయలేదు. ఇక్కడైనా పరిచయం చేయి. అలాగే మీ ఇంట్లో భోజనం ఏర్పాటుచెయ్. తెలుగింటి భోజనం తిని చాలా రోజులైంది. ఓకే!" చందన ఆపకుండా అంది.

"భోజనందేముంది? చేద్దాం" సంధ్య పరిచయం గురించి ఏమీ అనకుండా తెలివిగా అన్నాడు వినయ్.

"మధ్యాహ్నం మా ఫ్రెండింట్లో భోజనం అని నీకు చెప్పాను గానీ, అది మెటీరియలైజ్ అవలేదు. నేను వెళ్ళేసరికి దానికి ఒంట్లో బాగోలేదు. హాస్పిటల్ దాకా వెళ్ళి, తిన్నగా హోటల్‌కి వచ్చేశాను. రియల్టేమిటంటే లంచ్ తినలేదు. ఆకలి దంచేస్తోంది.

నువ్వెలాగా వస్తానన్నావుగా? నీతో కలిసి తినొచ్చని, కోక్‌తో కడుపు నింపుకుని ఉండిపోయాను. నువ్వు లైక్ చేసేవేంటో చెప్పు. ఆర్డర్ చేస్తాను."

"వై టేకింగ్ ట్రబుల్ చందనా? ఇంటికెళ్ళి భోం చేస్తాను. నువ్వు తెప్పించుకో" వినయ్ అన్నాడు.

"ఎస్కేప్ అవ్వాలని చూడొద్దు" చందన నవ్వుతూ అంది. "నీకు రెండు ఆప్షన్స్ ఇస్తున్నాను. నువ్వు ఇక్కడ నేనిచ్చే ఆతిథ్యం స్వీకరిస్తావో... లేదంటే ఇప్పుడే, ఈ క్షణమే మీ ఇంటికి తీసికెళ్ళి నాకు ఆతిథ్యమిస్తావో! ఏది నీకిష్టం? నువ్వు సరే అంటే ఉన్న పళాన మీ ఇంటికి వచ్చేస్తాను. అన్నం తిని, నీ అర్ధాంగిని చూసి, వచ్చేస్తాను."

"సంధ్య మా ఇంట్లో లేదు. తల్లిగారింట్లో ఉంది..." వినయ్ విధిలేక, ఇబ్బందిగా అన్నాడు.

"అది మరీ మంచిది. మనిద్దరం భోజనానికి వస్తున్నట్టు ఫోన్ చేసి చెప్పు. అల్లుడుగారికి విందిస్తారు. అందులో నాక్కూడా వాటా! ఏం?" చందన ఉత్సాహంగా అంది.

వినయ్ ఇరకాటంలో పడిపోయి, కాసేపు ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. "ఉన్నపళాన ఊడిపడ్డట్టు వెళ్తే బాగోదులే చందనా, మా ఇంటికి నిన్ను స్పెషల్‌గా ఇన్వయిట్ చేస్తాను. ఇవ్వాళ్టికి ఇక్కడే నీ గెస్టుగా ఉంటానులే!"

"ఓకే! దట్స్ గుడ్! ఏం తింటావ్? నార్తిండియన్?" చందన అడిగింది.

"నో ప్రాబ్లం..."

"ఓకే...బటర్ నాన్?"

**హోటల్ హైదరాబాద్ ఇన్. వినయ్ రూమ్ నెంబర్ 303 ముందు నిలబడి కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు. లోపల బజర్ మోగిన శబ్దం వినిపించింది. ఆ శబ్దం కోసమే ఎదురుచూస్తున్నట్టుగా తలుపు లోపలికి తెరుచుకుంది. ద్వార బంధంలో వయ్యారాలు ఒలకబోస్తూ, చిరునవ్వుతో అతన్నే చూస్తూ నిలబడి ఉందామె. వినయ్‌ని లోపలికి ఆహ్వానించింది. ఇంతకీ ఎవరామె? వినయ్‌కి, ఆమెకి ఏమిటి సంబంధం?**

"ఏదైనా పర్వాలేదు.."

"బటర్ నాన్ విత్ మిక్స్‌డ్ వెజిటబుల్ కర్రీ చెప్పనా?"

"గో హెడ్!"

"ఫ్రైడ్‌రైస్ విత్ ఆనియన్ రైతా ఈ హోటల్ స్పెషాలిటీ అని విన్నాను."

"ఔను. బాగుంటుంది" వినయ్ అన్నాడు.

చందన స్టాండ్ మీద ఉన్న ఫోన్ అందుకుని కావాల్సిన ఆహారం ఆర్డర్ చేసింది. పావుగంట పాటు చందన వినయ్ కుటుంబ విషయాల గురించి రకరకాలుగా ప్రశ్నిస్తూ, సమాధానాలు వింటూ ఉండిపోయింది. ఆమె ప్రశ్నలు చాలా మట్టుకు సంధ్య చుట్టూ తిరుగుతూ, వినయ్‌కి విసుగూ, ఇబ్బందీ కలిగించాయి. మరో అరగంటలో హోటల్ సప్లయ్ చేసినదాన్ని తిన్నారిద్దరూ.

"థాంక్స్ ఫర్ ద నైస్ డిన్నర్ చందనా" వినయ్ అన్నాడు.

"నీ ఆతిథ్యంతో ఆ ఋణం తీర్చుకో!"

"అలాగే.." వినయ్ పొడిగా అన్నాడు. "టేక్ రెస్ట్. నేను బయల్దేరుతాను."

"సిడౌన్ వినయ్. కాసేపు కబుర్లు చెప్పుకుందాం"

"మళ్ళీ కలుసుకుంటాంగా? తీరిగ్గా మాట్లాడుకుందాం" వినయ్ అన్నాడు.

"ఏంటీ... వైఫ్ వెయిట్ చేస్తుంటుందా? పర్లేదులే! స్పెండ్ సమ్ టైమ్ విత్ యువర్ సీనియర్! నీ గురించి అవీ ఇవీ అడిగి తెలుసుకున్నాను. నా పెళ్ళి సంబంధం గురించి ఏమీ తెలుసుకోవా నువ్వు? ఇంట్రెస్ట్ లేదా?"

"లేకేం. తప్పకుండా తెలుసుకుంటాను. అతనిది ఈ ఊరే అన్నావుగా?" వినయ్ నవ్వే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"ఒక్కక్షణం...ఇప్పుడే వస్తా" అంటూ చందన బెడ్‌రూంలోకి వెళ్ళింది.

వినయ్ రిస్ట్‌వాచీ చూసుకున్నాడు. తను వచ్చి రెండు గంటలు దాటింది. బెడ్‌రూం తలుపుదగ్గర చప్పుడైంది. వినయ్ తలెత్తి చూశాడు. చందన వస్తోంది. ఆమె ఇప్పుడు ఇందాకటి దుస్తుల్లో లేదు. లేతగులాబీ రంగు నైటీలో ఉంది. రెండు చేతుల్నీ

## సంఘమిత్రగా దేవసేన?

'సంఘమిత్ర' సినిమా నుంచి శ్రుతి తప్పుకున్నప్పటి నుంచీ ఆ పాత్రకు సరైన హీరోయిన్ ఎవరు? అన్నది దర్శకనిర్మాతల్లోనే కాదు, సినీ అభిమానుల్లోనూ నెలకొంది. శ్రుతి స్థానంలో చాలా మంది పేర్లు వినిపించినా, టాలీవుడ్ జేజమ్మ అనుష్క శెట్టికే చాలామంది ఓటు పడింది. సినీ అభిమానులు కూడా సంఘమిత్ర పాత్రకు అనుష్క తప్ప మరో ఆప్షన్ లేదంటున్నారు. కాకపోతే మొన్నటి వరకూ 'బాహుబలి' కోసం భారీస్థాయిలో డేట్లు ఇచ్చిన అనుష్క ఈ సినిమాకి మరో రెండు సంవత్సరాలు కేటాయిస్తుందా? అన్న వారూ లేకపోలేదు. కాకపోతే ప్రస్తుతానికి అనుష్క చేతిలో 'భాగమతి' తప్ప మరో సినిమా లేదు కనుక అనుష్క ఒప్పుకున్నా ఒప్పుకోవచ్చు అంటున్నారు.

# ఓ ఇంటిదైన అనుపమ

ఇంటిదివడం అంటే పెళ్ళి చేసుకోవడం కాదు. ఓ ఇంటిని సొంతం చేసుకుంది 'ప్రేమమ్' బ్యూటీ అనుపమా పరమేశ్వరన్. తెలుగులో తనకు ఇంత పేరు రావడానికి ప్రేమమ్ సినిమానే కారణం కనుక తన ఇంటికి 'ప్రేమమ్' అని నామకరణం చేసింది. ఈ సినిమా తరువాత అనుపమ పలు విజయాలు సొంతం చేసుకున్నా టాలీవుడ్‌లో మాత్రం ఆమె 'ప్రేమమ్' హీరోయిన్‌గానే గుర్తుండిపోయింది. అందుకే ఆ పేరునే తన ఇంటికి పెట్టుకుందంటున్నారు ఆమె అభిమానులు.



వెనక్కి పోనిచ్చి, జుత్తును సర్దుకుంటూ, మెల్లగా నడుస్తోంది. గాలిలో తేలుతున్నట్టు దగ్గరగా వచ్చి, వినయ్ వైపు చిరునవ్వు నవ్వింది.

"ఎందుకో ఆ స్కర్టూ బ్లౌజూ అన్‌కంఫర్టబుల్‌గా అనిపించాయి. అందుకే నైటీ వేసుకున్నా..."

"ఓకే" వినయ్ పొడిగా అన్నాడు.

చందన వయ్యారంగా నడుస్తూ గోడ దగ్గరగా వెళ్ళి స్విచ్ నొక్కింది. ఏసీ గదిలో ఫ్యాన్ ఫుల్ స్పీడులో తిరగసాగింది. ఫ్యాన్ రువ్వుతున్న గాలి అలలు చందన నైట్ గౌన్‌ని ఆమె వొంపులకు అతికిస్తున్నాయి. చందన వినయ్ ముందు బొమ్మలా నిలబడింది. చిరునవ్వుతో అతన్ని చూసింది.

"వినయ్.. సెక్సాలజిస్ట్ డాక్టర్ జలజ... మన తెలుగావిడ. ఆమె నీకు తెలుసా?" చందన అడిగింది.

"అబ్బే..." వినయ్ పొడిగా అన్నాడు.

"నీకు తెలుసనుకున్నాను.."

"అలాగా..."

"నీకు తెలుసని ఎందుకనుకున్నానో తెలుసా?" చందన అడిగింది.

వినయ్ మౌనంగా, ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆమె క్లినిక్‌లో సంధ్య అనే యువతికి సంబంధించిన కేస్ ఫైల్ చూశాను. ఆ సంధ్య నీ భార్యే అనుకున్నాను. ఎందుకంటే వైఫాఫ్ అన్నచోట నీ పేరుంది.."

వినయ్ ఆశ్చర్యంగా చూశాడు. పేషంట్ల వివరాల్ని అంత అజాగ్రత్తగా ఉంచుతుందా డా. జలజ? చందనకు ఏం చెప్పాలి తను.

"అదలా ఉంచు. నేను పెళ్ళాడాలనుకుంటున్న హైదరాబాదీ ఎవరో తెలుసా?" చందన అడిగింది.

వినయ్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు. డాక్టర్ జలజ తెలుసా అని రెట్టించలేదు చందన. ఆమె ఆఫీసులో కూడా అంతే. ఒక సబ్జెక్టు నుంచి మరో దానికి జంప్ చేస్తూ ఉంటుంది. "తెలీదు చందనా."

"నువ్వతనికి తెలుసు. నీక్కూడా అతను తెలుసు" చందన ఉత్సాహంగా అంది.

"ఐ లైక్ హిమ్. ఐ వాంట్ టు మ్యారీ హిమ్!"

"వెరీనైస్. లక్కీ ఫెలో. ఎవరతను? ఎవరో చెబితే నాకు తెలుసో, తెలీదో చెప్పేస్తాను."

చందన కొంచెం ముందుకు జరిగి, వినయ్ దగ్గరగా నిలబడి, తల వాల్చి, అతని ముఖంలోకి చిరునవ్వుతో చూసింది. "అద్దంలో చూసుకో. అతను నీకు కనిపిస్తాడు."

వినయ్ అదిరిపడ్డాడు. "చందనా... ఏమిటి నువ్వనేది?"

"అర్థం కాలేదా? నువ్వే నా పెళ్ళికొడుకు!"

'పిచ్చీ లేదు; ఫ్రిజిడిటీ కూడా లేదు!" చందన నవ్వుతూ అంది. "నాకన్నీ తెలుసు. జలజ క్లినిక్‌లో ఆమెకు తెలీకుండా నీ పెళ్ళాం చరిత్రను పూర్తిగా చదివాను. అప్పటికి నువ్వు ఇక్కడికి వచ్చేశావు. నీకు తెలుసో, తెలీదో ముందునుంచీ నిన్ను నేను లైక్ చేశాను. రివీల్ చేయలేకపోయాను. మీ ఇద్దరి మధ్యా జడత్వం అనే మంచుకొండ ఉందని తెలుసుకున్నాను. పేషంటుకి ఇంకా నయమైనట్లు లేదు. అందుకే భర్త రిపోర్టు చేయలేదు అని జలజ రిమార్క్ రాసుకుని ఉంది. నాకు అవకాశం ఉందేమో కనుక్కోవాలన్న ఆత్రుతతో ఇక్కడ వాలాను."

"చందనా..."

"పూర్తిగా విను. నీకు కాబోయే బాస్‌గా నన్ను మీ అత్తమామలకి పరిచయం చేసుకున్నాను. మీ దంపతుల బంధం గురించి అడిగాను. నువ్వు ఆడా మగా కాని మూడోరకం అనీ, విడాకుల కోసం ప్రయత్నిస్తున్నామనీ చెప్పారు. నీ భార్య తన లోపం కప్పిపుచ్చుకుని నిన్ను అలా చిత్రించిందని ఊహించాను. ఒక్క కాగితం ముక్కతో దానితో తెగతెంపులు చేసుకో. పురుషుణ్ణి పురుషత్వం లేనట్లు చిత్రించిన సంధ్య నీకు తగదు. నన్ను పెళ్ళిచేసుకో"

"అసంభవం" వినయ్ బిగ్గరగా అన్నాడు.

"మరొక ఆడది నిన్ను కట్టుకోవడం అసంభవమే! నీ మీద మగాడు కాదన్న ముద్ర పడుతుందిగా!" చందన చిరునవ్వుతో అంది.

"ఏ ముద్ర పడినా సరే... నేను సంధ్యను మరిచిపోను."

"డోంటాక్ లైకే టీనేజ్ లవర్" చందన చిన్నగా నవ్వింది. "మగాడికి శాశ్వతంగా దూరంగా ఉండాలనుకునే ఫ్రిజిడ్ ఆడదాన్ని గుర్తుంచుకున్నా ఒరిగేదేమీ లేదు; మరిచిపోయినా తరిగేదేమీ లేదు."

"నీ అభిప్రాయం నీది; నా అభిప్రాయం నాది."

"ఇలా నావైపు చూడు వినయ్. సంధ్య ఒక్కతే అందగత్తె కాదు. జడత్వంతో రాయిలా ఉండే ఆడది అందంగా ఉన్నా ఒక్కటే; వికారంగా ఉన్నా ఒక్కటే! నన్ను చూడు. నాలో అందం లేదా? ఆకర్షణ లేదా? నీ దృష్టిలో ఆ సంధ్యతో పోలిస్తే నాలో అంత అందం లేకపోవచ్చు, అంత ఆకర్షణ లేకపోవచ్చు. కానీ నాలో ఆ జడత్వం లేదు. కావాలంటే దాన్ని ఇప్పుడే, ఇక్కడే రుజువు చేయగలను! రుజువు చేయమంటావా?"

వినయ్ ఆమె వైపు తేరిపార జూశాడు. పల్చటి నైటీలో చందన శరీరం నివురు చాటున నిప్పులా ఉంది. వినయ్ లేచి నిలుచున్నాడు. "గుడ్ బై చందనా!"

"వినయ్... ఆగు! నన్నర్థం చేసుకో. సంధ్య నిన్ను వదిలించుకుంటుంది. ఒంటరివాడివై పోతావు. నా మాట విను. నన్ను పెళ్ళి చేసుకో. ఆ 'తంతు' వద్దనుకుంటే అమెరికాలో నాతో సహజీవనం చేయి! నీతో సంసారం చేస్తాను! నీ పిల్లలికి తల్లిని అవుతాను. నీ జీవితానికో అర్థం కల్పిస్తాను! నన్ను కాదనకు. వడ్డించిన విస్తరి ముందునుంచి వెళ్ళిపోకు!"

"థాంక్స్ చందనా... నువ్వన్నట్టు సంధ్యలో స్త్రీత్వం లోపించింది. నీలో కూడా చాలా లోపించాయి. నీలో సభ్యత లోపించింది. సంస్కారం లోపించింది. సిగ్గు లోపించింది. బిడియం లోపించింది..."

"వినయ్!" చందన పిడికిళ్ళు బిగిస్తూ అరిచింది.

"నేను నిన్నెందుకు చేసుకోనో చెప్తాను. ఎవర్నీ ఎందుకు చేసుకోనో చెప్తాను. నేను సంధ్యను ప్రేమించాను; ప్రేమిస్తూనే ఉంటాను. నాది తొలి

చూపులో ప్రణయం. మాటవరసకి సంధ్య మరణి స్తుందనుకో. ఆమెను ప్రేమిస్తూనే ఉంటాను... జీవి తాంతం! ఆమె జడత్వం కలిగిన స్త్రీగా సజీవంగా ఉండడం మరణం కన్నా మిన్న. అంచేత ఆమెను ప్రేమిస్తూనే ఉంటాను. సంధ్య నా హృదయాన్ని పూర్తిగా ఆక్రమించుకుంది. అక్కడ మరొకరికి జాగా లేదు. నాది సంధ్య పట్ల ప్రేమ. నీది నా పట్ల కామం. ప్రేమ దైవత్వం. ప్రేమలేని కామం రాక్ష సత్వం. నా ప్రేమ దైవత్వం. దానికి చావు లేదు; రాదు.."

చందన ఎర్రబారిన కళ్ళతో రౌద్రంగా చూసింది. "సంధ్య నీ మీద వేసినది నింద కాదు; నిజం! నువ్వు...నువ్వు.."

"అర్థమైంది చందనా! థాంక్స్ ఫర్ ది కాంప్లి మెంట్! నా మగతనాన్ని ఇప్పుడు ఇక్కడ రుజువు చేసుకోవాల్సిన అవసరం లేదు."

"గెటౌట్..." చందన గర్జించింది. "ఐ విల్ సీ

స్పృహ కోల్పోయినట్టూ, వాంతులు చేసుకున్నట్టూ, ఇంటికి దూరమైనట్టూ నటించిన సంధ్య డాక్టర్లు అందించిన జడత్వ అంశాన్ని కూడా ఆయుధంగా స్వీకరించి నటించిందా? నటించకపోతే, తనను నపుంసక భర్త అని ఎందుకంటుంది? ఆ సాకుతో తనను వదిలించుకోవాలని ఎందుకు చూస్తోంది? ఇన్నిచేసినా, తనను దాంపత్య పరంగా దూరంగా ఉంచిన సంధ్యను తాను ఎందుకు ప్రేమిస్తు న్నాడు? తనను మగాడు కాదన్న సంధ్యను ఇంకా ఎందుకు ప్రేమిస్తున్నాడు? కోరికలు తీర్చకపోయినా, అడిగిన వరాలు వర్షించకపోయినా భక్తుడు భగ వంతుణ్ణి ఆరాధిస్తాడు, భక్తితో. భక్తి అనబడే ప్రేమతో. ఇదీ అంతేనా? మనసు సంగతి ఇంతేనా? మనసు గతి ఇంతేనా?

రకరకాల ప్రశ్నలు వినయ్ బుర్రలో తెలుకొం డెల్లా లేస్తూ, సలుపు పుట్టిస్తున్నాయి. తను సంధ్యను ప్రేమిస్తున్నాడు. దాన్ని లవ్ ఎట్ ఫస్ట్




యువర్ ఎండ్! నీ అంతు చూస్తాను; ఇక్కడ కాదు అక్కడ!"

"గుడ్‌లక్!" వినయ్ నవ్వుతూ అని, గుమ్మం వైపు నడిచాడు.

***

రెండు మూడేళ్ళుగా తను పనిచేసే ఆఫీసులో చందన ప్రవర్తనా, తెగింపూ వినయ్‌ని ఆశ్చర్యంలో పడేశాయి. నైటీలో దాదాపు నగ్నంగా కనిపించిన చందన తనను తాను 'వడ్డించిన విస్తరి'గా వర్ణించు కుంది. బాత్‌రూమ్‌లో పూర్తి నగ్నంగా తనకు దర్శనం ఇచ్చిన సంధ్య తనతో ఏమీలేని విస్తరిలా ప్రవర్తిం చింది.

ఫ్రిజిడిటీ! డాక్టర్ జాన్‌డేవిడ్, డాక్టర్ జలజ చేసిన జడత్వ నిర్ణయం మీద ఎందుకో సందేహం కలుగుతోంది తనకు. ఆరోజు సంధ్య డాక్టర్లు ఏమ న్నారని తనని అడిగింది. తాను దాచకుండా అన్నీ చెప్పాడు. స్పృహ విషయంలో, వాంతుల విషయంలో ఆమె నటించిందన్న అంశాన్ని దాచిపెట్టాడు. ఆ నిర్ణ యాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడలేదు సంధ్య. ఆ క్షణంలో ఆమె కళ్ళల్లో తనకు రిలీఫ్ కనిపించిందా?

సైట్ అన్నాడు తను. అందులో అనుమానం లేదు. అయితే, అయితే సంధ్య తనకు శాశ్వతంగా దూరం కావాలని ఎందుకు ప్రయత్నిస్తోంది? ఎందుకు?

వినయ్ ప్రశ్నకు సమాధానంలా తలుపు మీద వేళ్ళు చేస్తున్న శబ్దం వినిపించింది. వినయ్ వెళ్ళి గొళ్ళెం తీసి, తలుపు తెరిచాడు. సుధ అతనివైపు చిరునవ్వు నవ్వింది. లోపలకి వచ్చి, తలుపు మూసింది. అలసటగా కుర్చీలో కూలబడింది. ఉసూరుమంది చప్పుడు చేస్తూ.

"ఎక్కడికెళ్ళావ్?" వినయ్ ప్రశ్నించాడు.

"అబ్బ...అలసిపోయాను" సుధ కుర్చీలో విశ్రాం తిగా వాలింది.

"తెలుస్తూనే ఉంది. నిన్నట్నుంచీ కంటపడ కుండా ఉన్నావ్? ఇప్పటిదాకా ఎక్కడున్నావు?"

"నా ఫ్రెండ్ సులోచన తెలుసా? డిగ్రీలో..."

"తెలుసు. పెళ్ళి చేసుకుందా? ఆ పెళ్ళికెళ్ళావా?"

"అది సిటీలో 'లోచన డిటెక్టివ్ ఏజెన్సీ' అనే డిటె క్టివ్ బిజినెస్ పెట్టింది. ఇద్దరు ఆడ, ముగ్గురు మగ ఆపరేటర్లని నియమించుకుంది. తప్పిపోయిన పెళ్ళాలు, దారి తప్పిన భర్తలు, దాగుడు మూత

లాడే పెళ్ళాలు, దాగుడుమూతలాడే మొగుళ్ళు, లవర్స్‌తో పారిపోయే అమ్మాయిలు, అబ్బాయిలు ఇలాంటి కేసుల్ని తీసుకుని పరిశోధనలు చేస్తుంది ఆ ఏజెన్సీ. సులోచనను కలుసుకుని సంధ్య కేసు అప్పగించాను.

"ఎందుకే అంత పని చేశావు?"

"సంధ్య ఏయే సమయాల్లో ఎక్కడికెళ్తోంది? ఆమె దినచర్య ఏమిటి? ఆ రోజు ఆమె ఎస్కార్టుగా నాకు హోటల్లో కనిపించిన వ్యక్తి ఎవరు? వగైరా విషయాల్లో పరిశోధన సాగించమన్నాను. 'లైట్నింగ్ ఆపరేషన్!' ఫీజు చెల్లించాను.."

"సుధా.. ఇది సంధ్యను బజార్నపెట్టడం కాదా?" వినయ్ విసుగ్గా అన్నాడు.

"అదంతా నాకు తెలీదు. టాప్ సీక్రెట్‌గా ట్రీట్ చెయ్యమన్నాను. సరేనా?" సుధ నిర్లక్ష్యంగా అంది. "నువ్వు సంధ్యను ఒకసారి కలుసుకోవాలన్నావు. రేపు ఉదయం పదకొండు ప్రాంతంలో నువ్వు ఆమెను కలుసుకోవచ్చు. మాట్లాడొచ్చు.."

"ఎక్కడ?" వినయ్ కంఠంలో ఉత్సాహం, ఆత్రుత పెనవేసుకున్నాయి.

"వేదాద్రి... లక్ష్మీనరసింహస్వామి ఆలయం."

"ఆలయంలోనా?"

"కాటేజ్ నెంబర్ ఇరవై ఏడు"

"ఎందుకెళ్తోంది?"

"తెలీదు.."

"సుధా..."

"ఏంటన్నాయ్?"

"హోటల్లో సంధ్యతో పాటు నీకు కనిపించిన వ్యక్తి ఎవరు?" తన బుర్రలోంచి పాముపడగలా తలెత్తుతున్న ప్రశ్నను అడగకుండా ఉండలేక పోయాడు వినయ్.

"ఓ...చెప్పడం మరిచిపోయాను. డాక్టర్ సుహాస్! సెక్స్ స్పెషలిస్ట్. బంజారాహిల్స్" సుధ అంది. "దాదా పుగా రోజూ అతన్ని కలుసుకుంటోంది."

"ఎందుకో తెలుసా?"

"తెలుసుకునే ప్రయత్నం చేశాడు డిటెక్టివ్. కానీ తెలుసుకోలేకపోయాడు.." సుధ కుర్చీలోంచి లేచింది. "రేపు ఉదయం ఆరింటికల్లా బయల్దేరాలి నువ్వు..."

"నువ్వు రావా?" వినయ్ అడిగాడు.

"రమ్మన్నా వస్తాను. రమ్మనకపోయినా వస్తాను. వేదాద్రి దేవుడిని దర్శించి చాలా ఏళ్ళయింది. అయితే సంధ్య వద్దకు రాను. ముఖాముఖీ మీ ఇద్దరిదే!" సుధ నవ్వుతూ గుమ్మం వైపు నడిచింది.

వినయ్ నిలువుటద్దం ముందుకు వెళ్ళి నిలబ డ్డాడు. ప్రతిబింబం అతనివైపు కనుబొమలు ముడి వేసి చూస్తోంది. సంధ్య రోజూ డాక్టర్ సుహాస్‌ని కలుస్తోంది. ఎందుకు? ఏదైనా ట్రీట్‌మెంటుకా? ప్రతి బింబం వినయ్‌ని ప్రశ్నార్థకంగా చూసింది.

**(ముగింపు వచ్చేవారం)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'డయాబెటిస్' నియంత్రణకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



'డయాబెటిస్' అనేది దీర్ఘకాలికంగా వేధించే ఒక ఆరోగ్య సమస్య. దీని బారిన పడిన వారు జీవితకాలం మందులు వాడడం తప్ప వేరే మార్గం లేదని మానసికంగా చాలా కృంగిపోతుంటారు. చాలా మందిలో సరైన ఆహార నియమాలు పాటించడం, వ్యాయామం చేయడం మరియు క్రమం తప్పకుండా మందులు వాడడం వంటి జాగ్రత్తలు పాటించినప్పటికీ తమ రక్తంలోని చక్కెర స్థాయిలు నియంత్రణకు రాకపోవడం మరియు తద్వారా ఏర్పడే దుష్ప్రభావాలకు గురి అయి తీవ్ర ఇబ్బందులను ఎదుర్కోవడం జరుగుతుంది. కానీ ఈ వ్యాధిని మొదట్లోనే గుర్తించి సరైన హోమియో చికిత్సను పొందడం ద్వారా రక్తంలోని చక్కెర స్థాయిలను పూర్తిగా నియంత్రణలో ఉంచడమే కాకుండా తద్వారా ఏర్పడే దుష్ప్రభావాల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకునే అవకాశం ఉంటుంది. అంతేకాకుండా అధిక ఒత్తిడి వలన ఏర్పడే 'స్ట్రెస్ డయాబెటిస్'ను కూడా పూర్తిగా నయం చేయడం జరుగుతుంది.




**డయాబెటిస్ అనగా:** సాధారణంగా మానవ శరీరంలో ఉపయోగించబడకుండా మిగిలిపోయిన చక్కెర పదార్థాలు సాధారణ స్థాయి కంటే ఎక్కువ మోతాదులో రక్తంలో ఉండటాన్ని 'డయాబెటిస్' అంటాము. వైద్య పరిభాషలో ఇది ఒక 'మెటబాలిక్ డిజార్డర్'గా పిలువబడుతుంది.

**డయాబెటిస్ రకాలు: (1) టైప్-I డయాబెటిస్ (ఇన్సులిన్ డిపెండెంట్ డయాబెటిస్):** మన శరీర రోగ నిరోధక వ్యవస్థ – క్లోమ గ్రంథిలోని ఇన్సులిన్ ఉత్పత్తి చేసే కణాలను నాశనం చేయడం వలన ఇది కలుగుతుంది. ఎక్కువ శాతం 20 సం॥ల లోపు వయస్సు గల వారిలో మనం దీనిని గమనించవచ్చు. ఈ టైప్-I డయాబెటిస్ ఎక్కువగా చిన్న వయస్సులో వచ్చే అవకాశం ఉంటుంది. దీనినే 'జువెనైల్ డయాబెటిస్' అంటారు.

**కారణాలు:** ఆటో ఇమ్యూన్ వ్యాధులు, క్లోమ గ్రంథికి సిస్టిక్ ఫైబ్రోసిస్ రావడం, క్రానిక్ ప్యాంక్రియాటైటిస్ మరియు పార్షియల్ ప్యాంక్రియాటెక్టమి మొదలైనవి దీనికి కారణాలుగా చెప్పవచ్చు.

**(2) టైప్-II డయాబెటిస్ (నాన్-ఇన్సులిన్ డిపెండెంట్ డయాబెటిస్):** ఈ రకం డయాబెటిస్ ఎక్కువగా 30 సం॥ల వయస్సు దాటిన వారిలో కనిపిస్తుంది. ప్రధానంగా దీనికి 2 కారణాలు. **(i)** అవసరమైన మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం. **(ii)** ఇన్సులిన్ ఉత్పత్తి అయినప్పటికీ శరీర కణాలు సరిగా ఉపయోగించుకోలేకపోవడం. **కారణాలు:** వయస్సు పైబడటం, స్థూలకాయం, శారీరక శ్రమ తగ్గడం, అధిక మానసిక ఒత్తిడి, పూర్వము 'జెస్టేషనల్ డయాబెటిస్' సమస్యను ఎదుర్కొని ఉండటం మరియు వంశపారంపర్యత వంటి అంశాలన్నీ 'టైప్-II డయాబెటిస్'కు కారణాలు అవుతాయి.

**(3) టైప్-III డయాబెటిస్:** దీనినే 'జెస్టేషనల్ డయాబెటిస్' అని కూడా అంటారు. ఈ సమస్య గర్భిణులలో కనిపిస్తుంది.

**లక్షణాలు:** దాహం అధికంగా ఉండటం, ఎక్కువగా ఆకలి వేయడం, అధిక మూత్రస్రావం. • అసంకల్పితంగా బరువు తగ్గడం, త్వరగా నీరసించిపోవడం, పిక్కల్లో నొప్పి, ఒళ్ళు నొప్పులు రావడం, గాయాలు నయం కాకపోవడం. • ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్, చర్మవ్యాధులు ఎక్కువగా రావడం. • సెక్స్ కోరికలు తగ్గిపోవడం, కాళ్ళు–చేతులలో తిమ్మిర్లు మరియు మంటలు కలగడం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**దుష్ఫలితాలు:** డయాబెటిస్ ఉన్న వారికి సరైన చికిత్స మరియు జీవన విధానం లోపించటం వలన ఇది అనేక ఇతర వ్యాధులకు మూలకారణంగా మారే అవకాశం ఎక్కువగా ఉంటుంది. • డయాబెటిక్ ఫుట్, డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ రెటినోపతి, డయాబెటిక్ న్యూరోపతి • అధిక రక్తపోటు, శరీరంలో కొలెస్ట్రాల్ స్థాయిలు పెరగటం, ఛాతీనొప్పి, గుండె పోటు, పక్షవాతం, క్యాటరాక్ట్, గ్యాస్ట్రిక్ సమస్యలు వంటి దుష్ఫలితాలు కలుగుతాయి.

**రోగ నిర్ధారణ పరీక్షలు:** ఫాస్టింగ్ బ్లడ్ షుగర్ లెవెల్స్ (FBS), పోస్ట్ ప్రాండియల్ బ్లడ్ షుగర్ లెవెల్స్ (PPBS), HBA1C, గ్లూకోజ్ టాలరెన్స్ టెస్ట్ (GTT), యూరిన్ షుగర్ లెవెల్స్, సీరమ్ క్రియేటినైన్ లెవెల్స్, బ్లడ్ కొలెస్ట్రాల్ లెవెల్స్ మొదలగు పరీక్షలు చేయించడం ద్వారా 'డయాబెటిస్'కు ఖచ్చితమైన చికిత్స అందించేందుకు వీలవుతుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా, వ్యక్తిలోని డయాబెటిస్ జబ్బుకే కాకుండా, 'డయాబెటిస్' కలిగిన వ్యక్తికి సరైన చికిత్స చేయడం ద్వారా – ఎలాంటి డయాబెటిక్ కాంప్లికేషన్స్ రాకుండా చూడవచ్చు. డయాబెటిస్‌ను గుర్తించిన వెంటనే హోమియోపతి వైద్యంతో సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది. అంతే కాకుండా చిన్న వయస్సులో అధిక ఒత్తిడి వలన సంభవించే 'స్ట్రెస్ డయాబెటిస్'ను కూడా సంపూర్ణంగా నయం చేయవచ్చు.



# 'అలెషెంక' మిస్టరీ

**గ్రహాంతరవాసులు, యుఎఫ్ఒల గురించి ఎన్నో వార్తలు వింటూంటాం. అవి వాస్తవాలా...అబద్ధాలా? అనే వాదులాటలు పక్కన పెడితే ఇలాంటి కథనాలు విపరీతమైన ఆసక్తిని మాత్రం రేకెత్తిస్తాయి. అలాంటిదే 'అలెషెంక' కథ. అలెషెంక...నెలలు నిండకుండా, వైకల్యంతో పుట్టిన పసికందని కొందరంటే... అది కచ్చితంగా గ్రహాంతరవాసేనని మరికొందరు వాదిస్తున్నారు. అయితే శాస్త్రవేత్తలు, మీడియా అసలు నిజమేంటో తేల్చే ప్రయత్నాల్లో ఉండగానే అలెషెంక చిత్రమైన పరిస్థితుల్లో మాయమైంది. వివరాల్లోకి వెళ్తే....**

రష్యాలోని కిష్టిమ్ దగ్గరున్న కవోలినోరీ అనే చిన్న గ్రామమది. 1996, వేసవి కాలం. తమారా వసిల్యోనా ప్రోస్విరానా అనే ఓ వృద్ధురాలు ప్రతిరోజూ లాగే ఇంటిని అలంకరించే పూల కోసం సమాధుల దగ్గరకెళ్లింది. అక్కడి సమాధులపై ఉంచిన పూలను తెచ్చి ఇంట్లోని ఫ్లవర్ వేజుల్లో అలంకరించటం ఆమెకు అలవాటు. అయితే ఆరోజు శ్మశానంలో ఆమెకో చిత్రమైన శబ్దం వినిపించింది. ఏదో జీవి కదిలినట్టు అలికిడి అయింది. దాంతో ఆమె ఆ శబ్దం వినిపించిన చోట వెతికితే అక్కడ ఆమెకో పసికందు కనిపించింది. అప్పుడామె ఆ జీవిని గుడ్డలో చుట్టి తన వెంట ఇంటికి తీసుకెళ్లి పెంచుకోవటం మొదలుపెట్టింది. కొడుకు, కోడలు అదే ఊర్లో ఉన్నా ఒంటరి జీవితం ఆమెది. వారంలో రెండుసార్లు కోడలు వచ్చి అత్తగారిని పలకరించి వెళ్లటం తప్ప ఆమె ఇంటికి వేరే అతిథులెవరూ రారు. దాంతో తనకు దొరికిన పసికందు సంగతి ఎవరికీ చెప్పే అవకాశం లేకపోయింది ఆమెకు. పైగా ఒంటరి మహిళ కావటంతో దొరికిన ఆ వింత పసికందును 'అలెషెంక' అని ముద్దుగా పిలుచుకుంటూ తన సొంత బిడ్డలా పెంచుకోవటం మొదలుపెట్టింది.

### విస్తుపోయిన కోడలు పిల్ల

పసికందు దొరికిన ఆ మరుసటి రోజే ఎప్పటిలా అత్తగారిని చూడటం కోసం కోడలు 'తమారా' వచ్చింది. అప్పుడామె అత్తగారు పెంచుకుంటున్న పసికందును చూసి ఒక్కసారిగా ఉలిక్కిపడింది. తర్వాత తమారా శాస్త్రవేత్తలతో అలెషెంక గురించి వర్ణించిన వివరాల ప్రకారం....అలెషెంక తల దాని శరీరం కంటే చాలా పెద్దదిగా ఉండి ఉల్లిపాయ ఆకారంలో ఉంది. కనురెప్పలు లేని పెద్ద పెద్ద కళ్లు. పిల్లికిలాంటి నిలువు కనుపాపలు. జననేంద్రియాలు లేవు. నోరు, చెవుల స్థానంలో రంధ్రాలు. ఆ వింత జీవికి తన అత్తగారు తినటానికి ఇచ్చినా ఆ జీవి దాన్ని తిన్నట్టు నోటి కదలికలు కనిపించలేదు. అయినా ఆ పదార్థాన్ని తినగలిగింది. ఇదీ అలెషెంక గురించి తమారా ఇచ్చిన వివరణ. అలెషెంక మాయమైన తర్వాత శాస్త్రవేత్తలకు ఇంత వివరణ ఇచ్చిన తమారా అది అత్తగారి దగ్గర ఉన్నప్పుడు మాత్రం ఆ విషయాన్ని బయటెక్కడా చెప్పకుండా రహస్యంగా ఉంచేసింది. కారణం అడిగితే....అత్తగారి ఆనందాన్ని దూరం చేయటమెందుకని చెప్పలేకపోయానని అంటోంది.



### భిన్న, విభిన్న కథనాలు

తమారా వసిల్యోనా ప్రోస్విరానాకు అలెషెంక దొరికి కొన్ని నెలలు గడిచాయి. ఆ వృద్ధురాలు అనారోగ్యం పాలైంది. ఆమెను ఆస్పత్రికి తీసుకెళ్లటానికి మెడికల్ టీమ్ వచ్చింది. వాళ్లతో ఆమె తనకో పసికందు ఉందని, తనను ఆస్పత్రికి తీసుకెళ్తే దాని బాగోగులు ఎవరు చూసుకుంటారనీ? అడిగింది. అది నమ్మని నర్సులు ఆమె చెప్తున్నది గుడ్డలో చుట్టి ఉంచిన పిల్లి గురించేమో అనుకుని

పట్టించుకోలేదు. అసలు ఆమె ఆరోగ్యం చెడి ఆస్పత్రిలో చేరిందా? లేక మతి భ్రమించి ఆస్పత్రి పాలైందా? అనే విషయాల్లో కూడా పొంతన లేకపోయినా మొత్తానికి అలెషెంక మాత్రం ఇంట్లో ఒంటరిగా మిగిలిపోయింది. తమారా వసిల్యోనా ప్రోస్విరానా, ఆమె కోడలు తమారాలతోపాటు అలెషెంక గురించి తెలిసిన 'వ్లాదిమర్ నుర్దినోవ్' అనే మూడో వ్యక్తి ఉన్నాడు. అయితే అలెషెంక అతనికెలా కనిపించిందో తెలియకపోయినా ఆ వృద్ధురాలు ఆస్పత్రిపాలైందని తెలిసిన వెంటనే పసికందును చూడటం కోసం ఆమె ఇంటికి వెళ్లాడు నుర్దినోవ్. అయితే నుర్దినోవ్‌కు అలెషెంక గురించి తెలియటం గురించి కూడా రెండు కథనాలు వినిపిస్తున్నాయి. ఇతను కూడా ఆ వృద్ధురాలితో ఆమె ఇంట్లో ఉండేవాడని కొందరంటే, వృద్ధురాలు ఆస్పత్రిపాలయ్యాక అలెషెంక చనిపోతే ఆ మృతదేహాన్ని కోడలు తమారా నుర్దినోవ్‌కు ఇచ్చిందని కొందరంటున్నారు. అయితే నుర్దినోవ్ ఆ వింత శిశువు మృతదేహాన్ని ఖననం చేయకుండా 'వ్లాదిమిర్ బెండ్లిన్' అనే పోలీసుకు ఇచ్చాడు. అయితే ఇక్కడ కూడా...'అపహరించబడిన కేబుల్స్ గురించిన ఇన్వెస్టిగేషన్‌లో వ్లాదిమర్, నుర్దినోవ్‌ను కలిసిన సందర్భంలో అలెషెంకను స్వాధీనం చేసుకున్నాడని, నుర్దినోవ్ అలెషెంక మృతదేహాన్ని ఏం చేయాలో తెలియక స్వయంగా పోలీసులకు అప్పగించాడని రెండు భిన్న కథనాలు ప్రచారంలో కొచ్చాయి.

### అలెషెంక మానవ జీవి కాదు

ఆ తర్వాత పోలీసు ఆఫీసర్ బెండ్లిన్ మమ్మీగా మార్చిన అలెషెంక మృతదేహాన్ని అనాలసిస్ కోసం డాక్టర్. ఐరినా ఎర్మలోవాకు అప్పగించాడు. అలెషెంకను పరిశీలించిన డాక్టర్ మమ్మీగా మార్చిన ఆ మృతశరీరం ఒకప్పుడు జీవం ఉన్న ప్రాణిదేనని కనిపెట్టి బహుశా అది నెలలు నిండకుండా పుట్టిన పసికందైనా అయి ఉంటుంది లేదా 1957లో జరిగిన 'కిష్టిమ్' అణు విస్ఫోటనం ఫలితంగా అవకారాలతో పుట్టిన పసికందైనా అయి ఉంటుందని నిర్ధారణకొచ్చింది. ఇదిలా ఉంటే, వ్లాదిమర్ క్లినికల్ అసిస్టెంట్ 'ల్యుబోవ్ రొమనోవా' మాత్రం దీనికి పూర్తిగా భిన్నమైన వాదన చేసింది. తన వైద్య





అనుభవంలో వైకల్యాలతో పుట్టిన ఎంతోమంది పసికందుల్ని చూశానని, కానీ అలెషెంక లాంటి వింత పసికందును ఎప్పుడూ చూడలేదని చెప్పింది. పైగా ఆ బిడ్డ మనిషికి పుట్టిన జీవి కాదని కూడా కచ్చితంగా చెప్పేసింది. మానవ శిశువుకు అలెషెంకకు దాదాపు 20 తేడాలున్నాయని కూడా చెప్పింది. వాటిలో ముఖ్యమైనది అలెషెంక తల. అలెషెంక తల నాలుగు మొనదేలిన ఎముకలతో తయారైంది. ఆ ఎముకలు అమరిన తీరు పూర్తిగా మనుషులకు విరుద్ధంగా ఉంది.

### బోలెడన్ని కట్టు కథలు

ఈ పరిశీలనలు జరుగుతుండగానే మరో పక్క రష్యాలోని ఆ మారుమూల గ్రామమంతా వృద్ధురాలికి గ్రహాంతర జీవి దొరికిన పుకార్లు వ్యాపించటం మొదలుపెట్టాయి. ఆ శిశువును నేను చూశానంటే, నేను చూశానంటూ...కొందరు అలెషెంక వార్తను క్యాష్ చేసుకునే ప్రయత్నాలు కూడా చేశారు. అయితే అసలు అలెషెంక అనే గ్రహాంతర జీవే లేదు. అలా ఉందని నమ్మించి మీడియానుంచి గుర్తింపు, డబ్బు పొందుదామని వృద్ధురాలి కోడలు, నుర్దినోవ్ కలిసి అలెషెంక కథ సృష్టించారనే కథనాలు కూడా మొదలయ్యాయి. అలా చిత్రమైన కథనాల ఫలితంగా ప్రపంచం నలుమూలల నుంచి మీడియాతోపాటు యుఎఫ్‌ఓ నిపుణులూ ఆ కుగ్రామానికి దారి కట్టారు.

### మాయమైన అలెషెంక

గ్రహాంతర వాసుల గురించి అధ్యయనం చేసే యుఫాలజిస్ట్ 'బోరిస్ జొలటోవ్' ఒకడుగు ముందుకేసి అలెషెంకను తనకిస్తే పరీక్షలు చేసి దాని గుట్టు విప్పుతానని ముందుకొచ్చాడు. అలా రావటం ఆలస్యం పోలీస్ ఆఫీసర్ బెండ్లిన్ మరో ఆలోచన చేయకుండా అలెషెంకను ఆయన చేతుల్లో పెట్టాడు. ఆ తర్వాత రోజులు, నెలలు గడిచిపోయినా బోరిస్ నుంచి కబురు లేదు. కొంత కాలం తర్వాత టెలివిజన్‌కు ఇచ్చిన ఓ ఇంటర్వ్యూలో జొలటోవ్ అలెషెంకను తీసుకుని తన అసిస్టెంట్ ల్యాబ్‌కు వెళ్తుంటే మార్గమధ్యంలో గ్రహాంతర వాసులు అలెషెంక శరీరాన్ని తమ వెంట తీసుకెళ్లిపోయారని చెప్పాడు. ఇంటెలిజెన్స్ జొలటోవ్ నుంచి బలవంతంగా అలెషెంక అవశేషాలను లాక్కుని అతని చేత అలా ఇంటర్వ్యూ ఇప్పించి ఉంటుందని కొందరు అనుకున్నారు. కాదు, అలెషెంకను భారీ మొత్తానికి జొలటోవ్ ఎవరికో అమ్మేశాడని ఇంకొందరు అనుకున్నారు. వీటిలో నిజం ఏదైనా చివరికి అలెషెంక మృతదేహం మాత్రం అనుమానాస్పదంగా మాయమైంది.

### నిగ్గు తేల్చిన డీఎన్‌ఏ టెస్ట్

ఇదిలావుంటే అలెషెంకను చుట్టిన క్లాత్ తన దగ్గర ఉందని, దాన్ని జాగ్రత్తగా పరీక్షించి నిజం నిగ్గు తేలుస్తానంటేనే ఇస్తానని ఒకామె ముందుకొచ్చింది. ఆమెను ఒప్పించి ఆ క్లాత్‌ను అందుకున్న బెండ్లిన్ దాన్ని డిఎన్‌ఏ అనాలసిస్‌కు పంపించాడు. వృద్ధురాలి కోడలు కూడా ఆ క్లాత్‌ను తన అత్తగారు అలెషెంకను చుట్టి ఉంచినదిగా గుర్తుపట్టింది. చివరికి డీఎన్‌ఏ టెస్ట్ ఫలితం వచ్చింది. దాన్లో ఒక డీఎన్‌ఏ వృద్ధురాలిదిగా భావించే మానవ డీఎన్‌ఏ అయితే, మరో డీఎన్‌ఏ అంతవరకూ సైన్స్ ఎక్కడా చూడనిది. ఆ ఫలితంతో '20 26 వారాల వయసున్న విపరీతమైన వైకల్యాలున్న ఓ ఆడ ప్రిమెచ్యూర్ బేబీగా నిర్ధారిస్తూ ప్రభుత్వ ప్రకటన విడుదల చేసింది రష్యా ప్రభుత్వం. అణుధార్మికత మూలంగా నెలలు నిండకుండా వైకల్యంతో పుట్టిన బిడ్డను చూసి భయపడిన ఓ యువతి దాన్ని శ్మశానంలో విసిరి పారేసి ఉంటుందని అందరూ నిర్ధారణకు వచ్చారు. పుట్టిన కొన్ని గంటలకే ఆ బిడ్డ చనిపోయి ఉంటుందని కూడా వైద్యులు నిర్ధారించారు. కానీ అలెషెంకను ప్రాణంతో చూసిన తమారా వసిల్యోనా ప్రోస్విరానా, కోడలు తమారా, నుర్దినోవ్ మాత్రం అలెషెంక మానవ జాతికి చెందిన జీవి కాదని ఇప్పటికీ నమ్ముతున్నారు.

### విచిత్ర మరణాలు

అలెషెంక మృతదేహం మాయమైన సమయంలో వృద్ధురాలు తమారా వసిల్యోనా ప్రోస్విరానా చిత్రమైన పరిస్థితుల్లో మరణించింది. ఆస్పత్రి నుంచి పారిపోయే ప్రయత్నంలో రోడ్డు దాటుతూ ప్రమాదానికి గురై చనిపోయింది. అలెషెంక కేసు గురించిన ఆసక్తితో వైద్యులు హిప్నాసిస్‌తో ఆమె నుంచి నిజాలు రాబట్టాలనుకున్న కొద్దిరోజుల ముందే తమారా వసిల్యోనా ప్రోస్విరానా అనుమానాస్పదంగా మరణించటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఆ వైద్య బృందానికి నేతృత్వం వహించిన 'మిల్క్‌హీమర్' అనే వైద్యుడు ఆ కుగ్రామం కిష్టిమ్ చేరుకోగానే గుండెపోటుతో మరణించాడు.

– గోగుమళ్ల కవిత

# దిశ మార్చిన ప్రత్యూష పవనం

## –అత్తలూరి విజయలక్ష్మి

**"నాన్నా శశీ! ఏరా ఇంకా కూర్చున్నావేంటి? ఆఫీస్‌కి వెళ్ళడం లేదా?"**

**సోఫాలో కూర్చుని ఎటోచూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్న శశాంక్‌ని ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది ప్రమీల.**

**పూజగదిలోంచి హాల్లోకివచ్చి పలకరించిన తల్లినిచూసి ఉలికిపడ్డాడు శశాంక్. "ఆ, ఆ వెళ్తానమ్మా" అన్నాడు తత్తరపడుతూ.**

కొడుకువైపు వింతగా చూసింది ఆమె.

రోజూలాగే ఇవాళకూడా ఉదయం ఐదున్నరకే లేచింది ప్రమీల. స్నానపానాదులు పూర్తిచేసుకుని, కొడుక్కీ, కోడలికీ బ్రేక్‌ఫాస్ట్, లంచ్ సిద్ధం చేసింది. ఇద్దరూ ఇడ్లీ తింటూండగానే వాళ్ళ క్యారేజీలు కూడా సర్ది డైనింగ్‌టేబుల్ మీద వాళ్ళపక్కనే పెట్టి పూజగదిలోకి వెళ్ళిపోయింది.

తనూ, తన భర్తా కలిసి బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్ ఏం చేస్తున్నా ప్రమీల అక్కడ ఉండడం ఇష్టం ఉండదు ప్రత్యూషకి. పెళ్ళైనకొత్తల్లో అత్తగారికి ఇన్‌డైరెక్ట్‌గా చెప్పేది. రెండునెలలు దాటాక "అన్నీ టేబుల్ మీదపెట్టి మీ పని మీరు చేసుకోండి, మేం తింటాం" అని డైరెక్ట్‌గానే చెప్పింది.

అప్పటినుంచీ కొడుకూ, కోడలూ కూర్చున్న చోట ఉండకుండా ఏదో పని కల్పించుకుని అవతలికి వెళ్ళిపోతూ ఉంటుంది ప్రమీల.

ఆ ఇంట్లో రెండు ప్రదేశాలు ఆవిడ స్వంతం. ఒకటి వంటగది, రెండు పూజగది. ఆ రెండు గదుల్లోకి కోడలురాదు. కొడుకు అసలురాడు. ప్రమీల పూజ కనీసం నలభైనిమిషాలు పడుతుంది. శుక్రవారం, మంగళవారం అయితే గంట సమయం పడుతుంది.

అందుకే ఉదయం లేవగానే ముందు ఆఫీస్‌లకెళ్ళిపోయే కొడుకు, కోడలు కోసం టిఫిను, వంట చేసేస్తుంది. వాళ్ళు బ్రేక్‌ఫాస్ట్ తినేటప్పుడు క్యారేజీలు సర్ది వాళ్ళపక్కనేపెట్టి తను పూజకి వెళుతుంది. ఆ తరువాత ఎవరి బండిమీద వాళ్ళు ఆఫీస్‌లకెళ్ళిపోతారు. పూజ పూర్తయ్యాక తను షుగర్ టాబ్లెట్ వేసుకుని రెండు ఇడ్లీలు తింటుంది ప్రమీల.

ఆరోజు ఆవిడ టాబ్లెట్‌కోసం హాల్లోకి వచ్చేసరికి శశాంక్ ఆఫీస్‌కి వెళ్ళకుండా సోఫాలో అలా పరధ్యానంగా కూర్చోవడంతో ఆవిడకి ఆశ్చర్యంతోపాటు చిన్న అనుమానం కూడా వచ్చింది.

ఏమైంది వీడికి? ఉరుకులు పరుగులు పెడుతూ "టైమ్ అయిపోయింది, నా సాక్స్ ఎక్కడ? నా షూస్ ఎక్కడ?" అంటూ చిందులేసే శశాంక్, బ్రేక్‌ఫాస్ట్‌కూడా సరిగ్గా తినకుండా క్యారేజీ తీసుకుని పెద్దశబ్దంతో బండిస్టార్ట్‌చేసి రయ్‌మంటూ వెళ్ళిపోయే శశాంక్ ఈరోజు ఎందుకిలా ఉన్నాడు? ఆఫీస్‌లో ఏదైనా సమస్యా? ఆరోగ్యం బాగాలేదా?

ఆలోచిస్తూ కొడుకు దగ్గరకువచ్చి పక్కనే సోఫాలో కూర్చుంది. అతని భుజంమీద చెయ్యివేసి మృదువుగా అడిగింది "ఏమైంది నాన్నా? అలా ఉన్నావేం?"

దీర్ఘంగా శ్వాస తీసుకుని తల అడ్డంగా ఊపుతూ "ఏం లేదమ్మా" అన్నాడు శశాంక్.

"మరి ఆఫీస్‌కి వెళ్ళకుండా కూర్చున్నావేం? టైమ్ పది దాటింది కదరా" అంది.

గోడ గడియారం పదింపావు చూపిస్తోంది.

శశాంక్ తలెత్తి గడియారంవైపు చూసి నెక్ టై వదులు చేస్తూ అన్నాడు "లేదమ్మా కొంచెం డల్‌గా ఉంది. నాకు వెళ్ళాలనిలేదు, ఇవాళ వెళ్ళను" అంటూ లేచాడు.

ఆదుర్దాగా తనూ లేచి అడిగింది "ఏమైంది నాన్నా? తలనొప్పా?"

"కాదమ్మా"

"మరి? ఒళ్ళు నొప్పులా?"

"లేదమ్మా ఏంలేదు. ఊరికే డల్‌గా ఉంది, కాసేపు పడుకుంటాను" అంటూ తన గదివైపు వెళ్ళాడు.

"మాత్రేదన్నా వేసుకుంటావా? కాఫీ ఇవ్వనా"



ఆవిడ అతని వెనకే నడుస్తూ అడిగింది.

"వద్దమ్మా విశ్రాంతి తీసుకుంటాను, కాసేపు ప్రశాంతంగా పడుకుంటే చాలు తగ్గిపోతుంది."

అతని గది గుమ్మంబైటే ఆగిపోయింది ఆమె. శశాంక్ తలుపులు దగ్గరగా లాగి లోనికి వెళ్ళి పోయాడు.

ఆవిడ నెమ్మదిగా అక్కడి నుంచి వచ్చేసింది.

ఎన్నడూలేనిది కొడుకు అలా ఉండడం ఆవిడకి బాధగా అనిపించింది. శశాంక్ చిన్నప్పటి నుంచీ ఆరోగ్యంగానే ఉండేవాడు. పిల్లలకు తరచు సహజంగా వచ్చే జలుబు, విరేచనాలు, కడుపు నొప్పులు కూడా శశాంక్‌కి రాలేదు. చదువుకునేటప్పుడు కూడా అనారోగ్యంతో స్కూలుకి డుమ్మాకొట్టిన సందర్భాలు చాలా తక్కువ. అలాంటిది ఇవాళ ఆరోగ్యం బాగా లేదని శశాంక్ నీరసంగా, నిస్తేజంగా కూర్చోవడం తట్టుకోలేకపోయింది ప్రమీల. ఇడ్లీకూడా తినాలని పించలేదు. కానీ షుగర్‌వ్యాధివల్ల కళ్ళు తిరిగి నీరసం వస్తుందని బలవంతంగా రెండు ఇడ్లీలు తిని శశాంక్‌గదివైపే చూస్తూ సోఫాలో కూర్చుండి పోయింది.

శశాంక్ ఇంటర్‌లో చేరిన నాలుగునెలలకే అనుకోని అనారోగ్యంతో తండ్రి చనిపోయాడు. టెన్త్ ఫెయిలైన ప్రమీలకు ఆమె భర్త పనిచేసిన గ్రామీణ నీటిసరఫరాశాఖ కార్యాలయంలో కారుణ్య నియామకం కింద అటెండర్‌పోస్ట్ ఇచ్చారు. అంతోఇంతో కలిగిన కుటుంబంలో పుట్టి, పెళ్ళయాక కూడా మంచి ఇల్లాలుగా, మంచి కోడలుగా పేరుతెచ్చుకున్న ప్రమీల అటెండర్‌గా ఎంగిలి కప్పులు కడిగే ఉద్యోగం చేయాల్సివచ్చినందుకు నామోషీగా భావించలేదు. ఆనందంగా ఆ ఉద్యోగంలోచేరి కొడుకుని ఇంజనీర్‌ని చేసింది. డబ్బుకి లోటులేదు. కొడుక్కి మంచి ఉద్యోగం వచ్చింది. ఇంక అతనికి పెళ్ళిచేసి మన వలకి సేవ చేసుకుంటూ బతికితే చాలుకదా అనుకుని వాలంటరీ రిటైర్మెంట్ తీసుకుంది. ఇంతలో శశాంక్ తనతోపాటు ఇంజనీరింగ్ చదివిన ప్రత్యూషని ప్రేమిస్తున్నానని చెప్పడంతో సంబంధాలు చూసే బాధ్యతకూడా తప్పడం ఆవిడకి ఆనందాన్ని కలిగించింది. పోనీలే తను చూస్తే ఎవరో ముక్కు, మొహం తెలియని అమ్మాయిని చూస్తుంది. వాడికి బాగా తెలిసిన అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకుంటే అంతకన్నా ఏం కావాలి అనుకుంది.

ప్రత్యూష తండ్రి ఒక జూనియర్ కాలేజీ లెక్చరర్. ఇద్దరాడపిల్లలు. అతి సాధారణ కుటుంబం. పూర్తిగా నాన్-వెజిటేరియన్స్. అయినా ప్రమీల బాధపడలేదు, సంకోచించలేదు. ప్రత్యూషమాత్రం పెళ్ళికి వేలకి వేలు ఖర్చుపెట్టి పట్టుచీరలు, మూడో, నాలుగో నెక్లెసులు కొనుక్కుంది. కానీ, పెళ్ళి సింపుల్‌గానే చేస్తాం, మాకంతే స్తోమత అంటూ ప్రమీలకి కనీసం వెయ్యిరూపాయల చీర కూడా పెట్టలేదు. అయినా ప్రమీల బాధపడలేదు. కొడుక్కి కనీసం ఉంగరం, సూటు కూడా కొనకపోడం కొంచెం బాధ కలిగించినా పట్టించుకోలేదు. పోనీలే బంగారానిదేముంది బంగారంలాంటిపిల్ల కోడలుగా వస్తోందని మురిసిపోయింది. స్నాతకానికి భోజనాలు కూడా పెట్టలేదు. తన బంధువులందరికీ తనే క్యాటరింగ్ ఏర్పాటుచేసింది. పెళ్ళిరోజుమాత్రం రెండుపూటలా వాళ్ళే భోజనాలు పెట్టారు. అది కూడా చాలా మామూలు భోజనం.

"ఇదేమిటే ప్రమీలా ఈ రోజుల్లో ఎంత లేనివాళ్ళైనా ఐదారుస్వీట్లు, బోలెడు కొత్త, కొత్త వంటకాలతో భోజనాలు పెడుతున్నారు. మరీ ఇంత అధ్వానమా? ఇది పెళ్ళిభోజనంలా లేదు" అన్నారు ప్రమీల అన్నదమ్ములు, బంధువులు. ప్రమీలకి కూడా నిజమే అనిపించిందిగానీ, ఏం మాట్లాడలేకపోయింది.

కాపురానికి వచ్చిన దగ్గర్నించీ అత్తగారితో సరదా మాటలు, ఆత్మీయత...ఏమీ లేదు. ప్రమీల కొత్తల్లో బాధపడినా తర్వాత అలవాటుపడిపోయింది. ఉద్యోగస్థులు ఇలాగే ఉంటారులే అని సమాధానపడింది.

ఇప్పుడు కొడుకు అలా పడుకుంటే ఆందోళనగా అనిపించింది. మనశ్శాంతికోసం సుందరకాండ



చదువుతూ కూర్చుంది.

***

గదిలోకివెళ్ళి బట్టలు మార్చుకుని మంచంమీద వాలిన శశాంక్‌కి గుండెలమీద పెద్ద,పెద్ద ఇనప గుండ్లు దొర్లిస్తున్నట్టు బరువుగా, నొప్పిగా అనిపిస్తోంది. గొంతులో ఏదో ఉండలా మారి అడ్డం పడినట్టుంది. తల పగిలిపోతోంది. ఇదంతా నొప్పివల్ల కాదు, ఆలోచనలవల్ల. రాత్రి ప్రత్యూషకీ, తనకీ మధ్య సంభాషణ, ఆమె పంతం గుర్తుకొస్తే వణుకు పుడుతోందతనికి.

నిజంగా ప్రత్యూష వెళ్ళిపోతుందా? ఈ ఇంట్లో ఆమెకు ఏం తక్కువైంది? ఎంత సుఖంగా ఉంటోంది తను. ప్రత్యూషని అమ్మ ఎంతోబాగా చూసుకుంటోంది. కోడలికి ఇన్నిసేవలు ఎవరు చేస్తారు? ప్రత్యూషకి ఇవన్నీ అర్థం కావడంలేదు. ఆకాశంలో ఉండే చందమామ అరచేతిలో ఉంటే దాన్నో రబ్బరుబంతి అనుకుని పక్కన పడేయడం మనిషినైజం. దూరంనుంచి చూసేవే అందంగా కనిపిస్తాయి. ఎంతో అపురూపమైనవి అందుబాటులో ఉంటే వాటి విలువ తెలియదు.

ప్రత్యూష పరిస్థితి ఇప్పుడు అలాగే ఉంది. అమ్మ దూరమైతేకానీ, ఆవిడ విలువ తెలిసిరాదు. కనీసం తెలుసుకోడానికి ప్రయత్నించకుండా ఆవేశ పడింది.

ప్రత్యూష ఎందుకంత పట్టుపడుతోంది? తన సమస్య ఏంటి? ఎంత ఆలోచించినా శశాంక్‌కి అర్థం కావడంలేదు. ఎందుకు? అనే ప్రశ్న ఒక పెద్ద సమ్మెటలా మారి అతని తలమీద కొడుతోంది.

ప్రత్యూష తన ప్రాణం, తన సర్వస్వం. ఆమె కోసం తపించి, వెంటబడి, ఆమె ఎన్ని కండిషన్లు పెట్టినా అన్నిటినీ అంగీకరించి పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళంటూ చేసుకుంటే ప్రత్యూషనే చేసుకుంటా, లేకపోతే అసలు పెళ్ళే చేసుకోనని పట్టుబడితే, అలాగే చేసుకో నాన్నా నీ ఇష్టానికి వ్యతిరేకంగా నేను ఏమీచేయను, సరేనా? అంటూ పెళ్ళికి అంగీకరించడమేకాదు, ప్రత్యూషని ఎంతో ఆదరించి, కన్నకూతురులా చూసుకుంటోంది అమ్మ.

తెల్లగా, సన్నగా, నాజూగ్గా ఉండే కోడలు చీపురు పుల్లముట్టుకున్నా ఆమెకు గుచ్చుకుంటుందనే భయంతో ఏ పనీ చేయనివ్వదు ఆవిడ.

'నాకు కోడలైనా, కూతురైనా నువ్వే, నీకేం కావాలన్నా మీ అమ్మను అడిగినట్టే నన్నూ అడుగు, నీకేమిష్టమోచెబితే చేసిపెడతాను' అంటూ ప్రేమగా అడిగేది. ప్రత్యూష వచ్చిన ఈ ఎనిమిది నెలల్లోనూ ఏరోజుకారోజు ఓపిగ్గా కోడలికి ఇష్టమైన వంట కాలు చేసిపెడుతోంది అమ్మ. బైటతిరిగే తను ఏదైనా తింటాడుకానీ, అమ్మమాత్రం ఎట్టి పరిస్థితుల్లో మంగళవారం, శనివారం, శుక్రవారం ఉల్లిపాయకూడా తినకుండా ఎంతో నిష్ఠగా ఉంటుంది. అలాంటి అమ్మ కోడలుకోసం ఆమ్లెట్‌వేయడం నేర్చుకుంది. అప్పుడప్పుడు బ్రేక్‌ఫాస్ట్‌లో బ్రెడ్ ఆమ్లెట్ చేసి పెడుతుంది.

అలాంటి అమ్మని, అలాంటి అమ్మని...

శశాంక్‌కి ఏడుపొచ్చింది.

దాదాపు నెలనుంచీ ప్రత్యూష తన విశ్వరూపం చూపిస్తోంది శశాంక్‌కి.

"మీ అమ్మ ఇక్కడే ఉంటుందా?" అనడిగింది ఓ రోజు.

"ఇంకెక్కడుంటుంది?" ఆశ్చర్యంగా అడిగాడు శశాంక్.

"ఈ ఇల్లు అమ్మది. మా నాన్న కొన్నాడు. అమ్మ పేరునే ఉంది. అయినా అదేం ప్రశ్న" అన్నాడు.

"ప్రత్యూష అతనివైపు సూటిగాచూస్తూ, "ఆవిడ ఇక్కడ ఉండడం నాకిష్టం లేదు. మనం యంగ్ కపుల్.. మనకి ఫ్రీడం లేకుండా ఆవిడ ఇక్కడ ఎందుకు ఉండటం? నాకు చిరాగ్గా ఉంది" అంది.

భార్య ధోరణి నచ్చలేదు శశాంక్‌కి. అయినా శాంతంగా అన్నాడు. తప్పు ప్రత్యూ, అమ్మకిమాత్రం ఎవరున్నారు? మనకి ఆవిడ, ఆవిడకి మనం ఇదే ఫ్యామిలీ అంటే. ఇవాళ నీకేదో ఫ్రీగాలేదని అమ్మని ఎక్కడికో పంపించేస్తే రేపు మనకి పిల్లలు పుట్టాక వాళ్ళని ఎవరు చూస్తారు? నువ్వు ఉద్యోగం, నేను ఉద్యోగం, పిల్లలకి క్రచ్చే గతి అవుతుంది, అంత కన్నా అమ్మ ఉంటే తనే పిల్లల్ని చూసుకుంటుంది.

"ఏంటి మీ అమ్మ మన పిల్లల్ని చూసుకోడమా? అన్‌ఎడ్యుకేటెడ్ లేడీ, ఆవిడకేం తెలుసు పిల్లల్ని ఎలా పెంచాలో, పిల్లల్ని పెంచడం ఒక కోర్స్ తెలుసా నీకు"

ప్రత్యూషవైపు చిత్రంగా చూశాడు. "కోర్సా... కొత్తగా ప్రవేశపెట్టారా? ఏ యూనివర్సిటీలో? మరి మీ

బక్కచిక్కిన వ్యక్తి ఒకడు ఓ వృద్ధురాల్ని మూటలాగా వీపుమీద వేసుకుని కొండపైకి ఎక్కుతున్నాడు. తనలోతనే ఎంతో కుమిలిపోతున్నాడు. ఇద్దరూ మౌనంగా రోదిస్తున్నారు. భార్య కోరిక కాదనలేక తన తల్లిని కొండపైనుంచి లోయలోకి తోసేయడానికి తీసుకువచ్చాడా బక్కమనిషి. అతడామెను లోయలోకి తోసేశాడా? లేదా? ఆ భార్య కోరిక తీరిందా? అసలు ఇదంతా ఎక్కడ జరుగుతోంది?

అమ్మకూడా ఆ కోర్స్ చదివి నిన్ను పెంచిందా?" హాస్యంగా అడిగాడు.

"నాన్సెన్స్ మా అమ్మ ఎడ్యుకేటెడ్. చదువుకోని వాళ్ళకి పిల్లల్ని పెంచడంరాదు. అయినా అదంతా వదిలెయ్. ఇప్పుడు మీ అమ్మ మన దగ్గర ఉండడం నా కిష్టం లేదు" అనేసింది.

"ఎందుకిష్టం లేదు?" అని అడగాలనుకున్నాడు కానీ, ఆ అవకాశం ఇవ్వకుండా మాటలు కట్ చేసింది.

"ఆరోజునుంచీ ప్రతిరోజూ, నేను చెప్పిన విషయం గురించి ఏం ఆలోచించావు? నేను సరదాగా మాట్లాడ లేదు. సీరియస్ మేటర్ అంటూ గుర్తు చేస్తూనే ఉంది. శశాంక్ మౌనం వహిస్తూ వచ్చాడు. కానీ, రాత్రి చాలా సీరియస్‌గా అంది "నేను చెప్తుంటే నీకు వేళాకోళంగా ఉందా? మీ అమ్మ మనతో ఉండడం నాకిష్టంలేదని చెప్పాగా..ఆ విషయాన్ని ఎందుకింత తేలిగ్గా తీసుకుంటున్నావు" అంది సీరియస్‌గా.

"ఏంటి ప్రత్యూ, అమ్మకి నేనొక్కణ్ణే కొడుకుని. ఆమె ఎక్కడికి వెళ్తుంది? అయినా ఆవిడ మనకేం అడ్డం?" అన్నాడు నచ్చజెప్పే ధోరణిలో.

"అడ్డమో, గడ్డమో నాకు తెలియదుకానీ, నేను మాత్రం ఆవిడ ఉన్నచోట ఉండను. నీకు మీ అమ్మని పంపడం ఇష్టం లేకపోతే నేనే వెళ్ళిపోతాను" అంది.

నిశ్చేష్టుడయ్యాడు శశాంక్ "ఎందుకంత తీవ్ర మైన నిర్ణయం? ఏం జరిగిందని?" అన్నాడు.

"ఏదన్నా జరిగేదాకా పంపించవా? అయితే ఆవిడతో రేపు నేనే డైరెక్ట్‌గా చెప్పేస్తాను".

ఆవేశంగా అంటున్న భార్యవైపు వెర్రివాడిలా చూశాడు. "ఆవిడ నాకు కన్నతల్లి ప్రత్యూ" అన్నాడు.

"కన్నతల్లి నాకూ ఉందిగానీ ఆవిడ మనతో ఉంటోందా?"

"ఆవిడకు మీ నాన్నగారు ఉన్నారు. మీ చెల్లె లుంది. మా అమ్మకి ఎవరూ లేరు".

"బోలెడన్ని వృద్ధాశ్రమాలు ఉన్నాయి"

"వాట్? అమ్మని వృద్ధాశ్రమంలో చేర్చాలా" నిర్ఘాంతపోతూ అన్నాడు.

"వృద్ధులు ఉండాల్సింది వృద్ధాశ్రమంలోనే" నిర్లక్ష్యంగా అంది.

మళ్లీ దృఢంగా అంది. "నాకన్నా నీకు ఆవిడ



# స్వీటీ చేసిన తప్పే కీర్తి చేస్తోందా?

సైజ్ జీరో' కోసం అనుష్క శెట్టి చేసిన తప్పే ఇప్పుడు కీర్తి సురేష్ కూడా చేస్తోంది అంటున్నారు సినీ జనాలు. ఎలాగంటే 'సైజ్ జీరో' కోసం అనుష్క ఒక్కసారిగా 20 కిలోల బరువు పెరిగింది. ఇప్పుడు కీర్తి కూడా మహానటి సావిత్రి బయోపిక్ కోసం బరువు పెరగబోతోంది. పెరిగిన బరువును తగ్గించుకోవడానికి అనుష్క పడిన కష్టాలు చూసి కూడా కీర్తి బరువు పెరిగేందుకు సిద్ధపడడం ఆమె అభిమానులను ఆవేదనకు గురి చేస్తోంది. అనుష్కలాగా బరువు తగ్గకపోతే కీర్తి కెరీర్ ప్రమాదంలో పడడం ఖాయం అని అంటున్నారు సినీ జనాలు.



ఎక్కువా?"

"ఎందుకు అలా అనుకుంటావు? నువ్వు నా ప్రాణం"

"అయితే ఆవిణ్ణి పంపించెయ్.... లేదంటే నేను వెళ్ళిపోతా".

అప్పటిదాకా ఏదో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతోంది తిక్కది అనుకున్నాడుకానీ, అంత సీరియస్‌గా అనేసరికి శశాంక్‌కి మతిపోయింది.

ప్రత్యూషకి అమ్మచేసిన అపకారం ఏంటి? తమ దాంపత్య జీవితంలో అమ్మవల్ల ఏదన్నా లోటు వచ్చిందా? ప్రత్యూషకు ఏంటి ఇబ్బంది? అమ్మని ఎందుకు పంపించాలి? అయినా ఎక్కడికి పంపాలి? పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు శశాంక్.

అమ్మ ఉంటే ప్రత్యూష ఉండనంటోంది. ప్రత్యూష లేకుండా తను క్షణం కూడా బతకలేడు.

భగవాన్ ఏమిటీ సమస్య? ప్రశాంతంగా, హాయిగా సాగిపోతున్న జీవితంలో ఈ తుపాను ఏంటి?

అమ్మని పంపించేయాలా? ప్రత్యూషని వదులుకోవాలా?

అమ్మ పెద్దదైంది. ఆవిడ జీవితం దాదాపు అయిపోయింది. చివరిరోజులు వెళ్లదీస్తోంది. అది ఎక్కడైనా వెళ్ళదీయొచ్చుగా. తనూ? ప్రత్యూషా ఇప్పుడే జీవితం ప్రారంభించారు. అమ్మకోసం జీవిత భాగస్వామితో తగవు భావ్యమేనా? ప్రత్యూషంటే ప్రేమ, అనురాగం, ఆరాధన ఇంకాచాలా...అమ్మంటే గౌరవం, భక్తి...మరి తనకు ప్రేమలేదా? కేవలం భక్తి, గౌరవాలేనా? అమ్మ తన సంతోషాల్ని, ఆనందాల్ని ఎన్నింటినో తనకోసం త్యాగం చేసింది. ఆత్మాభిమానం పణంగాపెట్టి తన భవిష్యత్తుకోసం అటెండర్ ఉద్యోగం చేసింది. అలాంటి అమ్మకోసం తను ఏదైనా చేయాలి. ఏం చేయాలి? ఆవిడకు ఏం కావాలి? పెన్షన్ వస్తుంది. ఆవిడ డబ్బు ఆవిడకుంది. ఈ ఇల్లు అమ్మదే. తనూ, ప్రత్యూషా వేరే ఇల్లు తీసుకుని వెళ్ళిపోవాలి! అవును అదే కరెక్ట్... అమ్మ ఇంట్లోంచి అమ్మని పంపించడం భావ్యం కాదు. ధర్మంకాదు, న్యాయం కాదు.

శశాంక్ ఒక దృఢమైన నిర్ణయానికొచ్చి ప్రశాంతంగా కళ్ళు మూసుకున్నాడు. నిద్ర పట్టేసింది.

గంట తరువాత గది బైటనుంచి తల్లిస్వరం వినిపించి నిద్రలేచాడు. నాన్నా శశీ ఎలా ఉందిరా? ఆవిడ స్వరంలో ఆదుర్దా. గుండెల్ని సూదుల్తో గుచ్చినట్టైంది శశాంక్‌కి.

మంచందిగి తలుపు తీసుకుని బైటకి వచ్చాడు.

గాభరానిండిన కళ్ళతో కొడుకువైపు చూసింది ప్రమీల. "ఎలా ఉంది నాన్నా? భోజనం కూడా చేయకుండా పడుకున్నావురా, మొహం కడుక్కురా అన్నం పెడతాను" ఆప్యాయంగా అంది కొడుకు చేయి పట్టుకుని.

"అలాగేనమ్మా" అంటూ బాత్‌రూమ్ లోకెళ్ళిపోయాడు.

డైనింగ్ టేబుల్‌మీద కంచంపెట్టి వేడి అన్నం, పప్పు, కూర వడ్డించింది. కొడుకు తీసుకెళ్ళాల్సిన లంచ్ క్యారేజీలో అన్నం తన కంచంలో పెట్టుకుంది. ఉదయం కొడుకు, కోడలికోసం మాత్రమే అన్నం వండి, మధ్యాహ్నం తనకోసం విడిగా గుప్పెడుబియ్యం వండుకుంటుంది. కూర, పప్పు, మాత్రం పొద్దున అందరికీ కలిపే చేస్తుంది. ఇవాళ మాత్రం శశాంక్‌కోసం మళ్ళీ వేడివేడి అన్నం వండింది.

శశాంక్ వచ్చి కూర్చోగానే నెయ్యి వేస్తూ అంది "ఆఫీస్‌లో చాలా పని చేస్తున్నట్టున్నావురా.. చేయాలి తప్పదు కానీ, ఆరోగ్యం సంగతి కూడా చూసుకోవాలి నాన్నా"

శశాంక్ గుండె ఆర్ద్రమైంది. అమ్మకి తనంటే ప్రాణం. తనకి తన భార్యంటే ప్రాణం. అమ్మంటే ఇష్టమే గానీ, అమ్మకోసం భార్యని వదులుకోలేడు.

భోజనం చేశాక, "బైటికెళ్ళొస్తానమ్మా, ప్రత్యూష వచ్చేసరికి వచ్చేస్తాలే" అంటూ వెళ్ళిపోయాడు.

బండి స్టార్ట్ చేసి రెంటల్ ఏజెన్సీని వెతుక్కుంటూ వెళ్ళాడు. వాళ్ళు చెప్పిన నిబంధనలు విని ఐదొందలు కట్టి పేరు రిజిస్టర్ చేయించుకున్నాడు.

"రెండు ఫ్లాట్స్ ఇప్పుడే చూపిస్తానుసార్ చూస్తారా" అడిగాడు ఏజెంట్.

"ఖాళీగానే ఉన్నాయా?"

"ఫస్ట్‌కి అవుతాయిసార్. మంచి ఫ్లాట్స్! నచ్చకపోతే వేరేది చూపిస్తా. ఇప్పుడున్న గుజరాతీ కపుల్ ఆస్ట్రేలియా వెళ్ళిపోతోంది".

"సరే చూపించు".

ఏజెంట్ హుషారుగా అడిగాడు, "మీ బండి మీద వెళ్దామాసార్ లేక నా బండి తేవాలా?"

'అవసరం లేదు రా కూర్చో" అంటూ బండి స్టార్ట్ చేశాడు శశాంక్.

ఏజెంట్ సూచనల ప్రకారం మెయిన్‌రోడ్ దాటి ఓ సందులోంచి కాలనీలోకి పోనిచ్చాడు.

ఐదు అంతస్తుల అపార్ట్‌మెంట్.

బండిదిగి ఇద్దరూ అపార్ట్‌మెంట్‌లోకి నడిచారు. లిఫ్ట్ఎక్కి నాలుగో అంతస్తులోకి వెళ్ళారు. ఒక ఫ్లాట్ ముందు ఆగి బెల్ నొక్కాడు ఏజెంట్. ఒక యువతి వచ్చి తలుపు తీసింది.

"ఫ్లాట్ చూసుకోవడానికి వచ్చారు మేడమ్" అన్నాడు ఏజెంట్.

యువతి అయిష్టంగానే పక్కకితొలగి "రండి" అంది హిందీలో.

లోపల విశాలమైనహాల్లో ఖరీదైన సోఫాలో కూర్చుని సీరియస్‌గా టీవీలో ఏదో సినిమా చూస్తున్నాడు ఆమెభర్త. ఆమె శశాంక్‌వైపు తిరిగి "వెళ్ళి చూడండి" అనిచెప్పి తనూ భర్త పక్కన కూర్చుని సీరియస్‌గా టీవీ చూడసాగింది.

ఇల్లు మొత్తం చూపించాడు ఏజెంట్. రెండు పడకగదుల ఫ్లాట్, ఆధునికంగా ఉంది. పెద్ద బాల్కనీ మంచి గాలీ, వెలుతురూ.

"అద్దె ఎంత?"

"అడుగుదాం సార్" అంటూ హాల్లోకి నడిచాడు ఏజెంట్.

"సార్ రెంట్ ఎంత?" అడిగాడు.



వాళ్ళు తలతిప్పి చూడలేదు. సమాధానం చెప్పలేదు.

అంత శ్రద్ధగా, ఆసక్తిగా వాళ్ళు చూస్తున్న కార్యక్రమం ఏంటో అన్నట్టు శశాంక్ టీవీవైపు చూశాడు. ఏదో పరభాషాచిత్రం. బ్లాక్ అండ్ వైట్.. వీపుమీద ఒక మూటలాపడుకున్న వృద్ధురాలిని మోసుకుంటూ ఒక బక్కచిక్కిన వ్యక్తి కొండమీదకి ఎక్కుతున్నాడు.

ఆ నటుణ్ణి చూస్తుంటే ఖచ్చితంగా భారతీయ భాషాచిత్రం కాదని తెలుస్తోంది.

"ఇది ఏ భాషాచిత్రం అన్నట్టు" ఏజెంట్ వైపు చూశాడు శశాంక్.

తెలీదన్నట్టు భుజాలెగరేశాడు ఏజెంట్. వాళ్ళు సమాధానం చెప్పకపోవడంతో మేడమ్ అంటూ మరోసారి పిలవబోతుంటే శశాంక్ వారించాడు ఆగు అన్నట్టు సైగ చేస్తూ.

ఇద్దరూ అలాగే నిలబడి ఆ జంటతోపాటే టీవీ చూడసాగారు.

ఆ బక్కచిక్కినవ్యక్తి కుమిలి కుమిలి ఏడుస్తూ ఆ వృద్ధురాలిని మోస్తున్నాడు. బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ నెమ్మదిగా వస్తోంది. ఆ సన్నివేశం చాలా విషాదంగా అనిపిస్తోంది. ఆ వ్యక్తిగానీ, అతని వీపుమీద ఉన్న వృద్ధురాలుగానీ ఏమీ మాట్లాడడం లేదు. కేవలం నేపథ్య సంగీతం, వాళ్ళ మూమెంట్... కొండలు, లోయలు, గుట్టలుగాపడున్న అస్థిపంజరాలు...! మరికొంత దూరంనుంచి మరో బక్కవ్యక్తి పరిగెత్తుకు వస్తున్నాడు. ఇంకోవృద్ధుడు భయంతో వణికిపోతూ అతనితో ఏదో అంటున్నాడు. ఆ వ్యక్తి అత్యంత క్రూరంగా ఆ వృద్ధుణ్ణి కొండమీంచి తోసేశాడు.

టీవీలో ఆ దృశ్యం చూస్తున్న యువతి కెవ్వుమని అరిచింది.

శశాంక్ తెల్లబోయాడు. సినిమా చూస్తూ ఇంతలా లీనమైపోతారా? అనిపించింది.

ఆ యువతి కన్నీళ్ళు తుడుచుకుంటూ హిందీలో అంటోంది. "పాపం, ఆ రోజుల్లో ఎలాంటి సంప్రదాయమో కదా! ఇప్పుడైనా ఆ సంప్రదాయం మారిందంటావా గౌరవ్?"

ఆ యువకుడిపేరు గౌరవ్ కాబోలు సమాధానం చెప్పాడు. "ఇప్పుడు మారకుండా ఎలా ఉంటుందిలే, కాకపోతే మనదేశంలో ఉన్నట్టే అక్కడ కూడా ఇంకా అణగారిన దురాచారాలు ఉండే ఉంటాయి, ఇంత దారుణంగా వృద్ధుల్నిచంపే ఆ సంప్రదాయం ఆ ఒక్క దేశంలోనే ఉంది".

వాళ్ళ సంభాషణ చాలా ఆసక్తిగా, కుతూహలంగా అనిపించింది శశాంక్‌కి.

"ఆ మూవీ పేరేంటి?" ఇంగ్లీషులో అడిగాడు శశాంక్.

ఇద్దరూ ఒక్కసారి వెనక్కితిరిగి సోఫావెనక నిలబడిన ఏజెంట్‌ని, శశాంక్‌ని చూశారు. అతనేదో అనబోతుంటే ఆ యువతి అరిచింది 'వెయిట్' అంటూ.. "చూశావా అతనికి వాళ్ళమ్మంటే చాలా ఇష్టం.. అందుకే భార్యమాట కాదనలేక వాళ్ళ ఆచారం ప్రకారం లోయలో పడేయడానికి తీసుకొచ్చి పడేయకుండా అక్కడ పడుకోబెట్టి వెళ్ళిపోతున్నాడు, పాపం చూడు ఎంత వేదన అనుభవిస్తున్నాడో, ఆమె యాక్షన్ చూడు ఎంత బాగుందో"

శశాంక్ టీవీవైపు చూశాడు.

ఆ వృద్ధురాలిని కొండమీద నిర్జనప్రదేశంలో వీపు మీంచిదింపి, కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు ఆ నటుడు. ఆమె అతికష్టంమీద నేలమీద ఏదో చాపలాంటిది పరుచుకుని మోకాళ్లమీద కూర్చుని కళ్ళు మూసుకుని చేతులు జోడించి ధ్యానంలోకి వెళ్ళిపోయింది.

అతను ఏడుస్తూ పరిగెత్తుకుని వెళ్ళిపోయాడు.

"ఓ గాడ్..హారిబుల్" అంటూ ఆ అమ్మాయి సోఫాలోంచి లేచింది. ఆమెతో అతనూ లేచి శశాంక్ వైపు తిరిగాడు.

"సారీ సార్.. మూవీ వెరీ ఇంట్రస్టింగ్....చాలా మూఢనమ్మకాలు, దురాచారాలు మనదేశంలోనే ఉంటాయి అనుకుంటాంగానీ, దేశదేశాల్లో జీవన విధానాలను అనుసరించి ఉండే మూఢనమ్మకాల గురించి తెలుసుకోవాలంటే విభిన్నమైన భాషా చిత్రాలు చూడాలి. బుక్స్ చదవాలి. ఇది ఒక కొరియన్ మూవీ సార్. చాలా పాతది. నా ఫ్రెండ్ ఒకతను చెప్పాడు ఈ మూవీ చూడమని. వాళ్ళ ఆచారం ప్రకారం వృద్ధులకి తిండిదండగ అని తొంభైఏళ్ళు రాగానే కొడుకులు వాళ్ళని తీసుకెళ్ళి ఆ కొండమీద నుంచి లోయలోకి పడేస్తారు. చూశారుగా ఆ అస్థిపంజరాలన్నీ వృద్ధులవే. కానీ, ఈ మూవీలో హీరో కొంచెం బ్రాడ్ అవుట్‌లుక్ ఉన్నవాడు, మనసున్నవాడు, దురాచారాల్ని ఖండించేవాడు. వాడికి వాళ్ళమ్మని అలా పడేయడం ఇష్టంలేదు. కానీ భార్య టార్చర్ భరించలేక తీసుకొచ్చి అలా వదిలేశాడు. చూడండి, కొండకిందకి వెళ్ళి తనుచేసింది పాపం అని తిరిగి వస్తాడు, కానీ ఈలోగా విపరీతంగా కురిసిన మంచులో ఆ తల్లి కూరుకుపోతుంది. ఆ దృశ్యం గుండెను కరిగించేస్తుంది సార్.. మా ఫ్రెండ్ సినిమా పిచ్చోడు. వాడికి భాషాభేదం, కొత్త పాత అనేమీలేదు. ఏదంటే అది చూస్తాడు. యూట్యూబ్‌లో వెతికి వెతికి చూస్తాడు.

అదిరే గుండెను చిక్కబట్టుకుంటూ స్వరంలో వణకు కనిపించకుండా శశాంక్ అడిగాడు, "మీరిది ఇప్పుడు యూట్యూబ్‌లో చూస్తున్నారా?"

"అవునుసార్.. నా దగ్గర క్రోమ్‌కాస్ట్ ఉంది. దాంతో వాడుచెప్పిన ప్రతి మూవీ చూస్తాం. ఆ చెప్పండి సార్ సారీ మిమ్మల్ని నిలబెట్టి మాట్లాడుతున్నా కూర్చోండి" అన్నాడు.

శశాంక్ వారిస్తూ, 'లేదు నేను అర్జెంట్‌గా వెళ్ళాలి వస్తాను" అన్నాడు.

"సార్ రెంట్ ఎంత?" ఏజంట్ అడుగుతుంటే శశాంక్ వారించాడు, "అవసరం లేదు. నాకు ఇల్లు అవసరంలేదు" అంటూ వేగంగా అక్కడినుంచి బయటకు వచ్చేశాడు.

వెనకనుంచి ఏజెంట్, 'సార్, సార్' అంటూ పిలుస్తున్నా వినిపించుకోకుండా లిఫ్ట్‌కోసం కూడా వెయిట్ చెయ్యకుండా రెండేసిమెట్ల చొప్పునదిగి బండి పార్క్‌చేసినచోటుకు వచ్చి బండిస్టార్ట్ చేస్తూ అనుకున్నాడు "యస్..భార్య వెళ్ళిపోతే మరోభార్య వస్తుంది. కానీ, అమ్మ గుండెపగిలి చనిపోతే మళ్ళీ వస్తుందా.."

**సెల్:99512 50144**

## సైనసైటిస్‌కు హోమియో చికిత్స

సైనసైటిస్...ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం.సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుంటుందని సైనసైటిస్ బాధితులు చెబుతుంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొందవచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్క అమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

1. **అక్యూట్ :** వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

2. **సబ్ అక్యూట్ :** 4నుంచి 8వారాలు ఉంటుంది.

3. **క్రానిక్ :** ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్‌ఫ్లూయెన్జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదెలా ఉన్నా సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్లీ రాకుండా నివారించవచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫీనాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి.

**కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశవ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షాకాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం.

**లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి, ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర, దగ్గు,జలుబు, చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు.

**నిర్ధారణ:** ఎక్స్‌రే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**దుష్పరిణామాలు:** ధీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియకపోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదలలోపాలు కలుగుతాయి.

**సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధపడుతున్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్లే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

1. ముఖబాగంలో నొప్పి - అవును / కాదు

2. తలనొప్పి - అవును / కాదు



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

3. ముక్కుదిబ్బడ - అవును/కాదు 4. చిక్కటి పసుపు, ఆకు పచ్చ ముక్కుస్రావాలు - అవును/కాదు. 5.జ్వరం (99-100 ఫారెన్‌హీట్స్) - అవును/కాదు. 6. నోటి దుర్వాసన - అవును / కాదు.. 7, పంటినొప్పి - అవును /కాదు.

**నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని చుట్టూ బురధ లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండకూడదు. ఎందుకంటే ఆనీళ్లు ముక్కు లోపలి దళసరిచర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్‌న్యూరియా, లెమ్‌నార్‌మైనార్, స్పైజీలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.

**www.starhomeopathy.com** | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | **© 90300 64224**

## సంతానలేమికి ఆధునిక పరిష్కారాలు

**మన దేశంలో ఎంతోమంది దంపతులు సంతానలేమితో బాధపడుతున్నారు. అందుకు పాశ్చాత్య సంస్కృతిలాగా రాత్రి పగలూ తేడా లేకుండా వృత్తిపనుల్లో బిజీగాఉండటం, సరైన వయసులో పెళ్లిళ్లు కాకపోవడం, మానసిక ఒత్తిడికి లోనుకావడం వంటివి హార్మోన్ సంబంధమైన సమస్యల్ని సృష్టిస్తున్నాయి. అయితే ఇవిపరిష్కారం లేని సమస్యలేమి కాదని, సరైన చికిత్స తీసుకుంటే లైంగిక సమస్యలు పరిష్కారం కావడమే కాక, సంతానం కలగడానికి కూడా అవకాశం ఉంటుందనిప్రముఖ వైద్యు రాలు డా॥జ్యోతి. ఫర్టీ 9 హాస్పిటల్‌లోని నిపుణులు దీన్నితేలికగావరిష్కరిస్తున్నారని కూడా ఆమె చెబుతున్నారు.**

చాలామంది స్త్రీలలో నెలసరి సమస్యలున్నా, భర్తకన్నా భార్య వయసు ఎక్కువగాఉన్నా, భార్యాభర్తలిద్దరూ సంతాన నిరోధక పద్ధతులేవీ పాటించకుండా సంవత్సరంకాలం పాటు ప్రయత్నించినాగర్భధారణకాకపోవచ్చు.మరికొంత మందిలోసంవత్సర కాలందాటినా అంటే, ఏళ్ళు గడుస్తున్నా గర్భధారణ కాకపోవచ్చు. **స్త్రీలు మాత్రమే బాధ్యులా?:** సంతానలేమితో బాధపడుతు న్నారంటే స్త్రీలలోనేలోపం ఉండవచ్చనే అపోహ చాలా మందిలో ఉంటుంది. కానీ సంతానలేమికి అసలుకారణం స్త్రీపురుషులిద్దరూ కావచ్చు. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికీ లోపం ఉన్నా గర్భధారణ కలుగకపోవచ్చు. పురుషులలో వీర్యకణాల ఉత్పత్తిలో లోపం ఉన్నా సంతానలేమికి దారి తీయవచ్చు. అదే స్త్రీలలో అయితే హార్మోను లోపం, థైరాయిడ్, పి.సి.ఓ.డి... ఇలా కొన్నిరకాల కారణాలుండవచ్చు. సాధారణంగా దంపతు లిద్దరూ ఏ విధమైన గర్భనిరోధక విధానాలూ పాటించ కుండా దాంపత్య జీవితం గడిపితే 5నెలల లోపే 50% మందికి గర్భం వస్తుంది. ఏడాది లోపు 75% మందికి గర్భం వస్తుంది. 2 సంవత్సరాల లోపు 90% మందికి గర్భం వస్తుంది. ఎవరికైనా ఇంతకాలం గడిచినా గర్భం రాలేదంటే ఏదో సమస్య ఉందనే భావించాలి. సమస్యను తెలుసుకోవాలని స్త్రీలుముందుకొచ్చి వైద్యపరీక్షలు చేయిం చుకుంటున్నా పురుషులు మాత్రం అందుకు సిద్ధంగా ఉండటం చాలాతక్కువ. **ఆకృతి కోల్పోయినా...** మన జీవన శైలితో పాటు కాలుష్యం, వాతావరణం, పొగతాగటం, మద్యం సేవించటం, బిగుతు దుస్తులు ధరించటం, అధిక బరువులు మోయటం, మానసిక ఒత్తిడి. కొన్ని రకాల మందులు ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపడం వల్ల పురుషులలో శుక్రకణాల సంఖ్య తగినంత లేకపోవడం, ఒకవేళ ఉన్నా వాటిలో చురుకుదనం లేక పోవటం జరుగుతోంది. వాటి ఆకృతి బాగా లేకపోయినా కష్టమే. కొందరిలో శుక్రకణాలు అసలు ఉండవు, స్త్రీలలో నెలసరి సమస్యలు, అండం విడుదల సరిగా లేకపోవటం లేదా విడుదలైన అండాలు నాణ్యంగా లేకపోవటం ప్రధాన కారణాలు. వయసు పెరిగే కొద్దీ గర్భస్రావాలయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. 30 సంవత్సరాలు దాటిన స్త్రీలలో సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. **సరైన పద్ధతులు:** 1. ఐ.యు.ఐ. 2.ఇక్సీ 3.ఐ.వి.ఎఫ్. **ఐ.యు.ఐ:** భర్త నుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి దానిలోంచి ఆరోగ్యంగా, చురుగ్గా ఉన్న కణాలను మాత్రం వేరుచేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టంద్వారా స్త్రీగర్భాశయంలోకి ప్రవేశపెడ తారు. ఇలా ఒక నెలలో చేస్తే 15 % వరకు సంతానం కలిగే అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్సా చేసినా ఫలితం లేకపోతే అప్పుడు ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించవచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుంచి సేకరించిన అండంలోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యులేటర్ సహాయంతో ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశ పెడతారు. ఈ పద్ధతి ద్వారా 40% వరకు విజయం సాధించవచ్చు. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఇదిమరింత ఉపయోగకరం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ బేబి విధానం అంటారు. ముందు స్త్రీ నుంచి పక్వమైన అండాలను బయటకు తీసి పురుషుడి శుక్రకణాలతోబయటేఫలధీకరణంచెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండులేదా మూడింటి ని తిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. దీని ద్వారా 30-35 శాతం ఫలితం పొందవచ్చు. ఇటీవల కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటులోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన పిండాలను అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటినే వాడటం జరుగుతుంది. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్ర కణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం జరుగుతుంది. వీటితోపాటు పిండాన్ని మరో స్త్రీగర్భాశయంలో పెంచే ఒక వినూత్నమైన 'సరోగసి' విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగటం లేదని ఏళ్ళ తరబడి బాధపడే కన్నా, ఎన్నో ఆధునిక పద్ధతులున్నా **ఫర్టీ 9 హాస్పిటల్** ' ని ఆశ్రయించటం ఎంతో శ్రేయస్కరం.

**- డా॥ సి.జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**

ADVT

**©90300 15588** | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । వరంగల్ | **www.ferty9.com**

# కాదేదీ తిండికనర్హం



**మంచి భోజనం అంటే వెంటనే గుర్తుకొచ్చేది ఓ పప్పు, ఓ కూర, ఓ పచ్చడి, సాంబారు లేదా చారు చివరగా పెరుగు లేదా మజ్జిగ. అదే మాంసాహారులయితే అదనంగా ఓ మాంసాహారంతో తయారు చేసిన కూర ఉంటుంది. నూటికి తొంభయి తొమ్మిదిమంది తినే భోజనం మెనూ దాదాపు ఇలాగే ఉంటుంది. మెనూలో వెరైటీలు తగ్గితే తగ్గవచ్చు లేదా పెరగనూ వచ్చు. మంచి భోజనం అంటే గుర్తుకొచ్చేది పై వెరైటీలే! కానీ ప్రపంచంలో కొంతమంది ఊహించడానికి కూడా వీలులేని పదార్థాలను ఆహారంగా తీసుకుంటున్నారు. వీరు ఇలాంటివి తినడం రికార్డు కోసమో, పేరు కోసమో కాదు. అవి వారి ఆహార అలవాట్లు. వాటి వలన ఆరోగ్యానికి ఇబ్బంది కలిగినా పెద్దగా పట్టించుకోవడం లేదు. అలాంటి ఆహార అలవాట్లున్న కొందరు వ్యక్తుల గురించి....**



## ఇటుకలు, కొండలే ఆహారం

కర్నాటకకు చెందిన పకీరప్ప హునగుండి(Hunagundi)కి ఓ వింత అలవాటు ఉంది. అదేమిటంటే... అతని ఆహారం ఇటుకలు, రాళ్ళూ రప్పలే. కొన్ని సంవత్సరాలుగా వాటినే తింటూ ఎంచక్కా జీర్ణం చేసుకుంటున్నాడు. అతడికి పది సంవత్సరాల వయస్సులో మట్టిని, ఇటుకలను తినాలనే కోరిక కలిగింది. ఒకరోజు సరదాగా వాటిని రుచి చూశాడు. అంతే.... అప్పటి నుంచి భోజనం సంగతి మరిచిపోయి వాటిని తింటూ కడుపు నింపుకుంటున్నాడు. రాళ్ళూ, రప్పలు, మట్టి తినే అలవాటు అతని కడుపు నింపడమే కాదు... అతని తల్లి కడుపుకూడా నింపుతోంది. ఎలాగంటే.... పకీరప్ప భవననిర్మాణ కూలీ. కానీ అతని అలవాటు కారణంగా అతనికి పని ఇవ్వడానికి అతని గ్రామంలో ఎవరూ ముందుకు రాలేదు. తండ్రి చనిపోవడంతో తల్లిని పోషించాల్సిన బాధ్యత కూడా అతనిమీద పడింది. తనలాగా తల్లిని కూడా రాళ్ళూ, మట్టిని తినమనలేడు కదా... అందుకే వాటిని తినడమే వృత్తిగా చేసుకున్నాడు. అతను రాళ్ళను కొరికి తింటూ ఉంటే చూడడం ఇతరులకు వినోదంగా మారింది. అతనిని చూడడానికి వచ్చిన వారు ఎంతో కొంత సొమ్ము ఇచ్చేవారు. రాళ్ళతో అతని కడుపు నిండితే, ప్రేక్షకులు ఇచ్చిన డబ్బులతో అతని తల్లి కడుపు నింపుతున్నాడు. గత ఇరవై సంవత్సరాలుగా వీటిని తింటున్నా పకీరప్పకు ఇంతవరకూ ఎలాంటి అనారోగ్యం ఎదురు కాలేదు. చాలా మంది ఇష్టంగా తినే మటన్, చికెన్‌ను చూస్తే ఆమడదూరం పారిపోతాడట!



## డియోడరెంట్ అంటే ఎంత మక్కువో!

న్యూయార్క్‌కి చెందిన నికొలె(Nicole)కు ఓ వింత అలవాటు ఉంది. రోజుకి ఒక డియోడరెంట్ స్టిక్ అన్నా తినందే ఆమెకు కడుపునిండినట్టు అనిపించదు. ఇలా తినడం ఎలా అలవాటయిందో తెలియదు కానీ ఎంతమంది ఎన్ని రకాలుగా చెప్పినా ఆమె మాత్రం వాటిని తినకుండా ఉండలేకపోతోందట! ఆఖరికి ప్రాణానికి ప్రాణం అయిన ఆమె బాయ్‌ఫ్రెండ్ కూడా వాటిని తినకుండా ఆమెను ఆపలేకపోయాడట! వీటిని తినడం వలన ఆమె ప్రాణానికి ముప్పు వాటిల్లవచ్చని వైద్యులు గట్టిగా హెచ్చరించడంతో డియోడరెంట్ స్టిక్‌లు కాకుండా డియోడరెంట్ లిక్విడ్‌ను కొన్ని చుక్కలను చప్పరిస్తోందట! ఎన్ని చుక్కలు చప్పరించినా స్టిక్‌లు తిన్న కిక్ రావడం లేదని నికొల్ వాపోతోంది. ఇప్పుడిప్పుడే బాదం పప్పులు తినడానికి అలవాటు పడుతోందట!



## సెల్లో టేప్ రుచి సూపర్

అంటోంది జార్జియాకు చెందిన ఆండ్రియా. దాదాపు పది సంవత్సరాల క్రితం సెల్లో టేపులు తినే అలవాటు మొదలయ్యిందట! ఓ రోజు ఏదో చదువుకుంటూ సరదాగా సెల్లో టేప్‌ను నోట్లో పెట్టుకున్న ఆండ్రియాకు ఆ రుచి మరి వదలబుద్ధి కాలేదు. ఏమాత్రం ఖాళీ దొరికినా సరే సెల్లో టేప్‌ను నోట్లో వేసుకుని చప్పరిస్తూ ఉంటుంది. నెల మొత్తం మీద దాదాపు ఆరువేల అడుగుల సెల్లో టేప్ తింటుందట! రోజుకి దాదాపు రెండు టేపులను తింటుందట! టేపులో ఉండే గమ్ అంటే చెప్పలేనంత మక్కువ అంటోంది ఆండ్రియా. ఇలా తినడం వలన ఆరోగ్య సమస్యలంటూ పెద్దగా రాలేదు. ఏవో చిన్న చిన్న సమస్యలు వస్తూనే ఉన్నాయట! అవేవీ సెల్లో టేప్ తినడానికి అడ్డు రాలేదట! మామూలుగా తీసుకునే ఆహారాన్ని తినడం మరిచిపోతుందేమో కానీ, సెల్లో టేప్‌ను తినడం మాత్రం మరిచిపోనంటోంది. సినిమా హాల్లోనూ, స్నేహితులతో మాట్లాడేటప్పుడు కూడా వీటిని చప్పరిస్తూనే ఉంటుందట!

## రబ్బరు టైర్లు ఎంత రుచో!

చాలామందికి చాక్లెట్ లేదా చూయింగ్ గమ్ తినే అలవాటు ఉంటుంది. వీటివలన ఆరోగ్యానికి పెద్దగా లాభం లేకపోయినా నష్టం మాత్రం రాదు. అట్లాంటాకు చెందిన అల్లిసన్‌కి మాత్రం రబ్బరు టైర్లు తినే అలవాటు ఉంది. వీటిని తింటూంటే బీఫ్ (గొడ్డు మాంసం) తింటున్న అనుభూతి కలుగుతుందట! ఇంట్లో ఎప్పుడూ ఓ చిన్న గిన్నె నిండా రబ్బరు టైర్ల ముక్కలను రెడీగా ఉంచుకుంటుందట! ఎప్పుడు తినాలని అనిపిస్తే అప్పుడు కొన్ని ముక్కలు చొప్పున తింటూంటుందట! అల్లిసన్ ఆరవ ఏట నుంచి వీటిని తినడం మొదలెట్టిందట! ఇప్పటివరకూ ఆమె కడుపులో ఎలాంటి సమస్యా తలెత్తలేదట! సాధారణంగా రబ్బరు అరగదు. కానీ ఆమె పొట్టను ఎక్స్‌రే తీసిన సమయంలో అక్కడ ఎలాంటి రబ్బరు ముక్కలు కనపడలేదట! కాకపోతే రబ్బరు తినడం వలన కేన్సర్ వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని డాక్టర్లు హెచ్చరించడంతో తినే పరిమాణాన్ని తగ్గించిందట! పూర్తిగా తగ్గించడానికి ఇంకా కొన్ని సంవత్సరాలు పట్టవచ్చుట! ఈ రబ్బరు ముక్కల రుచి మరి దేనికీ సాటి రాదు అన్నది అల్లిసన్ నమ్మకం.



## బంకమన్ను భలే ఇష్టం

అంటోంది కాలిఫోర్నియాకు చెందిన నటాషా! గత ఏడు సంవత్సరాలలో ఫేషియల్ మాస్క్‌లలో ఉపయోగించే బంకమట్టిని అరటన్ను దాకా తినేసింది. తడి బంకమట్టి కన్నా పొడి బంకమన్ను అంటే చాలా ఇష్టమట! రోజు మొత్తం మీద ఓ జార్ నిండా బంకమన్ను తినందే నిద్ర పట్టదట! ఇలా తినడం వలన ఆరోగ్య సమస్యలేవీ లేకపోయినా వైద్యులు మాత్రం ఈ అలవాటును మానుకోమని నటాషాకు చెబుతున్నారట! అందం కోసం, ఆరోగ్యం కోసం కొందరు బంకమట్టిని ఉపయోగిస్తుంటే నటాషా మాత్రం కడుపు నింపుకోవడం కోసం దీన్ని తింటోంది.



## గాజు గ్లాసులంటే ప్రాణం

ఒహియోకు చెందిన కమెడియన్ జోష్‌కు గ్లాసులు తినడం అంటే ప్రాణం! ఒకచోట చిన్న చిన్న గాజు ముక్కలను తింటున్న వారిని చూసి జోష్ ముందు భయపడ్డాడట! అలా తినడం వలన ఆరోగ్యానికి ఎలాంటి హాని జరగదని ఎవరో గట్టిగా చెప్పడంతో జోష్ కూడా తినడం మొదలెట్టాడట! మొదట్లో చిన్న చిన్న ముక్కలతో ప్రారంభం అయిన ఈ అలవాటు ఇప్పుడు పెద్ద పెద్ద గ్లాసులు, ట్యూబ్‌లైట్లు తినేవరకూ చేరుకుంది. ఇప్పటి వరకూ 250 బల్బులు, వంద గ్లాసుల వరకూ లాగించేశాడు. జోష్ అలవాటు తెలుసుకుని అతని గర్ల్‌ఫ్రెండ్ మొదట ఆశ్చర్యపోయినా, ఆ తరువాత భయపడిందట! ఈ అలవాటు మానిపించడానికి శతవిధాల ప్రయత్నించినా ఫలితం లేకపోయిందట. జోష్ తనను ముద్దు పెట్టుకోవడానికి వచ్చినప్పుడల్లా భయపడతానని అంటోంది. ఎందుకంటే అతను తిన్న గాజు పెంకులు ఏమైనా అతని నోట్లో ఉండిపోతే అవి తనకి ఎక్కడ హాని చేస్తాయోనని ఆమె భయమట! ఎవరు ఎన్ని విధాలుగా చెప్పినా జోష్ అలవాటు రోజు రోజుకీ పెరుగుతోందే తప్ప తగ్గడం లేదట!

## గోడపెచ్చులు గమ్మత్తుగా ఉంటాయి

గోడపెచ్చులు గమ్మత్తయిన రుచితో ఉంటాయి అంటోంది డెట్రాయిట్‌కి చెందిన నికొలె. చిన్నతనంలో గోడ మీద చాక్‌పీస్‌తో రాస్తున్న సమయంలో గోడపెచ్చులు కింద రాలి పడ్డాయట! అప్పుడే వాటి రుచి నికొలెకి తెలిసిందట! కిందపడిన గోడ పెచ్చులను తీసుకుని తినడంతో మొదలైన ఆ అలవాటు ఇప్పుడు ప్రత్యేకంగా పెచ్చులు తీసి తినేవరకు వచ్చిందట! తన ఇంట్లోనే కాకుండా చుట్టాలింటికి, స్నేహితుల ఇళ్ళకి వెళ్ళినప్పుడు కూడా ఈ అలవాటును కొనసాగిస్తుందట! రోజు మొత్తం మీద ఆరు సార్లయినా గోడను గీకందే ఉండలేనంటోంది.



## పసందుగా ప్లాస్టిక్ బ్యాగులు

పాతికేళ్ళ రాబర్ట్‌కి ప్లాస్టిక్ బ్యాగుల రుచి మహా పసందుగా ఉంటుంది. అన్ని బ్యాగుల కంటే కూడా నీలిరంగు బ్యాగుల రుచి బాగుంటుంది అంటాడు. ఈ విషయం తెలుసుకున్న అతని గర్ల్‌ఫ్రెండ్ ఈ అలవాటును మానిపించడానికి ఎన్ని విధాల ప్రయత్నించినా లాభం లేకపోయింది. వాళ్ళ ఎంగేజ్‌మెంట్ రోజు కేక్ కాకుండా ఓ ప్లాస్టిక్ బ్యాగ్‌ను తినడానికే ఇష్టపడ్డాడట! ఆఖరికి అతని అలవాటే అతని కొంప ముంచిందట! ప్లాస్టిక్ బ్యాగుల కారణంగా అతని లివర్ బాగా దెబ్బ తినడంతో వీటిని తినడం తగ్గించాడట కానీ పూర్తిగా మానలేదట!

## టాయిలెట్ పేపర్లంటే ప్రీతి

చికాగోకు చెందిన కెషాకు టాయిలెట్ పేపర్లంటే చెప్పలేనంత ఇష్టం! ఆమె ఆరోతరగతి చదువుకునే సమయంలో వాటిని రుచి చూసింది. ఇక అప్పటి నుంచి వాటిని వదిలి పెట్టడం లేదట! ఆమె ఎక్కడకు వెళ్ళినా టాయిలెట్ పేపర్ల బండిల్ ఆమె వెంటే ఉంటుందట! అన్ని ప్రదేశాలలో కన్నా సినిమా థియేటర్లలో వీటిని తినడం బాగుంటుంది అంటుంది కెషా. చీకట్లో ఎవరూ గమనించకుండా తినడం థ్రిల్లింగ్‌గా ఉంటుందట! కెషా అలవాటును గమనించిన ఆమె తల్లి, అక్క ఆమెకు ఎన్నో విధాల నచ్చచెప్పి ఈ అలవాటును మానిపించడానికి ప్రయత్నించినా ఫలితం లేకపోయిందట! నా అలవాటు నా ఇష్టం అంటూ వాటిని తినడం ఎక్కువ చేసిందే తప్ప తక్కువ చేయలేదట! వీటిని ఎంత తిన్నా ఇంత వరకూ ఎలాంటి ఆరోగ్య హాని జరగకపోవడంతో ఆమె తల్లి, అక్కా కూడా మౌనంగా ఉండిపోయారట!



–దేవి



# ప్రయాణం 6

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**మార్చి నెల వచ్చేసింది. చలి తగ్గిపోయింది. ఎండలోకి వెళితే కాంతే కాదు, వెచ్చదనమూ ఉంది. అయితే ఈ మార్చినెల నాలో కొత్త అందాలు తీసుకొచ్చింది. నేను గర్భవతిని అయ్యాను. 'వేవిళ్ళు' పేరుతో ఒకటే వాంతులు. గొంతు నొప్పి, నీరసంతో గదిలో ఓ మూల కంబళి కప్పుకొని పడుకోవడం. అయితే ఆ వాంతి చేసుకోవడంలో గొంతు చిట్లుతోంది కాబోలు రక్తం కూడా పడుతోంది. అలా రక్తం ఎందుకు పడుతుందో నాకూ తెలియదు. సరైన భోజనం లేకపోవడం వల్లనా? లేక ఇంకేమయినా శారీరక మార్పులు వల్లనా? మా తోటికోడలు ఛార్లెస్ భార్య ఫాగా నా భయాన్ని గమనించింది. "రాత్రుళ్ళు పాలు తాగు. అదే పోతుంది" అని సలహా ఇచ్చింది.**

ఇంట్లో రెండు ఆవులున్నాయి. ఈ రెండింటినీ అబ్రహం కొన్నాడు. దానిలో ఒక ఆవు పాలు ఛార్లెస్ కుటుంబం వాడితే రెండో ఆవు పాలు మా అత్తగారూ, మావగారూ, మరిదీ, నేనూ, మా ఆయనా వాడేవాళ్ళం. మా అత్తగారు ఇదంతా తెలుసుకుని మొత్తం పాలన్నీ కలిపి, నాకు కొంచెం పాలు ఇచ్చి మిగిలిన వాటిని కాఫీలకు, వెన్నకు ఉపయోగించేది.

నా ఆరోగ్యం కుదుటపడుతోంది.

అయితే ఫాగా, ఛార్లెస్‌కు ఏం చెప్పిందో తెలియదు. దారుణమైన చలికాలంలో అందరం ఆ పెద్ద ఇంట్లో ఉండడం, చలి తగ్గిన తరువాత ఎవరింటికి వారు అంటే ఐదారు మైళ్ల పరిధిలో ఉన్న ఇళ్లకు వెళ్లడం ఆనవాయితీగా కొద్ది సంవత్సరాలుగా నేను చూస్తున్నాను. ఇప్పుడు చలికాలం అయిపోయింది కదా! ఛార్లెస్ కుటుంబం మేం మా ఇంటికి వెళుతున్నాం అంటూ ఓ ఆవుని తోలుకు పోయారు. మా అత్తగారు మారు మాట్లాడలేదు. మరో పది రోజుల తరువాత "పద... మనమూ బయలుదేరుదాం" అన్నాడు అబ్రహం.

అబ్రహం ఎలాగూ కూలికి వెళతాడు. వారాంతంలో వస్తాడు. ఇక నేను ఒక్కదాన్నే ఇంట్లో ఉండాలి. తప్పదు. పైగా తొలిచూలు... అని నేను ఆలోచిస్తుంటే, ఆవును విప్పి ఆ తాడుతో అబ్రహం బయట నిలబడ్డాడు. మా అత్తగారు "ఇవిగో ఇవి మీ వాటా కోళ్లు" అని నాలుగు కోళ్లు తాడుతో కట్టి బుట్టలో పెట్టి నా పక్కనుంచింది.

నా జీవన పోరాటం మొదలయ్యింది కాబోలు అనుకున్నాను. వీటిని కనిపెట్టుకుంటూ వారాంతంలో వచ్చే అబ్రహం కోసం ఎదురుచూడాలి. అబ్రహం వెనక వీటన్నిటితో బయలుదేరాను.

అన్నీ బాగానే ఉన్నాయి గానీ, మాకు నీటి కొరతే తీరడం లేదు. గోతుల్లో నీళ్లు బాగున్నాయనుకుంటే వాటిలో పురుగులూ, గడ్డీ, నలకలూ ఉంటున్నాయి. తెచ్చుకొని వడకట్టి మరగపెట్టి తాగాలి. ఆ నీటి కోసమయినా ఐదారు మైళ్ల వెళ్లాలి. అబ్రహం ఈ మధ్యలో రెండు నూతులు తవ్వించాడు. లోతు 75 అడుగుల పైమాటే! నీరు పడలేదు. వట్టి బురద. ఆ బురదపై ఎప్పటికి మంచినీరు తేరేను?

వెతికితే రెండు మైళ్ల దూరంలో నీటి ఊట లాంటిది దొరికింది. అబ్రహం ఉన్న రోజు ఫరవా లేదు. లేకపోతే నేనే తెచ్చుకోవలసి వస్తోంది. నడుముకి తాడు కట్టుకుని దూరంగా లాగుతాను. ప్రస్తుతం నేను గర్భవతిని కాబట్టి అదీ కుదిరేలా లేదు.

కనీసం ఈ ఎండుగడ్డినయినా నరికి రోజుకొక పెద్ద మోపు తయారుచేసి ఇంటి చుట్టూ పేర్చాలనిపించింది. అదొక ప్రహరీగోడలా ఉంటూ, పెరుగుతున్న కోళ్లు అటూ ఇటూ పోవు. ముందు ముందు వంటచెరకుగా ఉపయోగించవచ్చు. అందులో కొంచెం పచ్చిది నరికితే పశువుకు మేతగా ఉపయోగిస్తుంది. కాలక్షేపం అవుతుంది. ఈ ఆలోచన ఆచరణలో పెట్టాను. రోజుకి రెండు కట్టల గడ్డిని నరికి తాడుతో కట్టి ఇంటికి తెచ్చి ఇంటి చుట్టూ పేర్చడం మొదలుపెట్టాను. ఒక వారాంతంలో వచ్చిన అబ్రహం ఇదంతా చూసి "అప్పుడప్పుడు ఆ గడ్డి వాలుల్లో పాములు పడుకుంటూ ఉంటాయి, చూసుకో. అవి ఆ గడ్డి రంగులోనే ఉంటాయి" అని బెదిరించాడు.

అప్పటి వరకూ హాయిగా పెద్ద పెద్ద కట్టలు కట్టి తెచ్చినదాన్ని, భయంతో చప్పుడు చేస్తూ నరకవలసి వస్తోంది. అలాంటి రోజుల్లోనే ఓ తమాషా జరిగింది. ఆ రోజు అబ్రహం వారాంతంలో ఇంటికి వచ్చేరోజు. ఇంట్లో సరుకులన్నీ ఇంచుమించు అయిపోయాయి. సరే! అబ్రహం ఇంటికి వస్తూ వస్తూ వారానికి సరిపడా దినుసులు తీసుకురాకపోవచ్చు. డబ్బాల్లో చూస్తే డబ్బా అడుగున కొద్దిగా బ్రెడ్ చేసుకునే పిండి, మరో సీసాలో దాన్ని పులియబెట్ట

డానికి ఈస్ట్ ఉంది. మరో సీసా నిండా బార్లీ గింజలున్నాయి. పైనున్న చెక్కబల్ల మీద గిన్నెలో వెన్న, ఆ పక్కనున్న గిన్నెలో కొద్దిగా పాలు ఉన్నాయి. ఎండ కాస్తోంది బయట. ఆ ఎండలో కొంచెం వెచ్చదనమూ ఉంది. ఇంట్లో ఉండి ఏం చేయాలి? తలుపు దగ్గరగా వేసి గొళ్లెం పెట్టి కత్తి, తాడు, తీసుకొని బయలుదేరాను ఎండుగడ్డి నరకడానికి. లెక్కచెయ్యలేదు గానీ చాలా దూరం నడిచాను. ఇటువైపు ఎప్పుడూ రాలేదు. మా ఇంటికి పడమరగా పల్లంగా ఉంటుంది. ఈ గడ్డి బీడులో గడ్డి సరిగ్గా ఎండలేదేమో! ఇంకా పచ్చి పచ్చిగా ఉంది. నేను ఆ గడ్డిని నరుక్కుంటూ వెళ్తోంటే ఆ పక్కనున్న దిబ్బమీద పుట్టగొడుగులు మొలకెత్తి విస్తారంగా కనపడ్డాయి. నాకొకటే ఆశ్చర్యం. మా మేనత్త ఇంట్లో ఉన్నప్పుడు ఆమె ఈ మష్రూమ్స్‌ని పాకెట్లలతో తెప్పించి వండించేది. అవి చాలా ఖరీదైనవని చెప్పేది. ఇప్పుడు అవి తాజాగా ఇక్కడ కనిపిస్తున్నాయి. ఇవి మంచివో, చెడ్డవో అంటే వాటిలో విషపూరితమైనవి కూడా ఉంటాయట. ఆలోచిస్తూనే కొన్ని మొగ్గలు తుంచి నోట్లో వేసుకున్నాను. రుచేం లేదు. చప్పగా ఉన్నాయి. కాస్సేపు ఆగాను వాటి ప్రభావం నా మీద ఏమన్నా పడుతుందేమోనని. ఏమీ లేదు!

వాటిని రెండుచేతుల్తో పీకి ఓ చోట కుప్పగా పోశాను. ఎండుగడ్డి నరికాను. తాడుతో మొత్తం ముడివేశాను. ఇక్కడ కొంచెం నీడలోనూ, పచ్చగా ఉన్న ప్రాంతాల్లోనూ అడవి వెల్లుల్లి దొరుకుతుంది. అంతా వెల్లుల్లి వాసన. మట్టిలోంచి జాగ్రత్తగా తెగిపోకుండా తీయాలి. వంటల్లో వాడితే మంచి రుచి వస్తుంది. ఇది మా అత్తగారు చూపిస్తే తెలిసింది. అవి ఇక్కడ విస్తారంగా కనిపిస్తాయి. అవీ కొన్ని పీకాను. నా ఒంటి మీద గౌను పైకెత్తి వాటిని కట్టి చివరలు నడుములో దోపాను. ఈ ఎండుగడ్డిని అవసరమనుకున్నప్పుడు వీపున చేర్చుకొని, కొంచెం ఇబ్బందిగా అనిపించినప్పుడు మైదానంలో ఉన్నట్లు లాగుతూ ఇంటికి చేర్చాను. రాగానే వడకట్టిన నీటిలో పుట్టగొడుగులు వేసి ఉడకపెట్టి వార్చి, అడవి వెల్లుల్లి ముక్కల్ని చేర్చి వంట పూర్తి చేశాను. తింటుంటే నాకే మంచి రుచి అనిపించింది. బార్లీ గింజలు ఉడకపెట్టి జావ చేశాను. కాఫీ, టీలకన్నా కూడా బార్లీ జావకు పాలు కలిపి ఇస్తే అబ్రహం ఇష్టపడి తాగుతాడు.

సాయంకాలం దీపాలు పెట్టే వేళకు పనులన్నీ పూర్తి అయిపోయాయి. అతని కోసం ఎదురు చూస్తూ కూచున్నాను. అబ్రహం చీకటి తెరలు కొద్దిగా పరుచుకుంటున్న వేళలో వచ్చాడు. రాగానే బార్లీ పాలు ఇచ్చాను. తాగుతూ ఇంట్లోంచి ఏమిటో మంచి వాసన వస్తోందే అనడం మొదలు పెట్టాడు.

నేను నవ్వాను.

ఏమీ చేయలేదని అబద్ధం చెప్పాను. చెక్క



బల్లలు అటూ ఇటూ సర్ది రెల్లు గడ్డితో కూర్చిన చీపురుతో గదిని ఊడుస్తూ ఉంటే ఇంకా కంగారు పడ్డాడు. ఎలాగైతేనేం భోజనాల వేళకు నేను చేసిన బ్రెడ్, పుట్టగొడుగుల కూరతో వెన్న వడ్డించాను. అడవి వెల్లుల్లి వాసన ఘుమఘుమలాడింది. బ్రెడ్ తింటూ దాని రుచి ఆస్వాదిస్తూ అబ్రహం ముఖ కవళికలు చూడాలి. ఈ పూట భోజనం ఎంతో బాగుందని ఒకటే పొగడ్తలు. పుట్టగొడుగులు ఎలా దొరికాయో, నేను ఎలా వండానో మొత్తం సరదాగా వివరించి చెప్పాను. పొంగిపోయాడు. దగ్గరికి తీసుకొని ముద్దులతో ముంచెత్తాడు. “నువ్వు నా దేవతవు” అన్నాడు. భోజనాలు పూర్తయిన తరువాత బల్లల మీద కూచుని తీరిగ్గా ఆ కబురూ, ఈ కబురూ చెప్పుకున్నాం. ఇక నిద్రపోతాడనగా బార్లీతో చేసిన కాఫీ ఇచ్చాను. ఇంకా ఇద్దై పోయాడు. ఇన్ని సంవత్సరాలయినా నా గుండెల్లో గుర్తుగా ముద్రపడడానికి అదే కారణం! ఇదంతా తలుచుకుంటే నిన్నా మొన్నా జరిగినట్టు ఉంటుంది.

ఆ రోజు అలా హాయిగా గడిచింది.

మామూలుగానే తెల్లారింది. కానీ, రాత్రి డిన్నర్ తరువాత గడిపిన మధుర క్షణాలు నా గుండెలోంచి దూరంగా పోలేదు. నా శరీరంలో మార్పులు మొదలయ్యాయి. పొట్ట భాగం పెద్దదవుతోంది. బుగ్గలు పెద్దవి అవుతున్నాయి. అయితే నాకు మరో సాయం లేదు. వారాంతంలో వచ్చే అబ్రహం తప్ప నన్ను పలకరించే వారు లేరు. నీరసం వచ్చినా మరొకటి అయినా నేనే వండుకోవాలి. తినాలి. మా అత్తగారు చూస్తే చలికాలంలో తప్ప అందరం ఒకచోట గడపలేని పరిస్థితి. ఒకరోజు ఇదంతా తలుచుకొని చాలాసేపు ఏడ్చాను. అయితే నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను. ఇలాంటి చోట్ల మొండిగా బతకాలి. చాలా ధైర్యంగా ఉండాలి. భగవంతుడిని నాకు సాయం చేయమని సబ్బత్ రోజున దీపం వెలిగించి ఆ పక్కనే చాలాసేపు ప్రార్థన చేసుకున్నాను. నేను తల్లినయ్యేలోగా ముందు ముందు కాలానికి అనుగుణంగా పొయ్యిలోకి వంటచెరకును ముందుగా పోగెయ్యాలనుకున్నాను. అలాగే చేశాను. ఇంట్లో ఆవుంది, వెన్న తీసి దాయడం మొదలుపెట్టాను. వాడుకునే నీళ్లకే ఇబ్బందిగా ఉంటోంది. అబ్రహంను నూతి తీయించడంలో ఆలస్యం చేయవద్దనీ, వీలయినంత త్వరగా ఆ

ఏర్పాటు చేయమని చెప్పాలని నిర్ణయించుకున్నాను. ఇవన్నీ పక్కనపెడితే ఇంటి సంగతి చూడాలి. ఇల్లు ఏదో కాస్త విశాలంగా కనిపిస్తున్నా అంతా పాత కొంపలాగా కనిపిస్తోంది. ముందు దీని పని చూడాలి. వారాంతంలో ఇంటికొచ్చిన అబ్రహంకు నా ఆలోచనలు చెప్పాను. అబ్రహం సరేనన్నాడు.

చలిగాలి ప్రవేశించకుండా ఆ కిటికీల పైనున్న రేకులు ఇంటికప్పు రేకులు బిగించడం, అలాగని ఇల్లంతా చీకటిగా ఉండకుండా చిన్న చిన్న కిటికీలు ఏర్పాటు చేసుకోవడం వంటివి. ముందు ఆ పని చూడాలని అబ్రహంతో మేకులు, బల్లలు,

**అత్తగారు పాతకాలం మనిషి. ఆచారాలు, పద్ధతులు తుచ తప్పకుండా పాటించే మనిషి. తనకు తెలిసినవి చేస్తూనే, తెలియనివాటి గురించి, ఆ గడ్డిమైదానంలో అక్కడక్కడా ఉండే తమవాళ్ళని అడిగి మరీ తెలుసుకుని పాటిస్తుంది. కోడలు డెలివరీ అయింది. డెలివరీ అయిన కొన్ని గంటలకే అత్తగారు తనింటికి వెళ్ళిపోయింది. వెళ్ళేటప్పుడు ఆమె ఆ పసిదాని తలవైపు మంచం మీద ఓ పుస్తకం పెట్టి వెళ్ళింది. ఇంతకీ ఆమె ఎందుకలా చేసింది? ఆ పుస్తకం ఏమిటి?**

రేకులు తెప్పించడమే కాదు, దగ్గరుండి ఇద్దరం ఒకరికొకరు సలహాలు ఇచ్చుకుంటూ ఆ పని పూర్తి చేశాం. మరిది మోసెస్‌వస్తే అతని సాయంతో మెత్తని ఒండ్రుమట్టిని తెప్పించాను. దాన్ని ఇంకా కాళ్లతో కుమ్మించి ఇల్లంతా చాలా చోట్ల మెత్తాను. కొన్ని చోట్ల అలికాను. అది ఆరిపోయిన తరువాత అబ్రహం తెల్ల సున్నం తెస్తే ఇంటా బయటా నాకు చేతనయినట్టు గడ్డిపోచల్ని చీపురుగా చేసి వెల్లవేశాను.

ఈ పనులన్నీ చేయడానికి ఆ పరమాత్మ కృప కూడా తోడయిందేమో! ముందుగా భయపడినట్టు నాకు నీరసమూ రాలేదు, అనారోగ్యమూ రాలేదు. నేను కోరుకున్నట్టు అన్ని పనులూ చేసి ఇల్లంతా చూసుకుంటే ఎంతో వెలుతురుతో హాయిగా, తృప్తిగా అనిపించింది. ఒకరోజు మా అత్తగారు వచ్చారు. సున్నం వేసిన గోడలూ, శుభ్రమైన నేలా చూసి ఒక్కదానివే చేశావా ఇదంతా అని ఆశ్చర్యపోయి, హాయిగా నవ్వుతూ నేనిలా ఎప్పుడూ చేయలేకపోయానని నిట్టూర్చింది. నాకూ ఆనందమేసింది. అబ్రహం మరో మంచి ఆలోచన చేశాడు. రెండునెలలకు యాభై డాలర్లు వచ్చే మరో ఫారంలో చేరాడు. రాబోయేవి చలికాలం రోజులు, పైగా ప్రసూతి రోజులు అని ఆలోచించాడు కాబోలు వచ్చిన డబ్బుతో టన్నున్నర బొగ్గు, నూట యాభై పౌండ్లు పిండి, ఇరవై అయిదు పౌన్ల పంచదార, కొద్దిగా బ్రెడ్‌లో కలుపుకునే ఈస్ట్ సిద్ధం చేశాడు. సరిగ్గా అది 1895–96వ సంవత్సరం. చలికాలం ప్రవేశించే ముందు



## ఆ ఒక్క పనికి 30 లక్షలా?

*ఇందులో విపరీతార్థం ఏమీ లేదు. అంత మొత్తం డిమాండ్ చేసింది ఎవరో కాదు. నయనతార! ఎందుకు చేసిందంటే....సామాన్యంగా నయనతార సినిమా ప్రమోషన్లకి రాదు. ఆ కండీషన్ ముందే చెప్పేస్తుంది. కానీ గోపీచంద్, నయనతార కాంబినేషన్‌లో వస్తున్న 'ఆరడుగుల బుల్లెట్' సినిమాకి నయనతారతో ప్రమోషన్ చేయించాలని దర్శకనిర్మాతలు భావించారట! వాళ్ళు ఇదే మాట నయనతారతో చెబితే 30 లక్షలు ఇస్తే వస్తానని అందట! కాకపోతే ఈ మొత్తం ఒక్కరోజుకా? ప్రమోషన్ మొత్తానికా? అన్నదే తెలియడం లేదు. నయనతార చెప్పిన మొత్తం వినగానే వచ్చిన వారికి కళ్ళు తిరిగినంత పనయి వచ్చిన దారినే వెళ్ళిపోయారట! ప్రస్తుతానికి నయనతార లేకుండానే పని కానిచ్చేస్తున్నారట!*

## ఆ ఇద్దరూ విడిపోతున్నారట!

ఆలియా, సిద్ధార్థ్ మల్హోత్రాలు ప్రేమించుకుంటున్న సంగతి బాలీవుడ్ జనాలకు తెలిసిన విషయమే! ఈ విషయం తెలిసి కూడా జాక్వెలిన్ ఫెర్నాండెజ్ సిద్ధార్థతో చనువుగా ఉంటోందట! వీరిద్దరి వ్యవహారం ఆ నోటా, ఈ నోటా పడి చివరికి ఆలియా వరకూ వెళ్లిందట! దాంతో లవర్‌కి వార్నింగ్ ఇవ్వలేక ఆలియా జాక్వెలిన్‌కి గట్టి వార్నింగ్ ఇచ్చిందట! అయినా జాక్వెలిన్‌లో ఏ మార్పూ రాకపోయేసరికి సిద్ధార్థ్‌కి బైబై చెప్పెయ్యాలని ఆలియా గట్టిగా నిర్ణయించుకుందట! తెలిసి తెలిసి ఇద్దరు ప్రేమికులను విడగొడుతున్న జాక్వెలిన్‌పై బాలీవుడ్‌లో చాలామంది కోపంగా ఉన్నారట కూడా!



రోజులు. నాకు నెలలు నిండుతున్నాయి. నా అవస్థ అబ్రహం గమనిస్తున్నాడు. "రేపో మాపో నాకు బిడ్డ పుట్ట వచ్చు. నువ్వు మీ అమ్మగారిని తీసుకొస్తే మంచిది. నువ్వు కూడా పనికి వెళ్లకుండా ఓ నాలుగు రోజులు ఇంటి వద్దే ఉంటే ఇంకా మంచిది" అన్నాను.

అబ్రహం అదే ఆలోచనలో ఉన్నట్టున్నాడు. నవ్వాడు. మా అత్తగారు వచ్చింది. ఎంతో బల వంతం చేస్తే ఆమె వచ్చిందట. "నాకు చాలా పను లున్నాయి" అని అనడం మొదలుపెట్టింది గుమ్మం లోకి వస్తూనే. ఆమె వచ్చిన పదిరోజులకు ఒక శని వారం ఉదయం తెల్లవారుజామున నాలుగ్గంట లకు నా మొదటి బిడ్డ 'మిన్ని'ని ప్రసవించాను.

ప్రసవవేదన అంతా ఇంతా కాదు. దాని తరు వాత కలిగే ఆనందం మధురమైనదే కావచ్చు. ఒకటే ఒళ్ళునొప్పులు... ఆ బాధతో మంచం మీదే ఉండిపోయాను. అబ్రహం చాలా సాయం చేశాడు. పురిటి బిడ్డను శుభ్రం చెయ్యడమేకాదు బొడ్డు తాడు అతనే కత్తిరించాడు. ఈలోపు మా అత్తగారు బ్రెడ్‌తో పాటు బార్లీ జావ వేడిగా తయారుచేసి నా ఎదురుగా బల్లమీద పెట్టి 'నేను వెళతాను' అంది. అప్పుడు టైము పదకొండు గంటలయ్యింది. నేను బిడ్డను కని ఏడు గంటలయింది. ఆ వేడి ద్రావ కాన్ని, అదే బార్లీ జావను రెండు గుక్కలు తాగానో లేదో అబ్రహం అన్నాడు నేనూ పనిలోకి వెళ్లాలని.

నాకు ఏడుపొచ్చింది. ఈ గడ్డి బీడులో నేనూ, కళ్లు తెరవని బిడ్డా మిగిలామన్నమాట!

"మా అత్తగారికి వాళ్ల అత్తగారు ఇలాగే చేసి ఉంటుందా?" కళ్లు ఎత్తి చెక్క మంచం వైపు చూస్తే కొన్ని గంటల క్రితమే ఈ లోకంలోకి వచ్చిన నా మిన్నీ నా పాత స్కర్ట్‌లో చుట్టబడి నిశ్శబ్దంగా ఉంది. ఇప్పుడు నేను ఎవరి మీద అలగను? ఎవ రిపై కోపం తెచ్చుకోవాలి? నాలో నాకే రోదన మొదలయ్యింది. ఏడ్చి నేను చేసేదేముంది గనుక.

ఆ ఎండుగడ్డి మైదానానికి అడ్డంపడి వెళ్లిపో తున్న మా అత్తగారు, నాపై ప్రేమతో తిరిగి రావా లని ఆ పరమాత్ముని మనసారా ప్రార్థించాను. లేని సత్తువ తెచ్చుకుని నా బిడ్డ పడుకున్న చెక్క మంచం వైపు కదిలాను. ఇక్కడ మా అత్తగారి గురించి రెండు ముక్కలు చెప్పాలి. అసలు మా మావగారు ఏం పనిచేసేవారో తెలియదు. వీరంతా నాలాగే ఉక్రెయిన్ దేశం నుండి వచ్చినవారే. ప్రస్తుతం మాత్రం ఏ పనీ చెయ్యడం చూడలేదు. ఆయన ఏదో మూల చేరి 'ఆం' 'ఊ' అంటేనో లేక దగ్గి తేనో అక్కడ ఆయన ఉన్నట్టు తెలుస్తుంది. కొడుకులు ఏమన్నా సలహా అడిగితేనే చెబుతాడు. అదీ మెల్లగా! లేకపోతే లేదు.

ఆయనకు కావలసినవన్నీ మా అత్తగారే చూసుకుంటుంది. ఇక మా అత్తగారు బాగా పాత కాలపు మనిషి అని తెలిసిపోయింది. ఆమెకు జ్ఞాపకం ఉన్నవి పాటిస్తూనే ఈ గడ్డిభూముల్లో అక్కడక్కడా ఉన్న మా యూదు కుటుంబాల్లో ఆమె వయసు వారినందర్నీ 'మన పద్ధతులేమిటి?' అని ప్రశ్నించి వాడుకలో పెట్టే మనిషి. ఆ నమ్మ కాలు ఒక్కోసారి నాలాంటి వారికి ఇంకా భయాన్ని, అనుమానాన్ని కలగచేస్తాయి.

నేను చూడనేలేదు. నాకు డెలివరీ అయి ఒళ్లు నొప్పులతో నేను బాధపడుతుంటే, మా అత్తగారు, నేను వెళ్తున్నాను, అక్కడ బోలెడు పనులున్నాయి అని చెప్పింది కదా! ఆమె వెళ్తూ వెళ్తూ నా చెక్క మంచం మీద తల వైపు పాత అట్టలో చిరిగి ఉన్న ప్రార్థనా పుస్తకాన్ని ఉంచింది. అటువంటి పుస్తకం గురించి అంతకు ముందు నాతో చెప్పినట్టు గుర్తు. ఆ పుస్తకాన్ని అలా పురిటి మంచం మీద తలవే పుగా ఉంచితే "చీడపీడలు పసిపిల్లల్ని ఏం చెయ్య లేవు. ఆ పుస్తకాన్ని బాలింత చదివితే ఇంకా మంచిది." బాగానే ఉంది గానీ మా అత్తగారికి చదువు రాదు. ఇంకా ఆ పుస్తకంతో పాటు కత్తి కూడా ఉంచితే ఇంకా మంచిది. ఇంకా అది ఎందుకు తేలేదో తెలియదు. ప్రస్తుతం నేను ఒంటరి దాన్ని. పసిదానికే కాదు, చీడపీడల నుంచి నాకే రక్షణ లేదు.

నా ప్రార్థనలు ఫలించాయి.

రాత్రి ఈ పసిదానితో ఏ మాత్రం అనుభవం లేని నేను ఎలా గడపాలో అని భయపడుతూ ఆలోచిస్తోంటే సూర్యాస్తమయం వేళకు మా అత్త గారు వచ్చింది. ఆమె సంచిలో బ్రెడ్డు, పాలచెంబు ఉన్నాయి. ఆమె రాకపోతే ఒకటే సమస్య. ఇప్పు డీమె వచ్చిన తరువాత మరికొన్ని సమస్యలు.

తెచ్చిన ఆవుపాలు మరిగించి ఈ పసిదానికి పడుతుంది కాబోలు అనుకున్నాను. పాలచెంబు లోని పాలు పెద్ద గిన్నెలోకి వంపి మరగబెడు తుంటే,

"ఇంకా వెలుతురుంది. బిడ్డకు పాలు పట్ట కూడదు. ఇప్పుడిప్పుడే సబ్బత్ ఘడియలు (సాయం సమయం వేళలు ముఖ్యంగా ఆకాశంలో చుక్కలు కనపడ్డం) రాలేదు కదా!" అంది.

ఉదయం పుట్టిన బిడ్డ అది.

సాయంకాలం అయ్యింది. సూర్యుడు దిగి పోయాడు. బయట వాకిట్లో వంటచెరకుగా నేను కోసి పేర్చిన ఎండుగడ్డి ఉంది. ముందుచూపుగా ఆ పనిచేశాను.

"నీళ్లు కాసిన్ని మరగపెట్టండి. చల్లార్చి ఈ పసిదీ, నేనూ తీసుకుంటాం. ఎక్కువగా నీరుంటే చంటిదాన్ని మరోమారు శుభ్రం చేస్తానని" చెప్పాను.

మా అత్తగారు నేను చెప్తున్న మాటలు వింటూ, ఎండుగడ్డి ఇంత పొయ్యిలో వేసి, నీళ్ళు పొయ్యి మీద పెట్టకుండా బయటకెళ్లింది. వెళ్లిన

మనిషి చాలాసేపటి వరకూ రాలేదు. విషయమే మంటే ఆకాశంలో చుక్కలు రాలేదని వాటిని వెతి కానని చెప్పింది. చివరకు ఎలాగైతేనేం ఆమె అను కున్నట్టే ఆ దిశలోనే చుక్కలు కనిపించాయట. ఆరి పోతున్న పొయ్యిలో మరో ఇంత ఎండుగడ్డి వేసి నీరు, మరోమారు పాలు వేడిచేసింది. చివరకు నీటిని చల్లార్చి కొద్దిగా నేను తాగి దాహం తీర్చు కున్నాను. పాపను వేడి నీటితో శుభ్రం చేసి నాలుగు పాలచుక్కలు పట్టాను. ఇక ఈమె నాకోసం, తన కోసం వంట మొదలుపెట్టింది. ఇంట్లో ఉన్న 'లైగ్లాచ్'(నూడుల్స్) వేడినీటిలో నాన బెట్టి, పాలతో ఉడికించింది. ఎండు మాంసం పాన్‌లో వేసి వేపుడు చేసింది. చేసిందే గానీ అది మాడు వాసన వస్తోంది. ఏదో ఆ పూట భోజనం అయ్యిందనిపించాను.

నూడుల్స్‌తో ఆకలి తీరింది. చూస్తుండగానే చీకటి పడింది. బయట నక్కలు ఊళపెడు తున్నాయి. ఇక నిద్రపోవాలి. మా అత్తగారు మరో సమస్య తెచ్చింది. ఆ రాత్రి చలి ఎక్కువగానే ఉండే ట్టుంది. నేను బల్లమీద పడుకుంటే, మా అత్తగారు, "ఫైర్ ప్లేస్‌కు దగ్గరగా (రాత్రిపూట వెచ్చదనం కోసం గది చివర నిప్పులు సిద్ధం చేసి ఉంచుతాం. మధ్యరాత్రిలో తెలివి వచ్చినప్పుడు అందులో మరి రెండు బొగ్గులు వెయ్యడం అలవాటు) పడుకో వద్దు. చంటి పిల్ల ఉంది. బాలింతవు. దూరంగా గడ్డిపరచుకొని, దానిపైన ఏదన్నా ఉన్ని దుప్పటి వేసుకొని పడుకో. కప్పుకోడానికి ఇవి చాలు" అంటూ ఓ పాత కోటు, జనపనారతో నేసిన గోనె గుడ్డ ఇచ్చింది.

చంటిగుడ్డుతో తెల్లవార్లూ నా పాట్లు చూడాలి. మెత్తనిదీ, వెచ్చనిదీ అయిన పక్క లేదు. కంటి నిండా కునుకు లేదు. మెత్తని చిన్న దుప్పటిలో పసి దాన్ని చుట్టి దాన్ని తిరిగి నా కడుపుకి దగ్గరగా పెట్టుకొని ఒక చేత్తో గడ్డి గుచ్చుకోకుండా వత్తుతూ పడుకున్నాను.

అసలు విషయమేమంటే అబ్రహం పాప బొడ్డుతాడుని కత్తిరిస్తున్నప్పుడు దగ్గరగా కత్తిరించ వద్దు. పెద్దదిగా ఉండాలన్నది ఈమె. అది నిజమే అనుకొని అతను అలాగే కోశాడు. ఆ బొడ్డుతాడు ఏమన్నా ఒత్తిడి తగిలితే బిడ్డ ఏమయిపోతుందో అన్నది నా భావన, భయం.

మరో రెండు రోజుల తరువాత అబ్రహం చేస్తున్న పనిని వదిలేశాడు.

మాకు దూరంగా కనీసం ఐదుమైళ్ల దూరంలో ఉన్న మంచినీటి గొయ్యి ఎండిపోయింది. ఆ నీటిలో దుమ్మూ ధూళీ తక్కువగా ఉండేవి. పైగా తోడుకో వడం సులువు. సరే మా ఇంటికి దగ్గర్లోనే ఉన్న మరో గోతిలో ఇంకా నీళ్లున్నాయి. అయితే ఇందులో పురుగులూ, ధూళీ ఎక్కువ. వేగన్ బండిలో ఓ పూట తెచ్చుకుంటే రెండు రోజులు వస్తాయి. అబ్రహం ఎలాగూ చేస్తున్న పని మానే శాడు కదా! వచ్చాడు. మా అత్తగారు నీళ్ల లేవని చెప్పారు కాబోలు ఇంట్లోనూ, బయట, వాకిట్లో ఉన్న టబ్బులలోనూ నీరు నింపాడు. మా మిస్నీ వేడిచేసి చల్లార్చిన ఆ నీటినే తాగింది. మూడో రోజున నాకు చనుబాలు పడ్డాయి. అయితే ఎందుకో నా ఒంట్లో బాగా లేదు. ఒళ్లంతా ఒకటే నొప్పులు. జ్వరంగా ఉంది. ఈ విషయం మా అత్త గారికి చెప్పాను. ఆమె గిన్నెలో నిప్పులు తెచ్చి ఉన్ని గుడ్డలో నాకు నొప్పులు ఉన్న చోట కాపడం పెట్టింది. కొంత హాయిగా ఉంది. అయితే ఆమె సడన్‌గా బయటకు తొంగి చూసి నేను వెళ్లాలి. ఆ ముసలాయన ఏమయిపోయాడో అని బయలుదే రింది.

అయితే వెళుతూ వెళుతూ మరో సమస్యని నా చెవిలో వదిలి వెళ్లింది. సహజంగానే నాలో ఉన్న భయం రెండింతలయ్యింది. "మరిచిపోయాను. మొన్న పుస్తకం తెచ్చినప్పుడే కత్తి తేవలసింది. అది నీ మంచం మీదే ఎప్పుడూ ఉండాలి. లేకపోతే చీడ పీడలు నిన్నూ, నీ బిడ్డనూ తినేస్తాయి. రేపు వచ్చే టప్పుడు కత్తి తెస్తాను. అది నీ బొడ్లో, బెల్టులో దోపుకుని తిరుగు. నీకేం భయం లేదు" అని చెప్పింది. అలా తిరగని వారికి ఎలా ఎలా జరి గిందో వివరించింది.

కొత్త సమస్య ఏది వచ్చినా, నాకు నేనే ధైర్యం తెచ్చుకుని మసలే నాకు ఇదొక పిరికి మందు. దగ్గర్లో భర్త లేడు. పనుల కోసం వెతుక్కుంటు న్నాడు. ఇరుగు పొరుగు అసలే లేరు.




గజగజ వణికిపోయాను. ఆమె వెళ్లిపోయింది. మరో రెండు రోజుల వరకూ పత్తాలేదు. ఇంట్లో పనులు చేసుకుంటూ పశువుల గదిలోని ఆవు చేసిన రొచ్చును శుభ్రం చేసి, దానికి మేతా, నీరూ పెట్టి, వీలు చిక్కినప్పుడల్లా చెక్క మంచం మీద ఉన్ని రగ్గులో నిద్రపోతున్న మిస్నీని చూసు కుంటూ, మిస్నీతో పాటు ఆ ప్రార్థనా పుస్తకం పక్క నుందో లేదో చూసుకునేదాన్ని. కత్తి ఎలాగూ నా నడుము దగ్గరే ఉంది. కాబట్టి మరోమారు దాన్ని వేళ్లతో తడమడం ధైర్యం తెచ్చుకోవడం చేశాను. ఇలా అయితే బాగానే ఉంది. వంటగదిలో బల్ల మీద డబ్బాలు తెరిస్తే తిండి గింజలు లేవు. మరో గిన్నెలో కొంచెం సోయా పిండి, మరో సీసాలో కొంచెం ఈస్ట్ మాత్రమే ఉన్నాయి.

అబ్రహం ఏమయ్యాడో తెలియదు. వస్తున్నట్టు ఏ జాడా లేదు. వీరిద్దరూ ఒకటి రెండు రోజుల్లో రాకపోతే మరొక పని మాత్రమే చెయ్యాలి అని నాకు నేనే ధైర్యం తెచ్చుకున్నాను. అది ఇంట్లో ఆవు ఉంది. ఇక ఈ రెండు రోజులూ దాని పాలే తాగి బతుకుతాను. ఇన్ని పాలు నా బిడ్డకూ పడతాను. అంతే! ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం ఉంటూనే ఉంటుంది. మనం ధైర్యంగా వెతుక్కోవడంలోనే ఉంది అంతా! మా అత్తగారు ఓ సాయంకాలం వేళ పెద్ద సంచితో వచ్చింది. పాపకు పాలిచ్చి నేను కొన్ని పాలు తాగి గ్లాసు కడుగుతున్నాను. నాకు దగ్గరగా వచ్చి నా మొల దగ్గరున్న బెల్టును కొద్దిగా వదులు చేసి కత్తిని సరిగ్గా దోపింది. ఈ రెండు రోజులూ ఎలా గడిపానో చెప్పాను. గది మూల నున్న గొడ్డలిని చూపుతూ రాత్రిపూట దాన్ని నా మంచం కింద దాస్తున్నానని చెప్పాను.

ఆమె నా హీరోయిజానికి మెచ్చుకుంది. మరు సటి రోజు ఉదయం ఆమె ఎలాగూ ఇంట్లో ఉంది, మిస్నీని చూసుకుంటుంది కదా అని ఆవును శుభ్రం చేసి, ఇంత గడ్డి వేసి, నీరుపెట్టి పాలు పితక డానికి వెళ్లాను. చలిలో ఇవన్నీ చేశానేమో! కాసేప టికి నీరసం ఆవహించి టెంపరేచర్ పెరిగింది.

ఈ లోపు మా అత్తగారు తను తెచ్చిన సంచి లోంచి పిండి తీసి బ్రెడ్ తయారు చేసింది. సరే, ఆమె వంట పనిలో ఉంది కదా అని నీరసంతో మంచం మీదకు చేరాను. గ్లాసులో వేడిపాలు, పింగాణి పళ్లెంలో బ్రెడ్ పెట్టి నాకు అందిస్తూ అలా ఉన్నావేమని అడిగింది.

"నాకు జ్వరంగా ఉందని చెప్పాను. బహుశా ఆరుబయట చలి వల్లనేమో" అన్నాను. "అదేంకాదు... పిల్లనొదిలి అలా బయటకు వెళ్లావు కదా! అందువల్ల అలా జరిగింది. ఆ ప్రార్థనా పుస్తకం వల్ల కొత్త రక్షణ దొరికింది" అంది.

"నేను చెయ్యక, ఎవరూ చెయ్యక పాలు ఎలా వస్తాయి ఆవు నుండి. దాని తిండి విషయం, ఆరోగ్య విషయం చూడాలి కదా" మా అత్తగారి చాదస్తపు మాటలకు నవ్వుకున్నాను.

**(ఇంకా వుంది)**

# CRIME డెత్‌సీన్

**అర్థరాత్రి...**

**ఊరుబైట పాడుబడ్డ బంగళా.**

**పెద్దపెద్ద స్తంభాలతో పెచ్చులూడిపోయి పాకురుపట్టినగోడలు అసహ్యంగా ఉన్నాయి. హోరుగాలి. చెక్కతలుపులు, కిటికీలు టపటపా కొట్టుకుంటున్నాయి. జడలదయ్యాల్లా చెట్లు తలలూపుతున్నాయి. ఎలాంటివారికైనా భయంపుట్టించే వాతావరణం అది.**

**బంగళాలో హాలుమధ్య స్ట్రెచర్‌పై ఇనుప గొలుసుల బందీలో ఉందో అమ్మాయి. దిక్కులు పిక్కటిల్లేలా హృదయ విదారకంగా అరుస్తోంది. నల్లటి గౌన్లు ధరించిన కొందరు ఆమె చుట్టూ మూగారు. వాళ్ళ మొహాలు కనిపించడంలేదు. చేతుల్లో మాత్రం కాగడాలు. ఆ వెలుతురులో వాళ్ళ కళ్ళు రక్తపుముద్దల్లా ఎర్రగా మెరుస్తున్నాయి. పదునైనకోరలతో భయంకర పిశాచాల్లా ఉన్నారు. వాళ్ళచేతుల్లో ఉన్నవి ఆపరేషన్ పరికరాలుకావు. తుప్పు పట్టిన పటకాకత్తులు, రంపాలు. కాగడాల వెలుతురులో ఆమెకు ఆపరేషన్ చేయడానికి సిద్ధమయ్యారు వాళ్ళు.**

వాళ్ళలో ఒకడు అమ్మాయి మొహంలోకి చూసి "ఈ అమ్మాయి మొహం పాలిపోయింది, అర్జంటుగా రక్తం ఎక్కించాలి" అని ఆదేశించాడు. ఆ మాటవిని అమ్మాయి ఒక్కసారిగా గబుక్కున లేచి కూర్చుంది. తన పక్కనున్న వ్యక్తి చెయ్యి గట్టిగా పట్టుకుని నోటి దగ్గరకు తీసుకొని పండ్లు దిగబడేలా కొరికి రక్తం జుర్రుకోసాగింది. ఆ వ్యక్తి పెడుతున్న కేకలు గుండెల్లో దడపుట్టిస్తున్నాయి. ఆమె పెదవులు, నోరు ఎర్రని ఎరుపుతో భయం పుట్టేలా ఉన్నాయి.

ఇంతలో 'కట్..., అన్నకేక. దాంతో అందరూ గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.

"వెల్‌డన్ అనూషా, షాట్ అద్భుతంగా వచ్చింది. థియేటర్‌లో అందరూ ఊపిరి బిగపట్టి చూస్తారు అభినందనగా అన్నాడు డైరెక్టర్ శ్యామ్.

"థాంక్యూ సార్, మనకు కావల్సింది కూడా అదే కదా" తన చెయిర్‌లో కూర్చుంటూ ఫ్రెండ్ ప్రవీణ్ కోసం చుట్టూ చూసింది అనూష.

"నా ఫ్రెండ్ ప్రవీణ్ ఎటెళ్ళాడు?" మేకప్ మెన్‌ను అడిగింది. చూడలేదు అన్నాడతను.

డైరెక్టర్ ప్యాకప్ చెప్పడంతో కొండాపూర్‌లోని తన ఫ్లాటుకు చేరుకుని ప్రవీణ్‌కు రింగ్ ఇచ్చింది అనూష.

"హలో..."

"ఆc హల్లో....."

"ఏయ్...సడన్‌గా ఎటెళ్ళి పోయావు?" ఆమె గొంతులో అసహనం.

"నిజం చెప్పమంటావా, నాకు హర్రర్ సినిమాలంటే భయం బాబూ! అందులోనూ నిన్ను అలా దయ్యం వేషంలో...చచ్చే భయం వేసింది."

పగలబడి నవ్వింది అనూష.

"సరేగానీ నువ్వెక్కడున్నావు?"

"సబ్ వే రెస్టారెంట్‌లో. డిన్నర్ చేద్దాం రా"

"ఓ.కే..." అంటూ కారెక్కి, "సబ్‌వేకి పోనీ" అంది డ్రైవర్‌తో.

***

పీజా, కోక్ ట్రేలో పెట్టుకొచ్చి ఎదురుగా కూర్చున్నాడు ప్రవీణ్.

"సినిమా అన్నాక రకరకాల వేషాలు వెయ్యాల్సి వస్తుంది. ఇప్పుడీ సినిమాలో దయ్యం వేషం, రేపు ఇంకో సినిమాలో దేవత వేషం...ఇప్పుడు భయపడ్డావ్, అప్పుడు పూజలుచేసి కొబ్బరికాయ కొడతావా ఏవిటీ...?" పగలబడి నవ్వుతూ అడిగింది అనూష.

"నువ్వన్నది నిజమేగానీ, భయం వేసింది నాకు"

అతని అమాయకపు మాటలు వింటుంటే అనూష కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

"ఓ.కే. బాబా ఇక దయ్యం వేషాలు వెయ్యను సరేనా! నాకు మాత్రం అవన్నీ ఇష్టమంటావా? ఈ ఫీల్డ్‌లో కట్‌థ్రోట్ కాంపిటీషన్. నిలదొక్కుకోవాలంటే ఇలాంటివి తప్పవు" ప్రవీణ్ చెయ్యి తన చేతిలోకి తీసుకుని మృదువుగా నొక్కుతూ మళ్ళీ అంది, "నీలో నాకు నచ్చింది ఈ అమాయకత్వమే..." అంతలో ప్రవీణ్ సెల్ మ్రోగింది. ఫోన్ ఆన్ చేసి వింటున్న ప్రవీణ్ మొహంలో రంగులు మారాయి. కాల్ కట్ చేశాడు.

**ఆమె ఒక వర్ధమాన తార. అతడామె బోయ్‌ఫ్రెండ్. అమాయకుడు. ఆ అమాయకత్వమే ఆ సినీతారను ఆకర్షించింది. ముందుగా వేసిన పథకం ప్రకారం ఆ తార ఒకరాత్రి తనింట్లో పనివాళ్ళందరిని బయటకు పంపేసింది. అర్ధరాత్రి అతడికి ఫోన్ చేసి ఎదురు ప్రశ్నలు అడక్కుండా వెంటనే తన ఇంటికి రమ్మని ఆదేశించింది. ఇంతకీ ఆ ఇంట్లో ఏం జరగబోతోంది? ఆమె అతణ్ణి ఏం చెయ్యాలనుకుంటోంది?**

"ఎవరూ?"

"వాడే ఆ రాస్కెల్ వినోద్...."

"ఏమంటాడు?"

"నిన్ను నేను వదిలెయ్యాలట"

"వదలక పోతే?"

"నిన్ను నాకు దక్కకుండా చేస్తాడట" ఆందోళనగా అన్నాడు.

"వాడి మొహం.. మనల్నేమీ చెయ్యలేడు. నా వెంటపడొద్దని ఓసారి గట్టి వార్నింగ్ కూడా ఇచ్చా కదా? వాడిగురించి ఆలోచించి మనసు పాడుచేసుకోకు, కమాన్ చీర్అప్" ప్రవీణ్ కళ్ళల్లోకి లాలనగా చూస్తూ చెప్పింది అనూష.

అదే హోటల్లో ఓ మూల కూర్చున్నాడు వినోద్. కాల్ కట్ అవగానే తన ఎదురుగా ఉన్న పీజాను కత్తితో కసకసా పొడవసాగాడు. "ఏయ్! ఏవిటా పని? దానికోసం నువ్వు రాక్షసుడిలా మారతావా?" అడిగింది పక్కనే కూర్చున్న రీచా.

"అప్పలమ్మలా ఉండే అనూషను ఈ ఫీల్డుకి తెచ్చింది నేను. అది నాకు దక్కకుండా మరొకరి సొత్తుకావడం భరించలేను. అనూష నీ ఫ్రెండే కదా రీచా, నువ్వు నాకో సహాయం చేశావంటే అనూష ఫ్లేస్ నీదే"

"నిజంగానా! చెప్పు ఏం చెయ్యాలి?"

"అయితే విను" అంటూ రీచా చెవిలో గుసగుసలాడాడు వినోద్.

***

అర్ధరాత్రి వేళ, ప్రవీణ్ సెల్‌ఫోన్ మోగింది. అనూష నంబర్ చూస్తూనే ఆన్ చేశాడు.

"హలో."

"హలో ప్రవీణ్, అర్జంటుగా మా ఇంటికి రా"

"ఏంటి సడన్‌గా, ఎనీ ప్రాబ్లమ్?" ఆదుర్దాగా అడిగాడు ప్రవీణ్.

"పిలవగానే పరుగెత్తుకుంటూ రాకుండా ఈపిచ్చి ప్రశ్నలేంటి?" విసుగ్గా వినిపించింది అనూష కంఠం.

"సరే వస్తున్నా" అంటూ వెంటనే బైక్‌పై బయలుదేరాడు ప్రవీణ్.

రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. కొండాపూర్‌లో అనూష ఇంటికి పది నిమిషాల్లో చేరుకున్నాడు.

బైక్ పార్క్‌చేసి లోనికెళ్ళాడు. డోర్ వెంటనే తెరచుకోలేదు సరికదా తలుపు తెరచుకోడానికి ఐదు నిమిషాలు పట్టింది. హాల్లో చీకటి, అనూష బెడ్రూమ్‌లో ఉందేమో అనుకుని అటువైపు పరుగెత్తాడు. బెడ్రూమ్ తలుపు తెరిచే ఉంది. లోపలికెళ్ళి "అనూషా..." అంటూ లైట్ స్విచ్‌కోసం చీకట్లో గోడ తడిమి లైట్ వేశాడు. నిర్జీవంగా ఉన్న అనూష

ఫ్యాన్ సీలింగ్‌కు వేలాడుతూ కనిపించింది.

"అనూషా...!!" దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు ప్రవీణ్.

***

మరునాడు ఉదయమే అన్ని టీవీ ఛానళ్ళలో బ్రేకింగ్ న్యూస్. వార్తాపత్రికల్లో పతాక శీర్షికలు.

"బుల్లితెరనుండి వెండితెరకు ఎదిగి ఓ వెలుగు వెలుగుతున్న వర్ధమానతార అనూష హత్య, హంతకుడు ఆమె బాయ్‌ఫ్రెండ్ ప్రవీణ్"

***

రాయదుర్గం పోలీస్‌స్టేషన్ ఎస్.ఐ. మధుకర్ అతని అసిస్టెంట్ పురుషోత్తం సంఘటన జరిగిన ప్రాంతానికి చేరుకున్నారు. వాచ్‌మెన్ మంగళ్‌సింగ్‌ను, పనిమనిషి సుశీలను విచారించారు. వాళ్ళిద్దరిదీ ఒకటే సమాధానం, 'ఆరోజురాత్రి ఎవ్వరూ ఉండొద్దనీ, అందర్నీ వెళ్ళిపొమ్మనీ అనూషే చెప్పింది'. 'అమ్మగారు పొమ్మన్నదే తడవుగా ఇద్దరం ఇళ్ళకు వెళ్ళిపోయామనీ, ఇలా జరుగుతుందని ఊహించలేదనీ చెప్పారు.

అనూష స్నేహితులు, శ్రేయోభిలాషులు అప్పటికే అక్కడికి చేరుకున్నారు. అందరూ చెప్పేది ఒక్కటే అభిప్రాయం, 'అనూష ఆత్మహత్య చేసుకునేటంత పిరికిది కాదు, చాలా ధైర్యస్థురాలు, మరి ఈ మెడకు ఉరితాడేంటో మిస్టరీగా ఉంది, ఎవరో ఆత్మహత్యగా చిత్రీకరిస్తున్నారు.

ఇక అక్కడ కనిపించింది ప్రవీణ్ ఒక్కడే కనుక ఏ రకంగా చూసినా, అతడే హత్యచేసి ఉంటాడనే అభిప్రాయానికి వచ్చారు అందరూ.

"ఎందుకు హత్య చేశావు చెప్పు.?" ప్రవీణ్ కళ్ళల్లోకి సీరియస్‌గా చూస్తూ అడిగాడు ఎస్సై మధుకర్.

"వందసార్లు అడిగినా నా సమాధానం ఒక్కటే, నేను అనూషను హత్య చేయలేదు, ఇంతకుముందు జరిగిందంతా చెప్పాను. అర్ధరాత్రి తను ఫోను చేస్తే ఇక్కడికి వచ్చాను, నేను వచ్చేసరికే ఆమె ఉరి వేసుకుంది. అయినా మేమిద్దరం త్వరలో పెళ్ళిచేసుకోబోతున్నాం. అలాంటప్పుడు నా ప్రేయసిని ఎలా చంపుకుంటాను?" ఘొల్లుమన్నాడు ప్రవీణ్.

వెంటనే ఏదో గుర్తొచ్చినట్లు, జేబులోనుంచి సెల్‌ఫోన్ తీసి అనూష కాల్ చూపించాడు ప్రవీణ్. సరిగ్గా రాత్రి 11.40 గంటలకు ఆ కాల్ రికార్డ్ అయింది. పన్నెండుకల్లా తను ఇక్కడికి చేరుకున్నాడు.

దీర్ఘంగా ఆలోచిస్తూ ఇదంతా 20 నిమిషాల్లో జరిగిందన్న మాట.. ఆ రాత్రి అనూష పనివాళ్ళను ఎందుకు వెళ్ళిపొమ్మంది? ప్రవీణ్‌కు ఎందుకు ఫోన్ చేసింది? స్వగతంలా అనుకున్నాడు మధుకర్.

శవాన్ని పోస్టుమార్టంకు పంపి పరిసరాల్ని క్షుణ్ణంగా పరిశీలించసాగారు పోలీసులు. కాంపౌండ్ వాల్ దగ్గర ఓ ముఖ్యమైన క్లూ దొరికింది. దాన్ని జాగ్రత్త చేశాడు అసిస్టెంట్ పురుషోత్తం.

***

అసహనంగా అటూఇటూ పచార్లు చేస్తున్నాడు



వినోద్. అప్పుడే అక్కడికివచ్చిన రీచా "కంగ్రాట్స్! అనుకున్నది సాధించాం, ఎవ్వరికీ అనుమానం రాలేదు. ఇక అనూష ప్లేస్‌లో నేనేగా హీరోయిన్..." అంటూ అతన్ని హత్తుకుంది.

"అంతా సవ్యంగా జరిగింది. కానీ నేను గోడ దూకుతుంటే ఒక పొరపాటు జరిగింది."

"ఏమిటి?"

అతను చెబుతుంటే ఆమె మొహం వివర్ణమైంది.

"ఇప్పుడెలా...?" ఆందోళనగా అంది రీచా.

"కంగారు పడకండి అది మా దగ్గర పదిలంగా ఉంది" అప్పుడే అక్కడికి వచ్చిన వ్యక్తి మాటలు వినేసరికి గుండె ఆగినంత పనైంది.

"ఎవరు మీరు..? ఏం మాట్లాడుతున్నారు..?" కంగారుగా అన్నారిద్దరూ.

"ఐ యామ్ ఎస్.ఐ. మధుకర్. మీరు పడేసుకున్న అనూష సెల్‌ఫోన్ మా దగ్గర భద్రంగా ఉంది. అందులోని కాల్‌డేటా మొత్తం రికార్డ్ చేశాం. అనూషను హత్య చేసింది మీరే"

"నాకేం తెలియదు" బుకాయించబోయింది రీచా.

"నిజమే, కానీ వినోద్ చెప్పినట్లు చేశావ్" అంటూ జరిగింది కళ్ళకు కట్టినట్టు చెప్పసాగాడు ఎస్.ఐ.

"అనూషతో రీచాకు సాన్నిహిత్యం ఉంది. ఆ క్లోజ్‌నెస్‌తో ప్రవీణ్ గురించి అడిగింది. 'ప్రవీణ్ చాలా భయస్థుడు' అని చెప్పింది అనూష. "ఓస్ దానికంత కంగారెందుకు? మనం ఎలాగూ నటిస్తుంటాం కదా ఓ డెత్‌సీన్ నటిస్తే సరి అతని భయం పోతుంది" అని ఐడియా చెప్పింది రీచా. ప్రవీణ్‌ను ఇంటికి పిలిపించి ఆ సమయానికి ఉరేసుకుంటున్నట్టు నటించమంది. అతను భయపడుతున్నప్పుడు సర్‌ప్రైజ్‌గా కళ్ళు తెరిస్తేచాలు అతని భయం పోతుందని సలహా ఇచ్చింది. అమాయకురాలు అనూష నిజమేనని నమ్మింది. ఆ ప్లాన్‌లో భాగంగా పనివాళ్ళను వెళ్ళిపొమ్మంది. రాత్రి ప్రవీణ్‌కు ఫోన్ చేసింది. అతను వీధి చివరకు రాగానే రీచాను ఫోన్ చేసి చెప్పమంది. దాని ప్రకారం, రీచా ఫోన్ రింగ్ చేయగానే మెడకు ఉరి బిగించుకుంది అనూష.

ఇక్కడే ఊహించనిది జరిగింది.

రీచా లైట్లు ఆర్పేసింది. చీకట్లో లోపలికి ప్రవేశించిన వినోద్ తలుపు గడియపెట్టేశాడు. అందుకే ఐదు నిమిషాలవరకు ప్రవీణ్ తలుపు తెరవలేకపోయాడు. ఆ లోపే, పరిహాసానికి చేసిన డెత్‌సీన్ అనూష ప్రాణాలు తీసింది. అనూష చేతిలో సెల్ తీసుకుని వినోద్ గోడ దూకుతుంటే, ఆ సెల్‌ఫోన్ పడిపోయింది. అది ఎ.ఎస్.ఐకి దొరికింది. దాంతో డొంకంతా కదిలింది. వాళ్ళ సంభాషణంతా ఆ సెల్‌లో రికార్డ్ అయింది" చెప్పాడు మధుకర్.

ఇంతలో అసిస్టెంట్ పురుషోత్తం పోలీస్ బృందంతో అక్కడకు చేరుకొని వినోద్, రీచాలను అరెస్టు చేశాడు.

**–యం.ఉదయభాను**

**సెల్:99482 13953**



# ఆరు ఖండాలు-అరవై పెళ్ళిళ్ళు

**మంగళవాద్యాలతో, పురోహితుని పెళ్ళిమంత్రాలతో, ఆహూతులందరిమధ్యా మూడుముళ్ళూ, ఏడడుగులతో భవిష్యత్తు బంధానికి నాంది పలుకుతారు నూతన వధూవరులు. ఏటేటా తమ పెళ్ళిరోజును సెలబ్రేట్ చేసుకుంటారు. వైభవంగా అందరికీ గుర్తుండిపోయేలా పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు కొందరు. వినూత్నంగా, విభిన్నంగా ఉండాలనుకుంటూ మరికొన్ని జంటలు ఎవరూ చేయని సాహసకృత్యాలు చేస్తున్నారు. నీటిలో, ఆకాశంలో...ఇలా విభిన్న రకాలుగా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. కానీ ఓ యాక్రోబాట్ జంట వీరందరి కంటే ఇంకాస్త విభిన్నంగా ఆలోచించింది. మళ్ళీ మళ్ళీ పెళ్ళి అనే కాన్సెప్ట్‌కు తెరతీసింది.**

పెళ్ళికి ముందు ప్రేమ ప్రయాణం.. పెళ్ళి తర్వాత హనీమూన్... ఈ రెండే తెలుసు చాలా జంటలకు. కానీ ఓ సుదూర యాత్ర చేస్తూ, ప్రయాణానికి ప్రయాణానికి మధ్య పెళ్ళి చేసుకోవడం మాత్రమే తెలుసంటోంది ఓ అమెరికన్ యాక్రోబాట్ జంట. భూగోళమంతా చుట్టేస్తూ ముచ్చటగా వరసపెట్టి మళ్ళీ మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకుంటోంది. ఆరు ఖండాల్లోనూ అరవై సార్లు కల్యాణం చేసుకోవాలని ఈ జంట యాత్ర మొదలుపెట్టింది. ఇలా మళ్ళీ మళ్ళీ పెళ్ళి ఎందుకు? అనే ప్రశ్నకు మాత్రం తమ ప్రేమని ప్రపంచమంతా చాటిచెప్పడానికేనంటోంది చీతా ప్లాట్, రియాన్ ఉడ్‌యార్డ్ జంట. వారి పెళ్ళికి కొన్ని దేశాల్లో పేరొందిన కట్టడాలు, టూరిస్టులు సాక్షులుగా మారితే, మరికొన్ని దేశాల్లో జిరాఫీలు, ఏనుగులు, ఒంటెలు పెళ్ళిపెద్దలయ్యాయి.

లాస్ ఏంజెల్స్‌లో ఏరియల్ యాక్రోబాట్లుగా ఆరితేరిన చీతా ప్లాట్, రియాన్ జంట తమ భారీ పెళ్ళివిందుకయ్యే ఖర్చును తమ ప్రేమ పెళ్ళి యాత్రకు సర్దుబాటు చేసుకున్నారు. యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా, శాండియాగోలో థియేటర్ ఆర్ట్స్ డాన్స్‌లో శిక్షణ పూర్తిచేసిన ప్లాట్ గొప్ప థియేటర్ ఆర్టిస్ట్. అమెరికాలో ఎన్నో ప్రదర్శనలు ఇచ్చాడు. డిస్నీ వంటి ప్రముఖ సంస్థలతో కలిసి పనిచేశాడు. 'ది ప్లాట్ బ్రదర్స్' టీవీషో ద్వారా మరింతగా గుర్తింపు తెచ్చుకున్నాడు. టీవీషోల ద్వారా ఎక్కువమందికి పరిచయమైన అతను ఓ గొప్ప యాక్రోబాట్. అంతకుమించి యేరియలిస్టుగా వివిధ దేశాల్లో తన ప్రతిభ చాటుకున్నాడు. మంచి యాక్టర్‌గా, ఏరియల్ యాక్రోబాట్‌గా పేరు తెచ్చుకుంది రియాన్ ఉడ్‌యార్డ్. టీవీ షోలతో ఎప్పుడూ బిజీగా ఉండే ఆమె జీవితాన్ని ప్లాట్ పరిచయం మలుపు తిప్పింది.

### తొలి పరిచయం

కాలిఫోర్నియాలోని వ్యాన్ నైస్ జిమ్‌లో ప్లాట్, రియాన్‌ని మొట్టమొదటిసారి చూశాడు. తొలి పరిచయంలోనే ఆమెని ఇష్టపడ్డ ప్లాట్ సరిగ్గా ఏడాది తర్వాత రియాన్ ఎదుట తన మనసులో మాట బయటపెట్టాడు. రియాన్ అక్కడే ఎస్ చెప్పేయడంతో, అక్కడే ఉన్న తోటి యాక్రోబాట్ కళాకారుల మధ్యే రింగ్ తొడిగేశాడు. పెళ్ళి తతంగానికి వేలకు వేలు డబ్బులు ఖర్చు పెట్టకూడదని ఇద్దరూ అప్పుడే నిర్ణయించుకున్నారు. సింపుల్‌గా చాలా వినూత్నంగా ఎలా వివాహం చేసుకోవాలా? అని ఆలోచిస్తుండగా వారికి మళ్ళీ మళ్ళీ పెళ్ళి ఐడియా తట్టింది. అంతే 'వరల్డ్ వైడ్ వెడ్డింగ్'కి శ్రీకారం చుట్టారిద్దరూ. కాలిఫోర్నియాలో అప్పటికే వారు స్థిరపడ్డ నగరం లాస్‌ఏంజెల్స్ అత్యంత ఖరీదయిన నగరాల్లో ఒకటి. అలాంటి నగరాల్లో ఉండే ఖర్చుల గురించి ఇద్దరికీ అవగాహన ఉండడంతో తక్కువ ఖర్చయ్యే దేశాలనే తమ వెడ్డింగ్ సిటీలుగా ఎంచుకున్నారు. వృత్తిరీత్యా ప్లాట్ అప్పటికే ఎన్నో దేశాలను చుట్టొచ్చాడు. అందుకే టూర్ ప్లానింగ్ అంతా అతనే చేశాడు. ఇలా మూడు నెలలు ప్రణాళిక సిద్ధం చేయడంతోనే సరిపోయింది. ఇక విమాన టికెట్లలో రాయితీని



అందించే ఎయిర్‌లైన్స్‌లోనే వారి ప్రయాణం సాగింది. తక్కువ వ్యయం అయ్యే ఒక మాదిరి హోటళ్లలోనే బస చేసేవారు.

### మొట్టమొదటగా...

లాస్ ఏంజెల్స్ నుంచి 2014 ఫిబ్రవరి 8న కొలంబో దిశగా వీరి తొలి పెళ్లి ప్రయాణం మొదలయింది. మధ్యలో బొగాటోలో వీరిద్దరూ ఒకటయ్యారు. వందలాది అతిథుల మధ్య కాకపోయినా పరిచయం లేని కొత్త వ్యక్తుల చప్పట్ల మధ్య పెళ్లి వేడుకని మరోసారి కొలంబోలో జరుపుకున్నారు. 'పెళ్లికూతురు అలంకరణ కోసం అమ్మాయిలు వేలకు వేలు ఖర్చుచేస్తుంటారు. వెడ్డింగ్ జ్యుయలరీతో పాటు మేకప్‌ని తప్పించుకోగలిగాను' అంటూ చిరునవ్వులు చిందిస్తుంది రియాన్. కొలంబో నుంచి స్పెయిన్, ఐర్లాండ్, ఈజిప్ట్, కెన్యా, ఇండియా ఇలా వివిధ దేశాలకు చేరుకుని ఈ జంట అనేకసార్లు పెళ్ళాడినా, ఖర్చుని తగ్గించేందుకు ఒక్క వెడ్డింగ్ డ్రస్‌కే పరిమితమైంది. వివిధ ప్రదేశాల్ని పరిసరాల్ని ఆస్వాదిస్తూ, ప్రయాణంలో ఎదురైన కష్టనష్టాలని ఎదుర్కొంటూ, చెదరని చిరునవ్వుతో ముందుకు సాగారు. తాము చేరుకున్న ప్రదేశంలో ఉండే స్థానికులతో పాటు, అక్కడి స్థూపాలు, పేరొందిన కట్టడాలు వీరి పెళ్లి వేడుకలకి సాక్షులు. కొన్నిసార్లు టూరిస్టుల మధ్య ఇద్దరూ ఒక్కటయితే, మరికొన్ని ప్రదేశాల్లో జిరాఫీలు, ఏనుగులు వీరి చేయి కలిపేవి. థాయిలాండ్‌లోని ర్యాస్ టాంగ్ ఎలిఫెంట్ సెంటర్‌తో పాటు ఈజిప్ట్ ఒంటెలు అధికంగా ఉండే ఎడారి ప్రాంతాలు, కెన్యాలోని జిరాఫీ సెంటర్లు వీరి పెళ్లి వేదికలుగా మారాయి. స్పెయిన్‌లోని ఒంటెల సమక్షంలో ఏకమైన ప్లాట్, రియాన్‌లు వాటిని అస్సలు వదిలి రాలేకపోయారు. తమ పెళ్లి అనుభూతులతో పాటు అత్యంత సన్నిహితంగా మెలిగిన ఆ మూగజీవాలతో గడిపిన క్షణాల్ని సెల్ఫీల్లో భద్రపరుచుకున్నారు. తమ పెళ్లి వేడుకని కెమెరాలో బంధించడంలో తోటి ప్రయాణికులు తోడ్పడ్డారు. కొన్నిసార్లు సెల్ఫీ స్టిక్స్ సహాయపడ్డాయి. అన్నింటికి మించి వాళ్ల తర్ఫీదు పొందిన యాక్రోబాట్ విద్య ఫోటోలు బంధించడంలో ఎక్కువగా సహాయపడింది.

### వారి విద్యే వారికి సాయపడింది

ఐర్లాండ్‌లోని విక్‌లో పర్వతాలు, దుబియస్ ఎయిర్‌పోర్ట్, మొరాకోలోని క్యాస్కేడ్- డి- క్యుజోడ్ జలపాతాలు, బ్యాంకాక్‌లోని సువాన్ లువాన్ రమా 9 పార్క్, ఈజిప్ట్ పిరమిడ్లు ఉన్న ప్రాంతాలు వారి వివాహ వేదికలుగా మారాయి. నిరంతరం కర్రలు పట్టుకు తిరిగే కెన్యా ఆదివాసీలు సైతం మసారు తంతుతో మరోమారు వీరి వివాహ బంధానికి పాటలు పాడారు. ప్రయాణానికి, ఇతర ఖర్చులకు వారి విద్యే సాయపడింది. వివిధ దేశాల్లో ఆసక్తి కలిగిన వారికి యాక్రోబాట్ కళను బోధిస్తూ సాగేవారు. కొన్ని ప్రదేశాల్లో ప్రదర్శనలిచ్చేవారు. స్పెయిన్ వంటి దేశాల్లో ప్రదర్శనల ద్వారా వీరు సంపాదించిన డబ్బు వారి ఖర్చులకు ఎంతగానో ఉపయోగపడింది. స్పెయిన్లో కల్యాణ తతంగం పూర్తి చేసుకుని మాడ్రిడ్‌లో పేరొందిన పార్కుల్ని కలియదిరిగారు. వీరి పెళ్ళిప్రయాణం గురించి పదిమందితో పంచుకోవడంతో... ఆ పదిమందీ కూడా 'హనీఫండ్' వెబ్‌సైట్ ద్వారా నిధులను సేకరించి కొత్త జంటకు ఇచ్చారు. హనీమూన్ జంటలకి ఆర్థికసాయాన్ని అందించే ఈ వెబ్‌సైట్‌లో తాము ప్రయాణించాలనుకునే దేశాల వివరాల్ని పోస్ట్ చేస్తూ తగిన ఆర్థిక సాయాన్ని అందుకున్నారు. ఒక్కో దేశంలో వారం రోజులు ఉంటూ మూడు నెలలపాటు నిరంతరం ప్రయాణించిన ఈ జంట ఎన్నో అందమైన అనుభూతులని పోగుచేసుకుంది. ఎక్కడ తిరిగినా, ఎన్ని దేశాలు చుట్టినా ప్రతి ఒక్కరికీ ఒక్కో ఫేవరెట్ ప్రదేశం ఉంటుంది. అదేంటని ఈ జంటని అడిగితే టక్కున గిజాపిరమిడ్ అని చెబుతారు. దాని ఎదురుగా మరో పిరమిడ్‌ని తలపించే రీతిలో యాక్రోబాట్ విన్యాసంలో ఫోజిచ్చి ఫోటో దిగారు. ఐర్లాండ్ అందాలకు ఫ్లాట్ అయ్యి, ఆ దేశంలో ఒక్క రోజులో మూడు ప్రదేశాల్లో పెళ్లి చేసుకున్నారు.

### ముంబై మసాలా

ముంబయిలోని అజంతా ఎల్లోరా గుహల్లో తమ పెళ్లి వేదికగా మారిన బుద్ధుని స్థూపమున్న ప్రదేశం రియాన్ మనసు దోచుకుంది. పర్వతాలపై చెక్కిన ఎన్నో అపురూప శిల్పాలు వీరిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. స్ట్రీట్ ఫుడ్ అస్సలు ముట్టని రియాన్ ముంబయి వీధుల్లో లభించే రకరకాల చాట్లకి, కరకరలాడే స్నాక్స్‌కి ఫిదా అయిపోయింది. సాగరతీరంలో సాయంత్రాలు వీరిచ్చే ప్రదర్శనలకు భారీ స్పందన వచ్చేది. ఇక్కడి నుంచి సింగపూర్, ఆస్ట్రేలియా, ఫిజీకి చేరుకున్నారు. చక్కటి బడ్జెట్ ప్లానింగ్‌తో ప్రపంచవ్యాప్తంగా 12 దేశాల్లో విహరించిన ఈ జంటకి కొంత స్పాన్సర్ల సాయం కూడా అందింది. వీరు ప్రయాణించిన ప్రాంతాలకు సంబంధించి ప్లాట్ తన వెబ్‌సైట్లో పొందుపరచిన వివరాలు హనీమూన్ స్పాట్‌లని ఎంచుకునే కొత్త జంటలకి ఎంతగానో ఉపయోగపడతాయి. ప్రపంచవ్యాప్తంగా ఏడు ఖండాల్లోనూ పెళ్లి చేసుకోవాలని తొలుత నిర్ణయించుకున్న ఈ జంట అంటార్కిటికా ప్రాంతంలో వివాహానికి ఖర్చు ఎక్కువవుతుందని తెలిసి తమ టూర్‌ని విరమించుకుంది. హంగు ఆర్భాటాలు లేకుండా నచ్చిన ప్రాంతానికి చేరుకుని, స్థానిక పద్ధతుల్లో తమ ప్రత్యేక విన్యాసాల్ని జోడించి బంధాన్ని పదేపదే కలిపేసుకుంటున్న వీరి పెళ్లి యాత్ర గమ్మత్తుగా అనిపిస్తోంది కదూ!

–ప్రణవమ్





# కాలంతో కదలాలి

-డి. కామేశ్వరి

**"ఎనీ ప్లాన్స్ ఫర్ హనీమూన్ హనీ" గోముగా భుజంమీద తల ఆన్చి అడిగింది. మరో నాలుగురోజుల్లో మూడుముళ్ళువేసి మొగుడుకాబోయే రామ్‌చరణ్ ఉరఫ్ చరణ్‌ని అడిగింది చరిత్ర, చరిత్ర సృష్టిస్తూ.**

'వామ్మో, ఏం ప్రోగ్రెస్‌రా నాయనా, ఆడవాళ్ళ ప్రోగ్రెస్ ఇంతముందుకు వెళ్ళిపోయిందా. తమని దాటుకుని ముందుకెళ్ళి గోల్ కొట్టేశారా? నాయనో రేపు శోభనంగదిలోకి పాల గ్లాసుతో తను వెళ్ళాలి కాబోలు! ఆవిడగారు తలుపు గడియవేసే డ్యూటీ పుచ్చేసుకుని తిన్నగా మంచం దగ్గరకివచ్చేసి తన చేతిలో పాలగ్లాసు తీసుకుని తాగేస్తుందేమో!' కళ్ళ ముందు అరక్షణంలో అర రీలు తిరిగిన దృశ్యాలకి తబ్బిబ్బు అయి తడబడి..."నువ్వే చెప్పు" అన్నాడు బెరుకు కనబడకుండా ఓ వెర్రినవ్వు నవ్వి.

చుబుకం పట్టుకుని ఆమెను తనవైపు తిప్పుకున్నాడు. కాబోయే భర్తగారు తనకంత ప్రాముఖ్యం ఇస్తున్నందుకు "థాంక్స్ డియర్" అని చెప్పింది. మొహంనిండా సంతోషం నింపుకుని "గోవా" అంది. 'పోవే తింగరబుచ్చి, విశాఖలో సముద్రంఒడ్డున కూర్చుని మళ్ళీ అక్కడికెళ్ళేదేమిటే, అక్కడ కూడా ఇదే సముద్రమేడుస్తుంది అంతేగా...' ఈ మాటలన్నీ లోపలే అనేసుకుని, అక్కడ సముద్రం వేరు, ఇక్కడ సముద్రం వేరు అని చరిత్ర అనక ముందే, "అబ్బవద్దు ఇంకెక్కడికన్నా వెడదాం, పుట్టిన దగ్గరనుంచి సముద్రం చూస్తూనే వున్నా" ప్రయత్నం మీద మొహంమీదనుంచి విసుగు వెనక్కితోసి గొంతులోకి మార్దవం చొప్పించి అన్నాడు.

"ఓకే ఓకే, దెన్ స్విట్జర్లాండ్" అంది మరింత మొహంలో మొహం పెట్టేసి. స్విట్జర్లాండ్...అయ్యబాబోయ్! టిక్కట్లు, బోర్డింగు, లాడ్జింగు... కంప్యూటర్‌కంటే వేగంగా లెక్కలుకట్టేసి రిజల్ట్ చూపెట్టేసింది అతని ఇంజనీరింగ్ బుర్ర. మూడేళ్ళనుండీ దాచుకున్న డాలర్లన్నీ హాంఫట్. ఫెడేలున మొహం మీద కొట్టినట్టు తెలివి తెచ్చుకుని, భుజంమీద తల గట్టిగా అదుముకుని చాలాప్రేమగా "యుఎస్‌లో ఉంటాం, స్విట్జర్లాండ్‌కేం భాగ్యం. ఎప్పుడన్నావెళ్ళొచ్చు. ఇండియాలో ఎన్నిమంచి ప్లేసులున్నాయో తెలుసా" ఊరిస్తున్నట్టన్నాడు.

"ఓకె. దెన్ యూ ఛూజ్" అంది కాబోయే మొగుడిమీద నమ్మకంతో. ఆ క్షణంలో ఆ మొగుడి గారి మనసులో, 'హాయిగా, వెన్నెల్లో డాబామీద తెల్లటి మెత్తటి పరుపేసుకుని, చక్కగా ఓ పక్కనుంచి బీచ్‌గాలి తగులుతుంటే, మరోపక్కన ట్రాన్సిస్టర్‌లో పాత తెలుగు, హిందీ పాటలు వింటూ ఆకాశంలో చంద్రుణ్ణి చూస్తూ ఎంజాయ్ చేయకుండా పడుతూలేస్తూ ఎక్కడికో వేరే ఊరెళ్ళి, హోటల్‌రూములో ఫస్ట్‌నైట్ చేసుకోవడం ఎందుకు? దానికంటే ఈ మూన్‌నైట్ బాగుంటుందికదా!" అనే ఆలోచనలు మెదిలాయి. ఇలా ఆలోచిస్తున్నట్టు చరిత్రకి తెలిసిందంటే, 'పెళ్ళికి మూడురోజులముందు పారిపోయిన పెళ్ళికూతురు' అన్నవారత్తో చరిత్ర సృష్టించేదేమో చరిత్ర!' అనుకున్నాడు మళ్ళీ.



"సరే, ఊటీ, కొడైకెనాల్ వెడదాంలే" సూక్ష్మంలో మోక్షం ఆలోచిస్తూ చెప్పాడు చరణ్. మధ్యతరగతి కుటుంబంలో పుట్టి, తెలివిగా చదువుకుని అమెరి కావెళ్ళి 'డాలర్లు సంపాదించుకుందాం' అనుకుని ఎమ్మెస్‌చేశాడు. 'క్వాల్‌కం'లో ఉద్యోగం సంపాదిం చుకున్నాడు. మూడేళ్ళుగా డాలర్లు జమచేసు కుంటూ ఆనందంగా డబ్బులు లెక్కపెట్టుకునే మానవుడు మన హీరోగారు. అమెరికాలో సెటిలైన తను చాలా రొమాంటిక్ అన్నట్టు.

"సిల్లీ కాదు, గిల్లీ కాదు. అవ్వ! పెళ్ళి కాక ముందు ఈ తిరుగుళ్ళేమిటి? పెళ్ళిరోజు జీలకర్ర బెల్లం పెట్టాక, తెరతీశాక సుముహూర్తంలో మొహాలు చూసుకోమనే ఆచారం మనది. చాదస్తంగా ఏదో చెప్పబోయింది.

"ఈజిట్...అప్పటివరకు ఇద్దరూ చూసుకునేవారు కాదా?" వింతగా చూస్తూ అడిగింది అమెరికాలో చూడటం ద్వారా వదలకుండా అనుబంధం పెంచు కున్నాడు.

ఈ పెళ్ళిసంబంధం చెప్పగానే "ఒరేయ్, ఆ అమ్మాయికి తెలుగు వచ్చా లేదా ముందది చెప్పు" మొదటి ప్రశ్న అడిగింది మామ్మగారు.

అసలు అమెరికా వెళ్ళేముందు మనవడికి గట్టిగా నూరిపోసింది. "ఇదిగో ఒరేయ్ అమెరికా వెళ్ళేది చదువుకి. చదువుకోసం మాత్రమే సుమా! తెలుగింటపుట్టిన అమ్మాయి మన హీరోయిన్. అవ సరాన్నిమించిన డబ్బు, అమెరికాస్వేచ్ఛ మధ్య పెరి గిన అమ్మాయి. ఇద్దరికి ఆఫీసులో పరిచయాలు. స్నేహం, ప్రేమగామారింది. రెండువైపులా అభ్యం తరం చెప్పడానికి కారణాలులేవు గనుక 'ఓకే' అని పెళ్ళికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేశారు పెద్దవారు. అబ్బాయి నాయనమ్మ, మాతామహులు ముసలివార య్యారు. ప్రయాణాలు చేయలేరు. అయినా అమె రికాలో పెళ్ళేమిటి? ఇండియాలో చెయ్యాలిగానీ అనేసి, మీకెవరూ లేకపోతే ఏర్పాట్లు మేం చేస్తాం అనేశారు అబ్బాయివాళ్ళు. పదిరోజులముందు అమ్మాయితోసహా వచ్చేసి, షాపింగులు, టైలరిం గులు, నగలకొట్లన్నీ ఆడపిల్లవాళ్ళు తిరుగుతుంటే, అబ్బాయి, అమ్మాయి జంటగా షికార్లు, సినిమాలు, కాఫీషాపులు తిరుగుతూ ఇద్దరూ మానసికంగా దగ్గరయ్యే ప్రయత్నం చేస్తున్నారు. కాస్త కాస్త శారీ రకంగా.. అబ్బే...ఊరికే చిన్నచిన్న టచ్‌లు, సరదాలు మజాలు చేస్తూ తిరుగుతున్నారు వారం రోజు లుగా. ఇంతవరకు బాగానే ఉంది. ఇప్పుడీ హనీ మూన్ గొడవ వచ్చిపడి హీరోగారి మూడ్ కాస్త చెదిరింది. ఈ పదిరోజుల్లో అమ్మాయిగారి ఖర్చు లెవెల్ చూస్తుంటే చరణ్‌గారికి కరచరణాలు కాస్తా చల్లబడుతున్నాయి. పక్కన కొత్తమోజులో, కొత్త అమ్మాయి ఇచ్చే సాంగత్యం వేడి పుట్టిస్తున్నా ఖర్చు విషయానికొస్తే మాత్రం ఒళ్ళు కాస్త చల్లబడు తోంది.

బీచ్‌రౌండు పూర్తిచేసి ఇల్లుచేరిన కాబోయే నవ దంపతుల్ని చూసి చరణ్‌వాళ్ళ నాయనమ్మకు ఓ పక్క ముచ్చటనిపిస్తున్నా, కొంపదీసి వీళ్ళిద్దరూ పెళ్ళికంటే ముందే శోభనం చేసుకున్నారేమో అని అనుమానం. అందుకే, బయట తిరిగివచ్చినప్పుడల్లా వాళ్ళిద్దర్నీ నఖశిఖపర్యంతం పరీక్షిస్తూ ఉంటుంది ఆవిడ హాల్లోకూర్చుని.

"ఏమిట్రా నాన్నా ఆ తిరుగుళ్ళు... పెళ్ళి ఇంకా మూడురోజులే ఉంది. తిరిగితిరిగి ఇద్దరూ నల్లకప్పే సినట్లు కమిలిపోయారు. ఇదిగో ఇంక ఈ రెండురో జులూ ఇంటిపట్టున ఉండాల్సిందే. గుమ్మం కదల డానికివీల్లేదు" ఆర్డరిచ్చేసింది. పెళ్ళికూతురు ముసి ముసి నవ్వులు నవ్వింది. పెళ్ళికొడుకు మనసులో కొద్దిగా సంతోషించినా పైకిమాత్రం "మామ్మా, డోంట్ బీ సిల్లీ" అన్నాడు. "ఇప్పుడు కాకపోతే మజా ఇంకెప్పుడు" అన్నాడు కొంటెగా చరిత్రని చూస్తూ. పుట్టి పెరిగిన అమ్మాయి.

"అవునే మనవరాలా...పెళ్ళిచూపుల తరు వాత కాబోయే మొగుణ్ణి మళ్ళీ చూసేది సుముహూర్తం లోనే! పెళ్ళికాకుండా ఇలా చెట్టాపట్టాలేసుకు తిరగడం సంప్రదాయం కాదు"

'పిచ్చిమామ్మా.... చెట్టాపట్టాలేసుకుతిరగడ మేంటి? అన్ని సరసాలూ, సరదాలూ ముందే అయిపోతున్నాయి. అప్పుడే సగం ఫిల్టర్ అయి పోతున్నాయి నచ్చకపోతే. పెళ్ళిదాకా వచ్చేవి ఇదిగో ఇంకా మీలాంటివాళ్ళ పెంపకంతో కాస్తోకూస్తో ప్రిన్సిపల్స్ వంటబట్టడంవల్లే' పైకి అనలేని మాటలే అవన్నీ. నాయనమ్మ మాటల న్నింటికీ ఓ నవ్వే జవాబుగా చెప్పాడు చరణ్.

చరణ్ అంటే ఆవిడకి ప్రాణం. ఇద్దరు ఆడ పిల్లల తరువాత మనవడు పుట్టడం. తాత గారు పోయిన ఏడాదిలోగా పుట్టడంతో, భర్తే మనవడి రూపంలో పుట్టాడని చరణ్‌పై ఆవి డకు అంతులేని మమకారం. భర్తపేరు రామ నాథం కలిసేట్టు రామ్‌చరణ్ పేరు పెట్టించింది. చిన్నప్పుడు చంకనేసుకుని వెండిగిన్నెలో పెరు గన్నం కలిపి కథలుచెప్పి తినిపిస్తూ వాడి ముద్దుమురిపాలమధ్య భర్తలేనిలోటు పూడ్చు కుంది. ఇంజనీరింగ్ కూడా ఊళ్ళోనే చదువుకో వడంతో అమెరికా వెళ్ళేవరకు మనవణ్ణి ఎప్పుడూ ఆమె వదిలి ఉండలేదు. "ఎందుకురా పాడు అమెరికా. ఇక్కడ లేవా ఉద్యోగాలు" అంటూ పోరుపెట్టింది. "అమ్మా ఊరుకుం టావా, అది వాడి భవిష్యత్తు; వెళ్ళనీ" కొడుకు కసిరి గట్టిగా చెప్పేవరకు ఊరు కోలేదు. చరణ్ అమెరికా వెళ్ళినరోజున అన్నం తినకుండా, కళ్ళు ఒత్తుకుంటూనే ఉంది.

తనని ప్రాణంగా ప్రేమించే నాయనమ్మ అంటే చరణ్‌కి కూడా ఎంతో అభిమానం. చిన్న పుడు ఆవిడ చెప్పిన కథలు, మంచిమాటలు, నీతి కథలు తనకు ఎంతో ఉపయోగించాయని నమ్ముతాడు. ముఖ్యంగా తెలుగుపద్యాలు, భారతం, రామాయణం, వేమనపద్యాలు, సుమ తీశతకాలు తెలుగుపట్ల తనకు ఎంతో అభిరు చిని పెంచాయి. అమెరికావెళ్ళిన తర్వాత కూడా దొరికినప్పుడల్లా తెలుగుపుస్తకాలు చద వటం, తెలుగుపాటలు, తెలుగు సినిమాలు



ఏ తెల్లదాన్నో, ఇంకోర్తినో వెంటేసుకుని వచ్చావంటే కాళ్లు విరగ్గొడ్తాను. ఎవరైనా అందమైనపిల్ల కని పించి, నీకు నచ్చితే తెలుగు పిల్లా, మనవాళ్లా అని తెల్సుకుని ముందుకెళ్ళాలి. అంతేగాని ఎవరిని పడితే వాళ్ళని ప్రేమ గీమ అని తీసుకువచ్చావంటే ఉరేసు కుంటాను తెలుసా?" అని బెదిరించింది. "పోమామ్మా. నేను చదువుకి వెడుతున్నాను. అమ్మాయిల్ని ఎంచు కోడానికికాదు"

"సర్లే అంతా ఇలాగే చెప్తారు. ఓ తెల్లతొక్కఅ మ్మాయి కనపడగానే వెంటబడి, వెంటేసుకు వస్తారు. ఒరేయ్, వాళ్ళతో మనకి సరిపడదు. వాళ్ళ పద్ధతులు, పెంపకాలు వేరు. ఏదో మన తెలుగు పిల్ల కాకపోయినా అరవమో, కన్నడ అమ్మాయో అయినా ఫరవాలేదు. మరాఠీ పిల్ల కూడా మనవా ళ్ళల్లో కలిసిపోతుంది, నేను చెప్తున్నది గుర్తుంచుకో" చరణ్ బయలుదేరేముందు నూరిపోసింది. మన వడు మరీ బరితెగించే రకం కాదని, కాని పనులు చేయడనీ ఆవిడ గట్టినమ్మకం. ఆ నమ్మకం వమ్ము చేయకుండా రెండేళ్ళు బుద్ధిగా ఎమ్మెస్ చదివి, ఆరు నెలలు ఏదో మామూలు ఉద్యోగం చేశాక 'క్వాల్‌కం'లో ఉద్యోగం రాగానే, స్థిరపడిపోయినట్లే అని నిబ్బరంగా అనేసుకుని, అప్పుడు కాస్త చుట్టూ చూడ్డం అలవాటు చేసుకున్నాడు. ఆ చూడ్డంలో మొదటిచూపుకే అప్పుడే పదిరోజుల క్రితమే అక్కడ జాయిన్ అయిన చరిత్ర చిక్కింది. పడినచూపు తప్పించుకోలేకపోవడం, ఇద్దరూ ఒకేజాతి పక్షులు కావడంతో దగ్గరైపోయారు. స్నేహం, సినిమాలు, వీకెండ్‌లు, కాఫీహౌస్‌ల మధ్య పరిచయం ప్రేమగా మారిపోయింది. సెలవొస్తే ఇంటికిపిలిచి లంచ్‌లు, డిన్నర్లు, పిక్నిక్‌లు, పండగలు... చరిత్రేకాక వాళ్ళింట్లోవాళ్ళు కూడా చరణ్‌కి దగ్గరైపోయారు. ఆర్నెల్ల తరువాత పనిగట్టుకుని ఇండియావచ్చి, సంప్రదాయబద్ధంగా పెళ్ళిచూపులు ఏర్పాటుచేసి అమ్మాయిని చూపించారు. 'పరవాలేదు మంచీ మర్యాద తెల్సినవారే, సంప్రదాయం తెలిసినవాళ్ళు, మనవాళ్ళు' అని సంబరపడి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేశారు మగపెళ్ళివారు. మూడునెలల్లో ముహూర్తం కుదిరి పోయింది. "మనవాడిముందు అమ్మాయి రంగు తక్కువరా" అని కాస్త గునిసింది మామ్మ. "అమ్మా ఈ రోజుల్లో చదువు, ఉద్యోగాలకితప్ప అందాలకి ప్రాముఖ్యత ఇవ్వడంలేదమ్మా. అయినింటి సంబంధం, మనవాళ్ళపిల్ల అని సంతోషించా. పిల్ల కాస్త రంగుతక్కువైనా స్మార్ట్‌గా ఉందిలే"

"అవునులే, వాళ్ళెవర్నో కట్టుకువచ్చేదానికన్నా, సంప్రదాయ కుటుంబంపిల్లే దొరికిందిలే" అని సరి పుచ్చుకుందావిడ. పెళ్ళిచూపుల్లో చరణ్ నానమ్మ అడిగిన మొదటిప్రశ్న "అమ్మాయీ తెలుగువచ్చా నీకు" అనే. "నాకు చక్కగా తెలుగువస్తుంది, మా అమ్మ గారు నాతో తెలుగే మాట్లాడుతారు" కాస్త పట్టిపట్టి మాట్లాడినా, ఫరవాలేదు బాగానే వచ్చు అని సంబర పడిందావిడ.

"మా అమ్మకి, మాతృభాషమీద మమకారం ఎక్కువలెండి. తెలుగులో మాట్లాడు అని అందరినీ సతా యిస్తూ ఉంటుంది" కొడుకు నవ్వుతూ అన్నాడు.

"మంచిదేగా, అమెరికాలో ఉన్నాకూడా, ఇంట్లో తెలుగే మాట్లాడాలి అని షరతు పెట్టింది మా ఆవిడ. అందుకే పిల్లలిద్దరికీ తెలుగు మాట్లాడడం వచ్చు" అన్నాడు వియ్యంకుడు. "అవునండి మన భాషని మనమే గౌరవించకపోతే ఎలా? కనీసం మాట్లాడకపోతే, భాష కనుమరుగైపోదూ" ఆవిడ అంది.

"ఇదిగో మామ్మా, నీకోసం చరిత్రతో ఏమనిచె ప్పానంటే, మా మామ్మని ఇంప్రెస్‌చెయ్యాలంటే నువ్వు తెలుగు బాగా మాట్లాడాలి అని. 'అయితే సరే' అని ఒప్పుకుంది. 'నువ్వు నాతో తెలుగులోనే మాట్లాడు' అంది తెలుసా. మామ్మ, నీకో జోక్ చెప్పాలి..." అంటూనే పడిపడి నవ్వడం మొదలుపె ట్టాడు చరణ్. చరిత్ర కోపంగా చూసింది. "ఏమిట్రా అంత నవ్వువచ్చేదా చెప్పుచెప్పు" అందావిడ. "మామ్మా రోజా తెలుగు మాట్లాడుతుంటే ఓరోజు కాఫీహౌస్‌లో వెయిటర్ ఆర్డర్ తీసుకోడానికి ఎంత సేపటికీ రాలేదని కోపంగా తెలుగులోతిట్టడం మొదలుపెట్టింది. 'అంత పరుషవాక్యాలు మాట్లాడకే బాలా' అన్నాను అచ్చ తెలుగులో. 'ఏమిటీ? పురుష వాక్యాలా? అంటే తెలుగులో స్త్రీల వాక్యాలు, పురుష వాక్యాలు ఉంటాయా' అంది" నవ్వి నవ్వి చెబుతూ, "పురుష కాదే చిన్నారి 'పరుష' అంటే 'హార్ష్ వర్డ్స్' అని చెప్పాను" అన్నాడు. అందరూ గొల్లున నవ్వారు. "బానే ఉంది మీ తెలుగు. మా అమ్మకి తెలుగుమీద ప్రేమకంటే, తనకి ఇంగ్లీషు




**అమెరికాలో ఓ అమ్మాయిని ప్రేమించాడు ఆమె మనవడు. ఇరుపెద్దలూ ఒప్పుకున్నారు. ఇకవాళ్ళు పెళ్ళికాకుండానే చెట్టపట్టాలేసు కుని తిరగడం మొదలెట్టారు. నాయనమ్మ బుగ్గలు నొక్కుకుంది. ఆమెకు ఎన్నో సందే హాలు. ఆ పిల్ల చీరలు కడుతుందా, వంట చేస్తుందా, నిక్కర్లు తొడుక్కుంటున్న ఆ పిల్ల అసలు కాపురం చేసే రకమేనా? అని తెగ బాధపడిపోయింది. మనవడి సందేహం కూడా అదేనా? అయితే వాటికి జవాబు చెప్పేదెవరు?**

రాదన్నది ఒప్పుకోదు" అన్నాడు చరణ్ తండ్రి. "ఒరేయ్ రాముడూ, కన్నతల్లినే అవమానిస్తావురా, మీపాటి బోడి ఇంగ్లీషు నాకూవచ్చు. ఆ రోజుల్లో మెట్రిక్ చదివారా. మావన్నీ అల్లాటప్పా చదువులు కావు. పునాది ఉన్న చదువులు" ఝూంకారంగా అంది మామ్మ. "తమాషాకి అన్నాలే అమ్మా, నిజం గానే మా అమ్మ చదువుకునే రోజుల్లో చదివిందేదో క్షుణ్ణంగా ఉండేది" అన్నాడు మళ్ళీ. అంతా నవ్వారు. అది పాతకథ.

అమ్మాయివాళ్ళు వెళ్ళాక చరణ్ మామ్మకి సందేహం వచ్చింది. "ఒరేయ్ చీరలు కట్టుకుంటుందా ఎప్పుడన్నా" అడిగింది. "చీరలా ఇంకానయం, ఏదో ఇండియా వచ్చింది కనుక, ఈ మాత్రం డ్రస్సులు. అక్కడంతా షార్ట్స్, ప్యాంట్లు, మిడ్డీలు, ఫ్రాకులు, మామ్మ వినకుండా తల్లితో మాత్రమే అన్నాడు. "సర్లే మీ నాయనమ్మ మాటలకేంలే వదిలేయ్, వెళ్ళి ఫ్రెష్ అయిరా, భోంచేద్దాం" అంది తల్లి.

భోజనాలబల్ల దగ్గర ఈసారి మామ్మకి మరో సందేహం వచ్చింది, "ఒరేయ్ మనవంటలేమన్నా వచ్చురా ఆ పిల్లకి" అడిగింది. "వంటా నాకేం తెలుసు" అన్నాడు అమాయకంగా మనవడు.

"సరేలే, తనకి రాకపోతే నాకొచ్చుగా" అనేశాడు మళ్ళీ అనాలోచితంగా. మామ్మ తెల్లబోయి "ఏమిటీ వంట నువ్వు చేస్తావా?"

"అక్కడంతే మామ్మా. ఆడ మగ ఎవరికేది తోస్తే అది చేస్తారు. తను వండకపోతే నేను చేస్తాలే, అదేం ప్రాబ్లమ్ కాదు"

"నీబొంద, అలా అలవాటుచేస్తే ఇంక అదెం దుకు చేస్తుంది. నీనెత్తిన వేస్తుంది ఆ పని. నీకేం రానట్టుండు గమ్మున. బ్రహ్మచారిగా ఉన్నప్పుడు ఏదో వంటతప్పక చేసుకున్నావు. ఇప్పుడూ చేస్తా నంటావేమిటిరా వాజమ్మా"

"అమ్మా వాళ్ళకాపురం వాళ్ళేదో చేసుకుంటారు. నీకెందుకు బాధ, అక్కడ అన్నిపనులూ ఇద్దరూ చేసుకోడం అందరికీ అలవాటేలే" విసుగ్గా అన్నాడు కొడుకు.

"ఆ దిక్కుమాలినదేశం అందుకే వద్దన్నాను. గ్లాసులో నీళ్ళన్నా ముంచుకుని తాగేవాడా ఇక్కడ. వాడికర్మకాలి అక్కడ వంటచేసుకుని, బట్టలుతు క్కుని, ఇల్లు తుడుచుకుని, నాబిడ్డ ఇప్పుడు పెళ్ళైనా కూడా ఇవన్నీ చేసుకోవాలా" గిలగిల్లాడిపోయింది

ఆవిడ ప్రాణం. తల్లి చాదస్తానికి నవ్వుకుని కొడుకు కోడలు భోజనాలుతిని గదిలోకి వెళ్ళిపోయారు. "నాన్నా కాసేపు నాదగ్గర కూర్చోరా" అంది మామ్మ గారు మనవడిని పక్కన కూర్చోపెట్టుకుని. "మళ్ళీ ఎప్పుడొస్తావో, కాసిని కబుర్లు చెప్పరా" అంది.

మనవడు మామ్మ ఒళ్ళో తలపెట్టుకుని పడుకుని నడుంచుట్టూ చేతులువేసి "మామ్మా నాకెందుకో భయంగా ఉంది" అన్నాడు కాస్త దిగులుగా.

"భయం ఎందుకురా పిచ్చినాన్నా, శుభమా అని పెళ్ళి చేసుకుంటూ" లాలనగా అంది.

"అదే భయం..చరిత్ర.. నా చరిత్ర మార్చేస్తుందని భయంగా ఉంది మామ్మా"

"అదేమిటిరా", "ఏమో మామ్మా, చరిత్రని చూస్తే నాకెందుకో భయం. ఆ అమ్మాయిముందు భయపడిపోయి నేనేదీ ఎదురుచెప్పడం చేతకానట్టు ఫీలింగ్"

"అదేంటిరా" ఆవిడ భయంగా చూసింది.

"ఈ పెళ్ళితో నేను నేనుగా మిగలగలనా అని. ఆ అమ్మాయి నన్ను డామినేట్ చేసేసి నన్నో చవట దద్దమ్మలా మూల కూర్చోపెట్టేస్తుందనిపిస్తోంది" దిగులు కనిపించింది మనవడిలో.

"అదేమిటిరా ఎందుకలా...నీమాట వినదా, ఎదిరిస్తుందా?" కలవరంగా అంది.

"ఏమో నాకు తెలీదు, నాకెందుకో... ఆ అమ్మాయి పద్ధతులు... ఏదన్నా లెక్కలేదు, భయం లేదు, డబ్బంటే లెక్కలేదు. ఆ బట్టలు కట్టుకోవడం ఏంటో. అవన్నీ చూస్తే నేనుత్తవెధవాయినన్న ఫీలింగ్ వస్తుంది. రేపు ఎలా? అని భయం..." ఆవిడ చటుక్కున మనవడి తల ఒళ్ళోంచి తీసి కూర్చోపెట్టింది. "నాకు తెలుసురా, నీవు సంతోషంగా లేవని, నీ మొహంచూస్తే నాకు తెలిసిపోయిందిరా. ఈ మాట ఇప్పుడా చెప్పడం, ముందే చెప్పేస్తే ఈ పెళ్ళికి ఒప్పుకునేవాళ్ళం కాదుగదరా" ఆరాటంగా అంది.

"ఏమో, అప్పుడనిపించలేదు. ఇప్పుడనిపిస్తోంది ఏంటో మామ్మా తను చాలా డేరింగ్, నేనో చవటాయిలా అనిపిస్తుంది తన ముందు.."

"నోరుముయ్యరా, నీకేంట్రా, ఇంజనీరింగ్ ఫస్టున ప్యాసై మంచి కంపెనీలో ఉద్యోగం, వెనకా తల బోలెడాస్తి..."

"అదంతా సరేగానీ ఇవన్నీ ఆ పిల్లకేం లెక్కలేదు. తనకీ బోలెడు డబ్బుంది. నాతోపాటు ఉద్యోగం, చదువు అన్నీ ఉన్నాయి గదా. మన డబ్బేం లెక్కలేదు ఆ అమ్మాయికి. అలా పది క్రెడిట్‌కార్డులు పర్సులోంచి తీసి, పెద్దపెద్ద బ్రాండెడ్ షాపుల్లో వందలు, వేలడాలర్లు ఖర్చుపెట్టి అన్నీ కొనేస్తూ ఉంటుంది తెలుసా. రేపొద్దుట ఈ ఖర్చులు నేను తట్టుకోగలనా అని భయం వేస్తోంది"

"ఇలాగే చచ్చుదద్దమ్మలా మాట్లాడితే, నిజంగానే నిన్నోమూల కూర్చోపెట్టేస్తుంది. మగాడిలా ఉండాలి. ఇంటి ఖర్చుకింత, దానికింత, దీనికింత అని లెక్కపెట్టి ఇచ్చెయ్. పాగల్‌ది దానిజీతం ఏమైనా చేసుకోనీ... గమ్మునుండు నువ్వు" సలహా చెప్పింది.

"అలా అంటే, మరి పెళ్ళెందుకు చేసుకున్నావంటుంది. అమ్మో నీకు తెలీదు మామ్మా, అమ్మాయిలు ఎలా తెలివి మీరిపోయారో. ఇల్లుకొన్నాను మామ్మా, దాని అప్పుకే నా సగం జీతం అయిపోతుంది. తన జీతం కూడా కలిస్తేనే ఇల్లు నడుస్తుంది" లెక్కలు విడమర్చి చెప్పేశాడు మనవడు. మనవడి మొహం చూసి కరిగిపోయింది మామ్మ.

"ఉండు. మీనాన్నతో పొద్దుట మాట్లాడతాను. పెళ్ళి కాన్సిల్ చేసేద్దామా అనడుగుతా"

"అమ్మో ఇందాక వచ్చాక ఇప్పుడు కాన్సిలంటే అమెరికాలో నా పరువు పీకి పందిరేస్తారు. ఆఫీసులో నా పరువు... పరువేమిటి ఉద్యోగమే గోవిందా... సర్లే ఎవరితో ఏమీచెప్పకు. చూస్తాలే, మంచిగా చెపితే వింటుందేమోలే. మేనేజ్ చేస్తా" అంటూ వెళ్ళి పడుకున్నాడు. మామ్మకి రాత్రంతా నిద్రలేదు మనవడి భవిష్యత్తుమీద బెంగతో.

తెల్లారిలేస్తూనే కాఫీ తాగుతున్న కొడుకు కోడలు చెవిన వేసేసి మనవడిని రక్షించేపనికి మార్గాలు వెతకసాగింది. "నీకు మతిపోయిందా, రెండు రోజుల్లో పెళ్ళిపెట్టుకుని కాన్సిల్ చేయాలా? పెద్దదానివి వాడికిలాంటివి నేర్పిపెడతావా? ఈ అమ్మాయేంటి, యిప్పు

## మనమీదేసర్రోయ్!

సరసి

మా వీధిలో ట్రాఫిక్కెక్కువ!
అందుకని పెళ్లిళ్లకీ శుభకార్యాలకీ
మా కాంప్లెక్సులోనే ఊరేగుతాం
కిందికీ పైకీ!

సరసి

డందరు అమ్మాయిలూ అలానే ఉన్నారు. వాళ్ళు చదువుకుని, సరిసమంగా సంపాదిస్తున్నారు. మన ఇండియాలో అమ్మాయిలే ఇలా ఉన్నారు. అమెరికాలో వింతేముంది. ఒక్కర్తే కూతురు. డబ్బుంది. ఏదో సరదాగా షాపింగులు చేస్తుంది. పెళ్ళయ్యాక సంసార బాధ్యతలు అవే వస్తాయి" తల్లిమీద కోప్పడి అరిచాడు కొడుకు.

"పెళ్ళికిముందే వాడిలా భయపడుతుంటే, ఆ సంసారం ఏం సాగుతుంది" ఆవిడ వాదనకు దిగింది అంతకంటే గట్టిగా. ఆ గలాభా విని మనవడు గదిలోంచి పరిగెత్తుకు వచ్చాడు.

"మామ్మా...చెప్పొద్దన్నానా" అరిచాడు కోపంగా.

"వద్దన్నావులే. నా మనసుండబట్టొద్దూ. పిచ్చినాగన్న మొహం వాడిపోయింది. పెళ్ళి కళే లేదు.."

"ఏరా, ఏమిటిది? నువ్వు చేసుకుంటానంటే సరే అన్నాంగానీ, ఈ పిల్లని చేసుకోమని నిన్నేం బలవంతపెట్టలేదుగా" కోపంగా కొడుకు వంక చూశాడు తండ్రి.

"నాన్నా, ఏమిటి ఎనీప్రాబ్లమ్ మీ ఇద్దరి మధ్య. ఎందుకలా అన్నావు మామ్మతో" తల్లి లాలనగా అడిగింది. 'చెప్పే ప్రాబ్లమ్స్ కావే అమ్మా' అని మనసులో అనుకుని, "ఊరికే అన్నాను. డబ్బు లెక్కలేకుండా ఖర్చుపెట్టేసుంది. ఆవిడవన్నీ హై స్టాండర్డ్ అన్నాను అంతే" సర్దిచెప్పాడు మనవడు.

"చూడు చెర్రీ... ఇవి ఇదివరకటి రోజులు కావు. ఆడవాళ్ళతో ఎలాపడితే అలా డీల్‌చేసే రోజులు కావు. ముందునుంచీ మంచిగా ఆ అమ్మాయిని దారికి తెచ్చుకోవాలిగానీ, కోపాలు తాపాలు పనికిరావు తెల్సిందా.. ఊ... అ... అంటే అమ్మాయిలే డైవోర్స్... అనేస్తున్నారు జాగ్రత్త, గోళ్లూడగొట్టి సగం జీతం, సగం ఆస్తి రాబట్టేస్తారు కోర్టుకెక్కి"

"పెళ్ళింట్లో డైవోర్స్ మాటలేమిటి" భర్తను కసిరింది తల్లి.

"ఏవో కాస్త జాగ్రత్తలు చెపుతున్నా. ఇదివరకు పెళ్ళికిముందు అత్తారింట్లో మొగుడిలో ఎలా మసలాలో అమ్మాయిలకు జాగ్రత్తలు చెప్పేవారు. ఇప్పుడు అబ్బాయిలకి చెప్పాలి" నవ్వాడాయన.

"హాయ్, ఎవ్రీబడీ, గుడ్ మార్నింగ్" షార్ట్స్, టీ షర్టు, వాకింగ్ షూస్‌తో వచ్చిన చరిత్ర, "హై చెర్రీ సెల్ తీయవేమిటి? జాగింగ్‌కి వెడదామని ఫోను చేస్తే తీయవే, సైలెంట్‌మోడ్‌లో పెట్టావా... ఏమిటి, ఏదో డైవోర్స్ అంటున్నారు. ఎవరికి ఎవరు ఇస్తున్నారు డైవోర్స్. పెళ్ళి కాకుండానే చెర్రీ డైవోర్స్ అంటున్నాడా కొంపదీసి" అంటూ పకపక నవ్వింది. "చెర్రీ, నో ఛాన్స్, ఐ డోంట్ లీవ్ యూ సో ఈజీలీ. హే మేన్, గొప్పగా చెప్పావు ఇండియాలో అంతతొందరగా డైవోర్సులు ఇవ్వరని చూస్తా, నిన్ను ముప్పతిప్పలుపెడతా, డైవోర్స్ ఇవ్వకుండా ఎలా మేనేజ్ చేస్తావో" ఆట పట్టిస్తూ నవ్వింది చరిత్ర. అందరూ నవ్వారు.

"నో ప్లీజ్. అలా మాట్లాడ కూడదు పెళ్ళింట్లో" కాబోయే కోడలిని మందలించింది అత్తగారు. "ఓ సారీ ఆంటీ సారీ, కాఫీ ఉందా ఆంటీ, చెర్రీ గెట్ రెడీ ఈ లోపల" అని ఆర్డర్లు వేస్తున్న అమ్మాయిని చూసి, రంగుమారిన మనవడి మొఖంచూసి మామ్మ మనసు ద్రవించిపోయింది. షార్ట్స్ వేసుకుని మామ్మగారిముందు కాలుమీద కాలేసుకుని కాఫీ తాగుతున్న పిల్లనిచూసి "ఈ పిల్ల కాపురం చేసే రకమేనా" అనిపించిందావిడకి.

ఇద్దరూ వెళ్ళాక వాడిపోయిన తల్లిమొహం చూసి "అమ్మా, నీకు, ఆ అమ్మాయికి మధ్య రెండు తరాలున్నాయి అని మర్చిపోకు. నీకేం బెంగ అక్కరలేదు, వాళ్ళకి తెలుసు వాళ్ళకేంకావాలో. మన సలహాలు అక్కరలేదు. కాలంతోపాటు కదిలిపోవడం మనం నేర్చుకోవాలి. ఊరికే ఆలోచించి మనసు పాడు చేసుకోకు" సలహాచెప్పి లోపలికి వెళ్ళిపోయాడు కొడుకు.

"రామయ్య తండ్రీ, వాడుత్త వెర్రినాగన్న. నీ పేరే పెట్టుకున్నా. మా ఇంటి ఇలవేలుపువి నువ్వే వాణ్ణి ఓ కంట కనిపెట్టు తండ్రీ, నీ చరణాలే మాకు శరణ్యం" రామపట్టాభిషేకం ఫొటోకి దండం పెడుతూ అనుకుందావిడ. రామయ్యతండ్రి చిరునవ్వు చిందిస్తూ అభయహస్తం తనకే అన్నట్టు సంతృప్తి పడిందావిడ. రామయ్య కాళ్లదగ్గర కూర్చున్న ఆంజనేయస్వామికి మరో దండంపెట్టింది. "స్వామీ, రామయ్యని కంటికిరెప్పలా కాచుకున్నట్టే ఈ నా రాముణ్ణి కనిపెట్టు, నీ ధైర్యం, నిబ్బరం, నీ సాహసం, నీ బలం అన్నీ కాస్త వాడికీ ఇవ్వు. ఆ అమ్మాయిముందు నా మనవడు బలహీనుడు కాకూడదు. గెలుపు వాడిదే కావాలి. పదికాలాలపాటు వాళ్ళకాపురం నిలబెట్టు" దండాలు పెట్టుకుంది. ఈ కాలం కాపురాల్ని నిలబెట్టడానికి ఆ దేముళ్ళే పూనుకోవాలేమో అన్న ఆవిడ మనసులోని సందేహానికి కాలమే సమాధానం చెపుతుంది!

కొత్తనీటి వెల్లువ ప్రవాహం వస్తుంటే ఎదురీది లాభం ఉండదు. ప్రవాహం వెంట సాగిపోవాలి గానీ, ఎదురీదితే మునగక తప్పదు. కాలంతెచ్చే మార్పులకు తలొగ్గడం తెలివైనవాళ్ళు చేసేపని. అది గ్రహించినవాళ్ళు సుఖపడతారు అని ఆ తరం వాళ్ళకి అర్థం కావడానికి సమయం పట్టవచ్చు.

**సెల్:92473 31446**



## మోడలింగ్ వైపు బాపూ బొమ్మ

బాపూ బొమ్మగా పేరు తెచ్చుకున్న ప్రణీతకు కాలం అస్సలు కలిసిరావడం లేదు. 'అత్తారింటికి దారేది'లాంటి బ్లాక్ బస్టర్‌ను ఖాతాలో వేసుకున్నా దాన్ని క్యాష్ చేసుకునే తెలివితేటలు ప్రణీతకు లేకుండా పోయాయి. అందుకే ఆమె కెరీర్ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా ఉండిపోయింది. మధ్యలో ఏదో వ్యాపారం ప్రారంభించినా, అది పూర్తిగా సంతృప్తి నివ్వకపోవడంతో ఈ సారి తన దృష్టిని ప్రకటనలవైపు సారించింది. పలు కంపెనీలకు మోడల్‌గా మారింది. సాధారణంగా కొత్త హీరోయిన్ కావాలనుకునే వారు యాడ్స్ వైపు చూస్తారు. అక్కడ ఉన్న మోడల్స్ నుంచి తమకు కావలసిన హీరోయిన్‌ని ఎంపిక చేసుకుంటారు. ఈ పద్ధతి ప్రకారం తనకు ఎవరైనా సినిమా అవకాశం ఇస్తారేమో అన్నది ప్రణీత ఆలోచనట! ఆలోచన అయితే బాగానే ఉంది కానీ, ప్రణీత ఇక్కడ ఓ విషయాన్ని మిస్ అయింది అంటున్నారు సినీజనాలు. కొత్త మోడల్స్ వైపు మాత్రమే దర్శకనిర్మాతల దృష్టి పడుతుంది కానీ, ఆల్‌రెడీ సినిమాల్లో చేసి హీరోయిన్ రేస్‌లో వెనుకబడిన ప్రణీతలాంటి వారి వైపు దర్శకనిర్మాతలు చూడరని అంటున్నారు.



**వసంతనవరాత్రులు. వీరదశమి. స్పర్థకు సిద్ధమయ్యాడు నిధి. జేగంట మోగింది. కత్తితో నిధి ప్రత్యర్థిని ఎదుర్కొన్నాడు. నిధి గెలుస్తాడని బంగారునాణేలు, బంగారునగలు, నవరత్నాలు, గోవులు, గుర్రాలు, పళ్ళతోటలు, వ్యవసాయభూములు...ఇంకా చాలా వాటిని ప్రేక్షకులు పందెంగా కాశారు. నిధి గెలిచాడా? ప్రజల అభిమాననిధిని సాధించాడా?**

వక్కంతం సూర్యనారాయణరావ్

జానపద నవల

# నిధి

త్వరలో...

# కలుపుమొక్క

-ఎలుగంటి వేణుగోపాల్

**"శ్రీ అజిత్‌రావుగారూ! మీకిది భావ్యంకాదు. ప్రభుత్వం ఇచ్చే వేలకు వేలు జీతాలు సరిపోవడం లేదా! మాలాంటి అమాయకుల వెంటపడి లంచాలని పీక్కుతింటూ అవి నీతికి పాల్పడుతున్నారు.." తీవ్ర స్వరంతో ప్రశ్నించాడు దామోదర్.**

**"నువ్విచ్చే డబ్బుల్తో ప్యాలెస్ ఒకటి కట్టుకుందామని.." వెటకారంగా నవ్వుతూ బదులిచ్చాడు అజిత్‌రావు.**

"పదివేలు ఇస్తేనే నీ పని అవుతుంది" పదేపదే అంటున్నాడిదే మాట.

దామోదర్‌కి రుచించడంలేదు. రుచించనిది ఆఫీసర్ చెప్పిన అంకెకాదు. అతను లంచం అడగడం నచ్చడంలేదు.

"మన కరీంనగర్‌జిల్లా ఏసీబీ డిఎస్పీగారు యమస్ట్రిక్టుగా ఉన్నారు. ఆయన్తో ఒకసారి ఫోన్లో మాట్లాడి మిమ్మల్ని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టిస్తాను" బెదిరింపు అస్త్రం ప్రయోగించాడు దామోదర్.

"నాకు రెడీక్యాష్ హ్యాండోవర్ చేయమంటే, రెడ్‌హ్యాండెడ్‌గా పట్టిస్తానంటావేం..?" అన్నాడతను మొండిగా. "మొండివాడు రాజుకన్నా బలవంతుడట" విసుగు ధ్వనించింది దామోదర్ గొంతులో.



"లంచగొండి మొండివాడికన్నా బలవంతుడు" సెటైర్ విసిరాడు అజిత్‌రావు.

"అందుకేమరి మొండితనం ఒంటికి మంచిది కాదు, లంచగొండితనం ఉద్యోగానికి పనికిరాదు" మాటకుమాట సంధించాడు దామోదర్.

"పదీపరకా, వేలు లంచమడిగితేనే ప్రపంచమంతా మునిగిపోయినట్లు తల్లడిల్లిపోతున్నావేం? కుంభకోణాలపేరిట వేలకివేలకోట్లు మెక్కేస్తున్న బడాబాబుల గురించి నీలాంటి ఉత్తమపౌరులు ధర్నాలు, రాస్తారోకోలు, అసెంబ్లీ ముట్టడీలు ఎందుకుచేయరు?" లాజిక్ లాగాడు.

"మనమధ్య జరిగిన సంభాషణ రికార్డు చేశాను. ఏసీబీ ముందుపెట్టి మీ బాగోతం వినిపిస్తే అప్పుడు పైత్యం వదిలిపోతుంది" కసిగా అన్నాడు దామోదర్. "ఎవరైనా అంబాడుతున్న పిల్లవాడుంటే వెళ్ళి వాడికి చెప్పు ఈ కథలు" నిర్లక్ష్యంగా బదులిచ్చాడు అజిత్‌రావు.

'వీడెంత్రా బాబూ! దేనికీ లొంగడంలేదు, కొంచెం కూడా బెదరడంలేదు. బాగా ముదిరిపోయినట్టున్నాడు! లంచగొండుల యూనియన్ గనక ఏర్పాటు చేస్తే వీడుతప్ప మరొకడు అధ్యక్షునిగా పనికిరారు. నో డౌట్!' మనసులోనే తిట్టుకున్నాడు దామోదర్.

"నీటిలో ఉండే చేప నీళ్ళు తాగకుండా ఎలా ఉండలేదో అదేవిధంగా ఓ ఉద్యోగికూడా లంచంముట్టకుండా ఉండలేడు. ఇది ఏనాడో కౌటిల్యుడు సెలవిచ్చినమాట" అంటూ పకపకా నవ్వాడు అజిత్‌రావు.

"లంచం ఇవ్వనని నేనంటున్నాను. లంచం ఇవ్వనిదే పని జరగదని మీరంటున్నారు. సరే చూద్దాం!" అంటూ వడివడిగా వెళ్ళిపోతున్న దామోదర్‌తో, "అదీ చూద్దాం!!" అంటూ ప్రతిసవాల్ విసిరాడు అజిత్‌రావు.

***

ఆరోజు ఆదివారం. సమయం ఉదయం ఏడు గంటలవుతోంది.

ఇంకా నిద్రలేవని భర్తని తట్టిలేపుతూ "ఏవండీ! సెలూన్‌కి వెళ్ళాలి... తొందరగా లేపమన్నారుగా, లేవండి" అంది భవాని.

నిద్రమత్తులోంచి మెల్లమెల్లగా తేరుకుంటూ "ఓకే! ఓకే! డియర్" అంటూ కూర్చుని కళ్ళు నులుముకున్నాడు అజిత్‌రావు.

పదిహేను నిమిషాల్లో సెలూన్ దగ్గరున్నాడు.

ఆ బార్బర్ దగ్గర బాగా రష్ ఉంటుంది. పైగా ఆదివారం. ఏ కాస్త లేటైనా, రెండుమూడు గంటలపాటు చచ్చుకుంటూ కూర్చోవాలి వాడి దగ్గర, లైను అంటాడు మరి. తనకేమో వేరే బార్బర్‌దగ్గర కటింగ్ నచ్చదాయె.



వెళ్ళేసరికి, ఒకరికి గడ్డం గీసేపని పూర్తికావస్తోంది. రెండో అతను కటింగ్‌కోసం వెయిటింగ్. తనేమో మూడోవాడు.

వెయిటింగ్ తప్పదనుకుంటూ లోపల కూర్చున్నాడు. అజిత్‌ని చూడగానే బార్బర్ విష్ చేశాడు. బదులుగా చేయెత్తి పేపర్ పట్టుక్కూర్చున్నాడు. అజిత్‌రావు అలా ఆ షాపులో అడుగుపెట్టాడో లేదో పోలోమని మరో ముగ్గురొచ్చారు.

నలభై అయిదు నిమిషాల అనంతరం అజిత్‌రావు వంతు వచ్చింది. అప్పటికప్పుడే మరో నలుగురైదుగురు చేరారు షాపులోకి!

నిదానంగా కటింగ్‌చేసి, మాలిష్ కూడా చేశాడా బార్బర్.

పనిపూర్తయ్యాక డబ్బులిచ్చి బైక్ తీస్తుంటే, వెనకనుండి ఏవో మాటలు అస్పష్టంగా వినపడ్డాయి అజిత్‌రావుకి.

"మా బంధువు ఒకాయన చెప్పాడు. ఈసారు చిన్నపనికైనా బాగానే గుంజుతాట్ట" బాగా స్వరం తగ్గించి అంటున్నారెవరో.

"అలాంటి బంపర్ అవకాశం నీకూనాకూ దొరుకుతుందా? నా షాపుకివచ్చే కస్టమర్లు అంటుంటే నేనూ విన్నాను, పనికోసం ఎవరైనా ఆయన ఆఫీసుకెళితే జలగలాపట్టి పీడిస్తాడట" బదులుగా అంటూ పళ్ళికిలించాడా బార్బర్.

తనగురించి వాళ్ళు అలా మాట్లాడుకుంటున్న మాటలు చెవిన పడుతుంటే వినీ విననట్టే నటించి స్టన్నైపోయాడు అజిత్‌రావు.

ఒకింత కలవరపడుతూ వెనుతిరిగి వాళ్ళవంక చూసే సాహసం కూడా చేయలేకపోయాడు. ఏమీ ఎరగనట్టే మొహం చాటేసుకుని చప్పున బైకు స్టార్ట్ చేసి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

***

"ఛ! వీడికెన్నిసార్లు చెప్పాలి! సమయానికి ఇస్త్రీ చేసిచ్చి చావడు" విసుక్కున్నాడు అజిత్‌రావు.

"నిన్నకూడా మూడునాలుగుసార్లు ఫోన్ చేశానండీ వాడికి. అమ్మగారూ, ఇప్పుడే వస్తున్నా! ఇదిగో తెస్తున్నా! అంటాడేగానీ రాడు, తేడు" చెప్పింది భవాని.

"తాగితాగి చచ్చాడుగానీ వాడి బాబే నయం. సమయానికి బట్టలు అందించేవాడు. నేనే వెళ్ళొస్తాలే! స్ట్రాంగ్‌డోసు పడందే మాట వినడు వాడు" భార్యకుచెప్పి ఇస్త్రీ దుకాణంవైపు వెళ్ళాడు అజిత్‌రావు.

ఆయన్ని చూడగానే వంగివంగి నమస్కారాలు పెట్టి దొంగ వినయం ప్రదర్శిస్తూ "స్సర్ స్సర్ మీరెందుకు రావడం? నేనే తెచ్చిస్తానన్నాగా, ఒక్క అర గంటలో తప్పకతెచ్చిస్తా!" మళ్ళీ అదేపాట పాడాడు.

ఓవర్ యాక్షన్ చేయడంలో వాడితర్వాతే ఎవరైనా. అజిత్‌రావుకి తెలుసు ఆ విషయం. అందుకే ఒళ్ళు మండింది.

"బుద్ధిలేదూ? పదిరోజులైంది నీకు బట్టలు వేసి. నాకున్న జతలన్నీ నీ దగ్గరే ఉంచుకున్నావ్! ఈరోజు ఫ్యామిలీ అంతా కొండగట్టుకి వెళ్ళే ప్రోగ్రాం పెట్టుకున్నాం. మరి ఏం వేసుకుంటాననుకున్నావ్" గద్దించి అడిగాడు.

"స్సర్ సారీ!" అంటూ చేతులుకట్టుకుని వంగిమరీ నిలబడ్డాడు అతి వినయంగా.

'నక్క వినయాలు వీడూనూ' విసుక్కుంటూ "సరే! సరే! బట్టలైతే తొందరగా తెచ్చివ్వు!" అంటూ బైక్‌వైపు కదిలాడు.

బైక్ స్టార్టు చేయబోయాడంతే!

"గవర్నమెంటు ఉద్యోగులు అదృష్టవంతులు. జీతానికిజీతం, లంచానికి లంచం!" వాడు తనలోతనే గొణుక్కుంటున్నా, అజిత్‌రావు చెవిలో పడనేపడిందా సణుగుడు.

వాడు కావాలనే అన్నాడో, కాకతాళీయంగా అనుకుంటున్నాడోగానీ అజిత్‌రావు తల కొట్టేసినట్టైంది!

అక్కడే ఉంటే, ఆ కంపునోటితో ఇంకా ఎలాంటి మాటలు వినాల్సి వస్తుందోనని అటువైపైనా చూడకుండా బైక్‌ని హడావుడిగా ముందుకు ఉరికించాడు.

***

అందరికంటే ముందే రెడీ అయిన అజిత్‌రావు, భార్యతో "నువ్వు, పిల్లలు తయా

రయ్యేలోగా పెట్రోలు పోయించుకుని ఓసారి మెకానిక్‌ని కలిసొస్తా. బైక్‌కి మైనర్‌ప్రాబ్లమ్ వచ్చిప డింది" అనిచెప్పి బయటపడ్డాడు.

"ఈ బ్రేకులొకసారిచూడు సరిగ్గా పడడంలేదు. పైగా బ్రేకులు వేసినప్పుడల్లా చప్పుడొకటి. కొండగ ట్టుకి వెళ్తున్నాం. నీ చేతిలో బండి పక్కనపెట్టి ముందీ బైక్‌పని కానివ్వు" మెకానిక్‌కి పురమాయిం చాడు అజిత్‌రావు.

వెనుకటికాలంనాటి రాజులకు ఆస్థానవైద్యుడు లాగా అజిత్‌రావు బైక్ కొన్నప్పటినుండి రెగ్యు లర్‌గా ఆ మెకానిక్‌కే చూపిస్తున్నాడు.

"ఇంకెన్నిరోజులీ బైక్‌తో, కారులోకి మారిపోండి సార్! బండి కొని కూడా చాలా రోజులైంది" అంటు న్నాడా మెకానిక్, బైక్ రిపేర్ చేస్తూనే.

నవ్వి ఊరుకున్నాడు అజిత్‌రావు.

"మీ హోదాకి కారు ఉండాల్సిందే సార్!" అన్నాడా మెకానిక్ మళ్ళీ.

రియాక్టవలేదు అజిత్‌రావు. ఆ మెకానిక్‌కి కాస్త నోటిదురద ఎక్కువ.

పనయ్యాక ఓ ఇరవైనోటు చేతిలోపెట్టాడు. కొత్తవాళ్ళైతే ఆ పనికి యాభైకి తక్కువ తీసుకోడు మెకానిక్. సారు రెగ్యులర్ కస్టమర్ కదా! అని ఇంకేమీ అడగలేదు.

తన బైక్‌చుట్టూ మరిన్ని బైక్‌లుండడంతో కాస్త ముందుకు తీసుకెళ్ళి స్టార్ట్ చేద్దామనే ఉద్దేశంతో హ్యాండిల్ పట్టుకొని అజిత్‌రావు బైక్‌తో నడిచి పోబో తుంటే, "ఈ సారుకేం తక్కువన్నా, గాఇరవై నోటి చ్చిండు! ఆఫీసులో సైడుకి మస్తు గుంజుతడంట గదా" అసిస్టెంట్ ఎవరో కామెంట్ చేస్తున్నట్టు న్నాడు మెల్లగా వెనక నుండి.

మెకానిక్ ముసిముసిగా నవ్వుతున్నాడు.

"వద్దువద్దన్నా డబ్బు తేరగావస్తుంటే, హాయిగా కారు కొనుక్కోక ఏందో పీనాసితనం ఈ సారుకి. ఆఫీసులో ఆయన బాగోతం ఎవరికీ తెల్వ దనుకుంటుండో ఏందో మరి" మెకానిక్‌కూడా వంతపాడాడు లోగొంతుకతో. తమలోతాము చాటుగా గుసగుసలాడుకుంటున్నాం అనుకున్నట్టు న్నారుగానీ, ఆ మాటలు అజిత్‌రావు చెవినికాదు, ఏకంగా గుండెల్నే తాకాయి.

ఆ సూటిపోటు మాటలు వింటే ఎవరో కొరడాతో వాతలు తేలేలా కొట్టినట్టయ్యింది. అజిత్‌రావు మనసు చివుక్కుమంది. బాధగా బైక్ స్టార్ట్ చేశాడు.

***

నెలాఖర్లో ఎలాగో బర్త్‌డే వస్తోంది. ఏకంగా నాలుగు డ్రెస్సులు కుట్టించుకోవాలని నిర్ణయించుకున్నాడు అజిత్‌రావు.

"అప్పుడే మీరు ముసలివాళ్ళేం అయిపోలేదు గానీ, జీన్సులు, టీ షర్టులు వేసుకోండి. మోడ్రన్‌లుక్ లోకి మారిపోండి" అని ఎప్పుడూ పోరు పెడు తుంది భవాని. రెడీమేడ్‌దుస్తులంటే అజిత్‌రావు ఇష్ట పడడు. నిక్కర్లు వేసుకుంటున్నప్పటినుండీ 'ఓ.యస్' అనే టైలర్ దగ్గరే బట్టలు కుట్టించుకుంటున్నాడు. దర్జీ శంకర్ ఈ కాలానికి తగ్గట్టు, అజిత్‌రావు అభి రుచికి తగినట్టు కుట్టిపెడతాడు. అందుకే క్లాత్‌తో వెళ్ళి అతడిని కలిశాడు అజిత్‌రావు. "పాంట్లు బాగా టైట్ అవుతున్నాయి. లేచినా, కూర్చున్నా నడుము దగ్గర పట్టేసినట్టవుతోంది. కొలతలు మార్చాలి" అన్నాడు శంకర్‌తో అజిత్‌రావు.

"చిన్న పిలగానివి కాదు కదా సారు! ఉద్యోగం వచ్చె. ప్రమోషన్ తెచ్చి, హోదా మార్చె. బొడ్డు కూడా పెరిగె" అంటూ నవ్వాడు శంకర్.

"ఈ పాంట్ కంటే ఒక ఇంచు ఎక్కువ పెడతా!" అన్నాడు మళ్ళీ.

సరేనన్నట్టు తలూపాడు అజిత్‌రావు.

"నమస్తే నారాయణసారు! అంటూ పలకరిస్తే చాలు. లాక్కెళ్ళి హోటల్‌లో చాయ్ తాగించేవారు. అంత మంచి, మర్యాద ఉన్న వ్యక్తి మీ నాన్న! ఎదు టవారికి ఇవ్వడంతప్ప, ఎవ్వరిదగ్గరా నయాపైసా ఆశించలేదు. మంచిబంగ్లా కట్టాలని మీ నాన్నగా రికో కోరిక ఉండేది. మిమ్మల్ని చదివించడానికి అప్పులు చేసిచేసి జీవితాంతం అలసిపోయారు. కానీ పాపం బంగ్లాకట్టాలనే ఆశమాత్రం తీరకుండానే పోయారు" లొడలొడా వాగుతూనే పాంటు కొల తలు తీసుకోవడం పూర్తిచేశాడు శంకర్.

ఎన్నడూ లేనిది, ఈరోజు ఇవన్నీ తనకి ఎందు కిలా చెప్తున్నాడో అర్థం కాలేదు అజిత్‌రావుకి. అయినా ఏం మాట్లాడితే ఏమవుతుందో అని నిశ్శ బ్దంగా ఉండిపోయాడు.

**లంచం ఇవ్వనిదే ఫైలు కదలదంటున్నాడు ఆ అధికారి. ఒక్కరూపాయి కూడా ఇవ్వనంటు న్నాడు ఆ నిజాయితీపరుడు! ఏ.సి.బి అధి కారులకు ఫిర్యాదుచేసి రెడ్ హ్యాండెడ్‌గా పట్టిస్తానని హెచ్చరించినా బెదరడంలేదు ఆ అధికారి. మొండివాడు రాజు కన్నా బల వంతుడని మరచిపోకు అని ప్రతి సవాలు చేస్తున్నాడు. ఈ సవాళ్ళు ప్రతి సవాళ్ళ మధ్య నీతి గెలిచిందా? అవినీతి గెలిచిందా?**

షర్ట్ కొలతలు కూడా తీసుకుని బుక్‌లో రాసు కుంటూ "చేతులు తడపందే ఏ పనీ చేయడట! అంటూ ఆ నోటా ఈ నోటా బయట మీ గురించి ఏదేదో చెడుగా వినపడుతోంది సారూ! ఎవరో నాతోనే చెబితే, నేను నమ్మలేదనుకోండి. మీ నాన్న ఎలాంటివారో నాకు బాగా తెలుసు. ఆయన నిజాయితీ ఏంటో తెలుసు. మీలో ప్రవహిస్తున్నది ఆయన రక్త మేగా! ఎందుకైనా మంచిది జాగ్రత్తసారూ!" అంటూ హితబోధ చేశాడు శంకర్.

చివరకు ఈ పెద్దాయన కూడా పరోక్షంగా తనని వేలెత్తి చూపుతుంటే తట్టుకోలేకపోయాడు. ఉన్నపళంగా తల పాతాళానికి కూరుకుపోతున్న భావన కలిగింది అజిత్‌రావుకి.

***

"ఏమండీ! పనిమనిషి జీతం పెంచమని అడుగు తోంది" చెప్పింది భవాని. "ధరలన్నీ పెరుగుతున్నాయి కదా! ఆమె అడగడంలో తప్పేముంది? ఈచిన్న విషయం నాదాకా తేవడం దేనికి? యాభయ్యో, వందో పెంచకపోయావు?" అన్నాడు అజిత్‌రావు.

"అది కాదండీ! ఏకంగా జీతం రెట్టింపు చేయ మంటోంది" అసలు విషయం చెప్పింది. "అంట్లు ఒక్క టేగా తోమేది? ఇప్పుడిస్తున్న ఆరువందలే ఎక్కువ!" విసుక్కున్నాడు అజిత్‌రావు. "ఆ మాటే నేనంటే అలిగి వెళ్ళిపోయింది."

"పనివాళ్ళతో ఇదో తలనొప్పి"

"గాసారు ఆఫీసులో బగ్గనే లంచం తీసుకుంటు డట. గొంత జీతం పైసలు పెంచుండ్రంటే సప్పుడు సేత్తలేరు. గమ్మత్తున్నరు అని పక్కింటి వాళ్ళతో బాహాటంగానే అరుస్తోంది పనిమనిషి. అటుగా వెళ్ళిన నేను బయటే నిలబడి స్పష్టంగా విన్నాను. పనిమనిషి అంత మాటనేసరికి సిగ్గనిపించింది!" అంటూ వాపోయింది భవాని.

నిరుత్తరుడైన అజిత్‌రావు, "ఇదెక్కడి టార్చర్‌రా బాబూ!" అని తలపట్టుకున్నాడు.

"ఏమండీ! ఒకమాట. ఆఫీసులో మీరు అలాంటి పనులేమైనా చేస్తుంటే ప్లీజ్... మాను కోండి! ఆ పనిమనిషి మీ గురించి దుష్ప్రచారం చేస్తుంటే తట్టుకోలేకపోయా. అయినా నిప్పులేనిదే పొగ రాదంటారు. ఎలాంటి పాపిష్టి సొమ్మూ మన కొద్దు. మీకొచ్చే జీతం డబ్బులు చాలు" బాధ పడింది భవాని.

భార్యకూడా తనపై నిందారోపణ చేస్తుంటే,



# సల్మాన్‌ని తనకు వదలమంటోంది

కత్రినా ఏది చేసినా అతిగానే చేస్తూ ఉంటుంది అంటూంటారు బాలీవుడ్ జనాలు. ఆ మాటకు నూటికి నూరుపాళ్ళు న్యాయం చేసింది కత్రినా. రణబీర్ నుంచి విడిపోయిన తరువాత కొద్దిరోజులు ఒంటరిగా ఉండిపోయిన కత్రినా ఇప్పుడు మాజీ లవర్ సల్మాన్‌తో జత కట్టింది. ఇదేదో రహస్యంగా కాకుండా బహిరంగంగానే ఇద్దరూ తిరుగుతున్నారు.

ఇటీవల ఐఫాలో జరిగిన ఓ ఇంటర్వ్యూలో ఆలియా, కత్రినా, సల్మాన్ ముగ్గురూ కలిసి పాల్గొన్నారు. ఈ సందర్భంగా కత్రినా మాట్లాడుతూ, సల్మాన్‌ని తనకు వదిలేయండి అంటూ చెప్పుకొచ్చింది. సల్మాన్ కూడా కత్రినాలాగానే మాట్లాడాడు. ఇప్పుడు ఈ మాటలే బాలీవుడ్‌లో చర్చకు దారితీశాయి.



అజిత్‌రావు గుండెనెవరో మెలిపెట్టినట్టయ్యింది.

"మళ్ళీ మీ గురించి అలా చెడుగా వినపడిందంటే పిల్లలమీద ఒట్టే!" అంది భవాని. అజిత్‌రావుని ఆలోచనలు చుట్టుముట్టాయి.

"ఎవరో కావాలనే పనిగట్టుకుని మరీ వ్యూహాత్మకంగా తనచుట్టూ ఈ అపవాదుకంచె నాటుతున్నారు" ఆలోచనలతో అజిత్‌రావు బుర్ర వేడెక్కిపోతోంది.

ఇంకెవరు? ఇదంతా ఆ దామోదర్ పన్నిన పన్నాగమే అని అర్థమైంది అజిత్‌రావుకు. మరుసటి రోజు వెంటనే దామోదర్‌ని ఆఫీసుకి పిలిపించాడు అజిత్‌రావు.

***

కథ ప్రారంభంలో, ఆఫీసులో అజిత్‌రావు, దామోదర్ మధ్య జరిగిన సంభాషణ వాస్తవం కాదు...!

అది దామోదర్ అల్లిన కట్టుకథ.

సెలూన్ వ్యక్తి, ఇస్త్రీ అతను, మెకానిక్, దర్జీ, పనిమనిషి...వీళ్ళందరి దగ్గర సింపతీ కోసం దామోదర్ సృష్టించిన నకిలీ సన్నివేశం అది!

అతడి వ్యూహం ఫలించింది.

వాళ్ళంతా దామోదర్ విసిరిన డబ్బుకిలొంగి కీలుబొమ్మలయ్యారు. అతడు ఆడమన్నట్టు ఆడారు.

నిజానికి ఈ కథలో అసలు విలన్ దామోదర్! తన అక్రమలీజుని సక్రమంగా మార్చమని అజిత్‌రావు వెంటపడుతున్నాడు.

అజిత్‌రావు నిప్పులాంటి మనిషి. ససేమిరా వీల్లేదన్నాడు. ఫైలుమీద సంతకం చేయనన్నాడు. లంచం ఎరచూపినా, కళ్ళెర్రజేసినా దామోదర్‌కి లొంగలేదు. అతణ్ణి ఆఫీసులోంచి అవమానించి పంపించాడు అజిత్‌రావు.

అది మనసులో పెట్టుకొని మాయలమారి దామోదర్ ఒక దుష్టాలోచన చేశాడు. స్ట్రిక్టు అధికారిని తన వలలో వేసుకోవడానికి, అతడిచుట్టూ ఒక అపవాదు సృష్టించాడు. లంచగొండి అనే కంచె బిగించాడు. ఇలాంటి చేదు అనుభవం ముందెన్నడూ చవిచూడని అజిత్‌రావు సహజంగానే బెదిరిపోయాడు. ఏంచేయాలో పాలుపోక తన ప్రమేయం లేకుండానే దామోదర్ ఉచ్చులో చిక్కుకున్నాడు.

***

అరచేత్తో నుదురు రాసుకుంటూ "ఈ రోజు ఎలాగైనా నీ ఫైలు పని పూర్తి చేయిస్తాను. సాయంత్రంవచ్చి తీసుకెళ్ళు" అని చెప్పాడు అజిత్‌రావు.

"హమ్మయ్య! ఇప్పటికైనా కళ్ళు తెరిచారు. చాలా సంతోషం!" అజిత్‌రావుతో నవ్వుతూ చెప్పాడు దామోదర్.

అజిత్‌రావు పక్కనున్న కిటికీలోంచి బయటకు చూస్తుండిపోయాడు.

"బాధపడకండి. మీ వాటా మీకు పువ్వుల్లో పెట్టి ఇస్తా" నమ్మకంగా చెప్పాడు దామోదర్.

"అక్కర్లేదు. తేరగావచ్చే పాపపుసొమ్ములో ఒక్క రూపాయికూడా నేను ముట్టను" అసహనం వ్యక్తంచేశాడు అజిత్‌రావు.

"పదుగురాడు మాట పాటియై ధరచెల్లు... అనే నానుడిని నిజం చేస్తూ ఎలాగూ సమాజంలో లంచగొండి అనే ముద్రపడింది. దాన్ని అలాగే కంటిన్యూ కానివ్వండి. వచ్చే ధనలక్ష్మిని ఎందుకు కాలదన్నుకుంటారు?" వెకిలి నవ్వొకటి రువ్వాడు దామోదర్.

కోపం అణచుకుంటూ "చూడూ! యదార్థవాది ఎప్పుడూ లోక విరోధే! నువ్వు నా గురించి దుష్ప్రచారం చేసినంత మాత్రాన నేను చెడ్డవాడినై పోను! నిజం నిలకడ మీద తెలుస్తుందిగానీ ఇక నీవు వెళ్ళొచ్చు" అజిత్‌రావు సాధ్యమైనంత శాంతంగా చెప్పాడు.

"నయాపైసా ఖర్చులేకుండా పని జరుగుతుంటే కాదంటావా?" భుజాలెగరేస్తూ లేచి నిలబడ్డాడు దామోదర్.

"ఇప్పుడీ పబ్బం గడిచిపోయిందని సంబరపడిపోకు! నీ వ్యాపారమంతా మా ఆఫీసుతోనే ముడిపడి ఉందన్న విషయం విస్మరించకు. డబ్బుతో అందర్నీ కొనలేవు. ఎప్పటికైనా చిక్కుతావు. అప్పుడు నీ అవినీతికి భారీగా పాపపరిహారం చెల్లించాల్సి వస్తుంది. మైండిట్!"

"ఇవన్నీ చేతకానివాడు చెప్పే కహానీలు"

'నీవొక కలుషిత వర్షబిందువువి!

సరళరేఖలాంటి నిర్మాణాత్మక సమాజాన్ని నీలాంటి తుచ్ఛబిందువులు ఎన్ని ఢీకొన్నా వాటివల్ల నష్టమేమీ ఉండదు..! వివర్ణమై, విచ్ఛిన్నమై, విధ్వంసమై, చెల్లాచెదురవుతూ, చరిత్రహీనులుగా మిగిలిపోవడం తప్పు...!!" ఆవేశం కట్టలు తెంచుకుంది అజిత్‌రావులో.

దామోదర్ నిర్లక్ష్యంగా చూశాడు ఆ అధికారి వంక.

"నాలాంటి తులసిమొక్కకి కలుపుమొక్కరంగు పులుమే ప్రయత్నం చేసినంత మాత్రాన ఏమీ కాదు, ఈ అబద్ధం ఎన్నిరోజులని దాగుతుంది?

ఎప్పటికైనా తులసిదళం సుగుణం బయట పడక తప్పదు!

ఒక కలుపుమొక్కవచ్చి నేను తులసిమొక్కని అంటూ నమ్మబలికినంత మాత్రాన సరిపోతుందా? నిజం నిలకడమీద తేలిన మరుక్షణం అది కూకటి వేళ్ళతో సహా పెకిలించబడుతుంది...!"

ఆ మాటలకు బెదిరిన దామోదర్ అక్కడినుండి నిష్క్రమించాడు.

**సెల్: 9440236055**

# సౌభాగ్య చక్రం

జూన్ 14 నుంచి జూన్ 20 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

విద్య, ప్రయాణాలు, సోదరీసోదరుల విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. 16, 17 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించాలి. 18, 19 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. స్టేషనరీ, ఏజెన్సీలు, రవాణా రంగాల వారు, రిప్రజెంటేటివ్‌లు, టీచర్లకు శుభప్రదం. 20న బిల్లులు, విలువైన పత్రాలు అందుకుంటారు. పెట్టుబడులకు సంబంధించిన చర్చలకు అనుకూల సమయం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, షాపింగ్, ఆర్థికపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 16, 17 తేదీల్లో బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. 18, 19 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. పెట్టుబడులకు సంబంధించి సమాచారం అందుకుంటారు. ఉన్నత విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 20న పెట్టుబడులపై కీలక నిర్ణయాలు తీసుకుంటారు. పొదుపు, అదనపు ఆదాయం గురించి ఆలోచిస్తారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆర్థిక నిర్ణయాలు, దూరప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. న్యాయ, బోధనా రంగాలవారికి ప్రోత్సాహకరం. 16, 17 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కీలక అంశాలపై దృష్టి సారిస్తారు. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి అనుకూల సమయం కాదు. పెద్దలతో ఆచితూచి వ్యవహరించాలి. 18, 19 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. సమావేశాల్లో కొత్త పరిచయాలు ఏర్పడతాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 20న ఉన్నత విద్యా వ్యవహారాలకు అనుకూలం. సినీ, రాజకీయ రంగాలవారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో పాత బకాయిలు వసూలవుతాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. వైద్యం, విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 16, 17 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారు ఆచితూచి ముందడుగు వేయాలి. మనశ్శాంతి లోపిస్తుంది. వేడుకలు, సమావేశాల్లో పాల్గొంటారు. 18, 19 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. గౌరవ మర్యాదలు పెంపొందుతాయి. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 20న సభల్లో పాల్గొంటారు. సన్నిహితులకు సంబంధించిన రహస్య సమాచారం అందుకుంటారు.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. జనసంబంధాలు విస్తరిస్తాయి. 16, 17 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించక పోవచ్చు. మ్యూచువల్ ఫండ్స్, బీమా లావాదేవీలకు అనుకూలం. 18, 19 తేదీల్లో సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. న్యాయ, బోధన, రక్షణరంగాలవారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. చర్చలు ఫలిస్తాయి. 20న సమావేశాల్లో గౌరవ మన్ననలు అందుకుంటారు.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, చిన్నారుల విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విద్యార్థులకు ప్రోత్సాహకరం. 8, 9, 10 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత నిరుత్సాహం కలిగిస్తాయి. పెద్దలు, పైఅధికారుల వైఖరిలో సానుకూలమైన మార్పు గమనిస్తారు. కుటుంబ విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11, 12 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పెద్దల సహకారంతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. 13న ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

విద్య, వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. అడ్మిషన్లు లభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 16, 17 తేదీల్లో హోటల్, వైద్య, ఉపాధి రంగాల వారికి నిరుత్సాహకంగా ఉంటుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 18, 19 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 20న గత అనుభవంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 16, 17 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పెట్టుబడులు, పొదుపు పథకాల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. ఫీజుల చెల్లింపునకు అవసరమైన నిధులు సర్దుబాటవడంలో ఇబ్బందులు ఎదురవుతాయి. 18, 19 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. వైద్యం, హోటల్, వినోద రంగాలవారికి ప్రోత్సాహకరం. 20న స్పెక్యులేషన్లు లాభిస్తాయి. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది..



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సోదరీ సోదరుల విషయాలు, భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సమావేశాలు, చర్చల్లో కీలకపాత్ర పోషిస్తారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. 16, 17 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 18, 19 తేదీల్లో చిన్నారుల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. బ్యాంకులు, చిట్‌ఫండ్ రంగాల వారికి ప్రోత్సాహకరం. 20న కొత్త పరిచయాలు ఏర్పడతాయి. హోటల్, వైద్య రంగాల వారికి ప్రోత్సాహకరం.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, ప్రయాణాలు, బదిలీలు, వేడుకలు, చిన్నారుల విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంక్రిమెంట్లు అందుకుంటారు. హోటల్, వైద్యరంగాల వారికి అనుకూల సమయం. 16, 17 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం కోసం అధికంగా శ్రమించాలి. వృత్తిపరమైన చర్చలు ఫలించకపోవచ్చు. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. 18, 19 తేదీల్లో కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగవుతుంది. బదిలీలు, సీట్ల మార్పిడికి అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. 20న ప్రియతములతో విందు వినోదాల్లో పాల్గొంటారు. ప్రేమలు ఫలిస్తాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, విద్యా విషయాలు, బదిలీలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సాంకేతిక కోర్సుల్లో అడ్మిషన్లు లభిస్తాయి. 16, 17 తేదీల్లో పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సకాలంలో అందక ఇబ్బంది పడతారు. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 18, 19 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. కీలక సమాచారం అందుకుంటారు. 20న ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, నిర్మాణం, విద్యా విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. 16, 17 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు ఆచితూచి ముందడుగు వేయాలి. బదిలీ ప్రయత్నాలు బెడిసికొట్టే అవకాశం ఉంది. కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. 18, 19 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల సహకారం లభిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ప్రోత్సాహకరం. 20న విద్యార్థులకు అడ్మిషన్లు లభిస్తాయి. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. నవ్య




# కమల్ కోపంలో అర్థం లేదట!



లోకనాయకుడు కమల్‌కి కోపం ముక్కుమీదే ఉంటుంది అంటూంటారు. ప్రతి చిన్న విషయానికి తీవ్రంగా స్పందించడం ఆయన నైజం. ఆ కోపంలో ఎన్నెన్నో మాటలు మాట్లాడేస్తుంటారు. జయలలిత జీవించి ఉన్నప్పుడు ఆమె మీద కోపంతో తమిళనాడుని వదిలేస్తానని రంకెలు వేశారు. ఇప్పుడు మోదీమీద కోపంతో సినిమాలే మానేస్తాను అంటున్నారు. ఇంతకీ అసలు సంగతేమిటంటే జిఎస్‌టి బిల్లు గురించే కమల్ ఆక్రోశం అంతా! ఆ బిల్లు అమల్లోకి వస్తే ప్రాంతీయ సినిమాలు బతికి బట్టకట్టలేవన్నది ఆయన వాదన! అయితే ఏ బిల్లు వచ్చినా చివరికి భరించేది ప్రేక్షకుడే! ఈ బిల్లు అమల్లోకి వస్తే సినిమా థియేటర్ వాళ్ళు రేట్లు పెంచవచ్చు. ఆ రేట్లను భరించే వారే సినిమా చూస్తారు కానీ, కమల్ మీద ఆ భారం ఎందుకు పడుతుంది? అన్నది కొందరి వాదన! సినిమా థియేటర్ల వాళ్ళు ఎంత రేట్లు పెంచినా కమల్ అభిమానులు చూస్తూనే ఉంటారు. అలాంటప్పుడు ఆయన సినిమాలకూ, ఆయనకూ వచ్చే నష్టం ఏమీ ఉండదు. ఒకవేళ ఆయన ఒక్కడూ సినిమాల నుంచి తప్పుకున్నా వచ్చే నష్టమూ ఉండదు, లాభమూ ఉండదు కనుక కమల్ ఇలాంటి మాటలు మానుకోవాలని తమిళ తంబీలు ఆయనకు సలహా ఇస్తున్నారు

## శ్రీదేవిని ఇబ్బంది పెడుతున్న శివగామి

శ్రీదేవికీ, శివగామి(రమ్యకృష్ణ)కీ సంబంధం ఏమిటి? అన్న అనుమానం వస్తోంది కదూ! నిజానికి వీరిద్దరికి ఎలాంటి సంబంధమూ లేదు. అసలు ఇబ్బంది అంతా ఓ సినిమా కారణంగానే! 'బాహుబలి'లో శివగామి క్యారెక్టర్‌కు ముందు శ్రీదేవిని సంప్రదించడం, ఆ తరువాత రమ్యకృష్ణ చేతికి ఆ పాత్ర చేరడం తెలిసిందే! ఇదంతా గతం కదా? ఇప్పుడు తిరిగి ఆ గొడవ ఎందుకు అన్న అనుమానం వస్తోంది కదా! శ్రీదేవి ఇటీవల ఎక్కడి కెళ్ళినా శివగామి పాత్రను మీరెందుకు చేయన న్నారు? అనే ప్రశ్నే ఎదురవుతోంది. ఆఖరికి ఆమె తాజా సినిమా 'మామ్' ప్రమోషన్‌లో పాల్గొన్నా కూడా అందరూ ఇదే మాట అడుగుతుండడంతో శ్రీదేవి తెగ ఇబ్బంది పడుతోందట! శివగామి ఇంత ఇబ్బంది పెడుతుందన్న సంగతి తెలిస్తే ఆ సినిమా వదులుకునేదాన్ని కాదు అని తన సన్నిహితుల వద్ద అంటోందని సమాచారం! ఏదైనా పోగొట్టుకుంటేనే దాని విలువ తెలుస్తుంది అంటారు. శ్రీదేవి విషయంలో సరిగ్గా ఇదే జరుగుతోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు.



ఇప్పుడే కాదులెండి! దానికి ఇంకా ఏడెనిమిది నెలల సమయం ఉంది. ఈ సినిమా వసూళ్ళను అధిగమించే సినిమా '2.0'. శంకర్ దర్శకత్వంలో రజనీకాంత్ నటిస్తున్న ఈ సినిమాను తక్కువ అంచనా వేయడానికి వీల్లేదని సినీ జనాలు అంటున్నారు. దానికి వాళ్ళు చెప్పే కారణాలు ఇవి....'రోబో' వచ్చినప్పుడు దాని వసూళ్ళు చూసి అందరూ విస్తుబోయారు. ఆ

## 'బాహుబలి' రికార్డులు బద్దలవుతాయట!




స్థాయిలో వసూలు చేసింది. తిరిగి దాని సీక్వెల్ వస్తోందంటే అందరికీ సహజంగానే ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. దీనికి తోడు ఈ సినిమా కోసం పెద్దల కన్నా పిల్లలే ఎక్కువగా ఎదురు చూస్తున్నారట! వీళ్ళే రిపీటెడ్ ఆడియన్స్ కనుక వసూళ్ళలో ఈ సినిమా కచ్చితంగా 'బాహుబలి' రికార్డులు తిరగరాస్తుందని అంటున్నారు. మొత్తం మీద ఇప్పటి వరకూ ఉన్న 'బాహుబలి' రికార్డులను రోబో '2.0' బద్దలు చేస్తుందని కొందరు జోస్యం కూడా చెబుతున్నారు.



## పూజలు చేసినందుకే అవకాశాలా?

హీరోయిన్‌గా త్రిష కెరీర్ అటకెక్కింది అనుకున్న సమయంలో కోలీవుడ్‌లోనూ, టాలీవుడ్‌లోనూ అవకాశాలు దక్కించుకుంది. వీటితో త్రిష కెరీర్ ఊపందుకుంటుంది అనుకున్న తరుణంలో కథ మళ్ళీ మొదటికొచ్చినట్టయింది. అవకాశాల కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూసింది. ఈ సమయంలో ఎవరో చెబితే బాంకాక్ వెళ్ళి మరీ అక్కడ పూజలు చేయించింది. దాంతో ఇప్పుడు త్రిష చేతిలో వరుసగా అరడజనుకు పైగా సినిమాలు ఉన్నాయి. కాకపోతే ఇవన్నీ తమిళ సినిమాలే! అయితేనేం? ఒక్క సినిమా హిట్టయినా త్రిష కెరీర్ మలుపు తిరగడం ఖాయం అంటున్నారు సినీ జనాలు. అవకాశాలు లేని వారందరూ త్రిషలాగా బ్యాంకాక్ వెళ్ళి పూజలు చేయిస్తే అవకాశాలు వస్తాయని తమిళ తంబీలు సరదాగా జోకులు వేస్తున్నారు కూడా!

# మా ఆయన బంగారం

## -జ్యోతిక

**చెంపకు చారడేసి కళ్ళు అన్నట్టు ఉండే ఆ పెద్ద పెద్ద కళ్ళు ఎదుటివారితో ఎన్నో కబుర్లు చెబుతాయి ఇక ముఖమంతా పరుచుకున్నట్టు ఉండే ఆ నవ్వు చూసిన వాళ్ళు ఆమెతో స్నేహం చేయకుండా ఉండ లేరు. ఆ మహిళ మరెవరో కాదు.... జ్యోతిక. వైఫ్ ఆఫ్ సూర్య. భార్యగా, తల్లిగా కుటుంబానికి న్యాయం చేస్తూనే తనకు గుర్తింపునూ, పేరునూ తెచ్చిపెట్టిన వెండితెరను మరిచిపోలేదు. అడపా తడపా మనసుకు నచ్చిన పాత్రలు చేస్తూ తన పాత్రల ద్వారా మహిళలకు ఏదో ఒక సందే శాన్ని అందిస్తున్న జ్యోతికతో....**

**మీ సెకండ్ ఇన్నింగ్స్ ఎలా ఉంది?**

హీరోయిన్‌గా చేసినప్పటి కన్నా ఇప్పుడు బాగా ఎంజాయ్ చేస్తున్నాను. హీరోయిన్‌గా చేసేటప్పుడు కొన్ని పరిమితులు ఉంటాయి. అలాంటివి ఇప్పుడు నాకేమీ లేవు. అప్పటికన్నా ఇప్పుడు ప్రశాంతంగా హాయిగా ఉంది. మంచి మంచి కథలు వస్తున్నాయి. మొత్తంమీద చాలా హ్యాపీగా ఉన్నాను. చాలావరకూ ఏదో ఒక మెసేజ్ ఇచ్చే సినిమాలు చేయడానికి ప్రయత్నిస్తున్నాను.

**ఇప్పటికీ మీమీద ఒత్తిడి ఉంటుందా?**

నటిగా ఎప్పుడైనా ఆ ఒత్తిడి ఉంటూనే ఉంటుంది. ఎన్ని సినిమాలు చేసినా షూటింగ్ మొదటి రోజు టెన్షన్ పడుతూనే ఉంటాను. కొన్నిసార్లు ఆ టెన్షన్‌లో డైలాగులు కూడా మరచిపోతుంటాను. అదంతా కొంతకాలం మాత్రమే! ఆ తరువాత అలవాటై పోతుంది.

**మీరు తిరిగి సినిమాల్లో నటిస్తానంటే మీ ఫ్యామిలి ఎలా ఫీలైంది?**

సూర్య అయితే నీ ఇష్టం వచ్చింది చేయి అంటూ నాకు ఎప్పుడో బోలెడంత ఫ్రీడమ్ ఇచ్చేశారు. పిల్లలు కూడా 'మా మమ్మీ సినిమాల్లో నటిస్తోంది' అంటూ సంతోషంగా చెప్పుకుంటారు. పిల్లలు పెద్దవాళ్ళు అయ్యారు కనుక వాళ్ళ పనులు వాళ్ళు చేసుకోగలుగుతున్నారు. నా అవసరం వారికి పెద్దగా లేదు. వీలైనంత వరకూ వారి బాధ్యతలన్నీ నేనే తీసుకుంటాను. సూర్య ఇంట్లో ఉన్న సమయంలో ఆయన చూసుకుంటారు. మా ఫ్యామిలీ సపోర్టు ఉంది కనుకే తిరిగి కెరీర్‌ను ప్రారంభించగలిగా గాను. మా అత్తమామల సపోర్టు మరువలేనిది. పిల్లలకు ఏ అవసరం వచ్చినా వారు ముందుండి







చూసుకుంటారు.

**సెకండ్ ఇన్నింగ్స్‌లో '36 వయదినిలే' లాంటి సినిమా చేయడానికి కారణం?**

నా మనసులోని వేదనకు, సంఘర్షణకు ప్రతి రూపంలా ఈ సినిమా అనిపించింది. సినీ రంగంలో పురుషాధిక్యత చాలా ఉంది. ఈ రంగంలో హీరోయిన్లు తమ స్థానం ఎలాంటిదో తెలుసుకోవడానికే ఈ పాత్ర చేశాను. స్త్రీలు, హీరోయిన్లు తమ రోజువారీ జీవితంలో మరింత దృఢంగా మారడానికి ఈ పాత్ర ఉపయోగ పడుతుందనే ఉద్దేశంతోనే చేశాను. నా ప్రయత్నం చాలావరకూ ఫలించిందనే అనుకుంటున్నాను.

**ఎలాంటి పాత్రలు చేయాలని అనుకుంటున్నారు?**

మన సినిమాల్లో ఎక్కువగా ఇద్దరు ముగ్గురు అమ్మాయిలు హీరో చుట్టూ తిరుగుతూ ఉంటారు. హీరోని ధీరోదాత్తుడిగా చూపించడం వరకూ నాకెలాంటి అభ్యంతరం లేదు. హీరోని గొప్పవాడిగా చూపించడం కోసం పక్కన ఉండే స్త్రీ పాత్రలను కించపరచడం ఎందుకు? ఒక హీరోకి, ఒక హీరోయిన్ సరిపోదా? ఇద్దరు ముగ్గురు కావాలా? చాలా సంవత్సరాల నుంచి ఇదే కథ నడుస్తోంది. అన్ని సినిమాలూ లేడీ ఓరియెంటెడ్ సినిమాలు కానక్కర్లేదు. అదే సమయంలో సినిమాల్లో మహిళా పాత్రలకు తగిన ప్రాముఖ్యం, ప్రాతినిధ్యం కల్పించాలి కదా? నా సినిమాల్లో ఈ రెండూ ఉండేటట్టు చూసుకుంటున్నాను. అలాంటి కథలకే ఓకే చెబుతున్నాను.

**కథల ఎంపిక ఎలా చేసుకుంటారు?**

సూర్య, నేనూ కలిసి కథలు వింటూంటాం. ఒక్కోసారి తను బిజీగా ఉండి వినడానికి కుదరక పోతే నేను ఒక్కదాన్నే వింటాను. తరువాత ఇద్దరం కలిసి ఆ పాత్ర గురించి డిస్కస్ చేసుకుంటాం. చాలా వరకూ ఆఖరి నిర్ణయం నాదిగానే ఉంటుంది. నేను ఏ సినిమాకి ఓకే చెప్పినా తనేమీ అనడు. ఓకే అనేస్తాడు. ఒక కథ విన్న వెంటనే ఆ పాత్రలో నన్ను నేను చూ సు కుం టా ను. నాకు సరి పోతుంది అనిపిస్తే వెంటనే ఓకే చెప్పేస్తాను. చాలా మంది టీనేజ్ హీరోయిన్లకు అమ్మగా చేయమని అడుగుతున్నారు. సెకండ్ ఇన్నింగ్స్ అనగానే అమ్మ, అక్క, వదిన పాత్రలు తప్ప మరో పాత్ర గుర్తుకు రాదా అనిపిస్తూ ఉంటుంది. నేను మరీ అంత ఓల్డ్ అయిపోయానా? అన్న అనుమానం కూడా కలుగుతుంటుంది. అలాగని మరీ యంగ్ హీరోయిన్లు చేసే పాత్రలు కావాలని అడగడం లేదు.

**సూర్య సినిమాల ఎంపికలో మీ జోక్యం ఎంత?**

మొదటినుంచీ నాకు తన సినిమాల్లో జోక్యం చేసుకునే అలవాటు లేదు. సూర్య ఎప్పుడైనా సరే తన కొత్త సినిమా కథను ముందుగానే నాకు చెబుతాడు. నా అభిప్రాయం అడిగితే చెబుతాను. అంతే తప్ప అంతకు మించి నా జోక్యం ఉండదు తను కూడా అలానే ఫాలో అవుతాడు. నిజంగా మా ఆయన బంగారం. ఇద్దరం ఒకే రంగంలో ఉన్నా, ఎవరి దారి వారిదే అన్నట్టుంటాం.

**సూర్య, మీరు కలిసి నటించే అవకాశం ఉందా?**

మా ఇద్దరి కాంబినేషన్‌లో ఓ సినిమా చేయాలని నాకూ ఉంది. అన్నీ కలిసి రావాలి కదా! వస్తే తప్పకుండా చేస్తాం.

**హీరోయిన్‌గా మంచి ఫాంలో ఉండగానే పెళ్ళి చేసుకున్నారు కదా? అలా చేసుకున్నందుకు బాధ అనిపించలేదా?**

ఒక ఆడపిల్ల ఏ వయస్సులో పెళ్ళి చేసుకుంటే మంచిదో అదే వయస్సులో చేసుకున్నాను. 'ఏ వయస్సుకి ఆ ముచ్చట' అంటారు కదా! అలా అన్నమాట. సినిమాలు వదిలినందుకు ఎప్పుడూ బాధపడలేదు అంతకు మించి మంచి కుటుంబాన్ని ఆ భగవంతుడు నాకు ఇచ్చాడు.

**మీరు పనిచేసిన సీనియర్ నటీమణుల గురించి....**

ఇప్పటి వారి కన్నా అప్పటి వారు చాలా తెలివి కలవాళ్ళేకాదు. ఎంతో నాలెడ్జ్ ఉన్న వాళ్ళు కూడా! ఊర్వశిగారికి తెలియని విషయం అంటూ ఉండదేమో అనిపిస్తుంది. నా వయస్సులో ఆవిడ కనీసం వంద సినిమాలు చేసి ఉంటారు. అన్ని సినిమాలు చేయడం మామూలు విషయం కాదు కదా! భానుప్రియగారు డ్యాన్సులో అందెవేసిన చెయ్యి. అప్పుడూ, ఇప్పుడూ డ్యాన్సులో ఆవిడని మించిన వారు లేరేమో! శరణ్యగారు యాక్టింగ్ స్కూల్‌తో పాటు టైలరింగ్ ఇనిస్టిట్యూట్‌ని రన్ చేస్తున్నారు. ఆమె ఇద్దరు కూతుళ్ళు బాగా చదువుకున్నారు. ఇప్పుడు చెప్పిన వారందరూ ఒకప్పుడు హీరోయిన్‌గా చేసినవారే! ఇప్పటికీ వారిని గుర్తుంచుకుంటున్నామంటే వారు చేసిన సినిమాలే కారణం! నన్ను కూడా అలా గుర్తుపెట్టుకోవాలన్నదే నా కోరిక.

**హీరో విజయ్ సినిమా నుంచి తప్పుకోవడానికి కారణం?**

డేట్లు అడ్జస్ట్ కాక తప్పుకున్నాను. ఇదేదో కాజువల్‌గా తప్పించుకోవడానికి చెబుతున్న మాట కాదు. నిజంగానే డేట్లు కుదరలేదు. ఈ సినిమా కన్నా ముందు ఓ సినిమా ఒప్పుకున్నాను. అనుకోకుండా రెండు సినిమాల షూటింగ్‌లూ ఒకేసారి మొదలయ్యాయి. రెండింటిలో ఏది వదులుకోవాలో మొదట అర్థం కాలేదు. చివరికి విజయ్‌గారి సినిమా నుంచి బయటకు వచ్చేశాను ఇలా రావడానికి కారణం సూర్యగారు అని చాలామంది అన్నారు. అవేవీ నిజం కాదు. ముందే చెప్పాను కదా ఏ సినిమా చేయాలి? ఏది వదులుకోవాలి? అన్నది పూర్తిగా నా ఇష్టం. అందులో తను జోక్యం చేసుకోరు.

**సోషల్ మీడియాకు దూరంగా ఉండడానికి కారణం?**

సోషల్ మీడియా బాగా ప్రాచుర్యం పొందిన తరువాత వ్యక్తిగతంగా దాచుకోవలసినవి కూడా బహిర్గతం అవుతున్నాయి. అది నాకు ఇష్టం లేదు. అందుకే నేను వాటికి దూరంగా ఉంటాను. అయినా కూడా నా విషయాలు ఎప్పటికప్పుడు బయటకు వచ్చేస్తుంటాయి.

**సినిమాలతో ఇద్దరూ బిజీగా ఉన్నారు కదా? ఫ్యామిలీలైఫ్‌కి దూరం అవుతున్నామన్న బాధ లేదా?**

పిల్లలు స్కూలుకి వెళ్ళేంత వరకు సాధ్యమైనంత వరకూ వారితోనే ఉంటాను. వాళ్ళు వెళ్ళిన తరువాతే షూటింగ్‌లు పెట్టుకుంటూ ఉంటాను. సూర్య ఒక్కోసారి చాలా త్వరగా ఇంటికి వచ్చేస్తారు. ఆ సమయానికి దాదాపుగా నేనూ వచ్చేస్తాను. దాంతో ఫ్యామిలీకి దూరం అవుతున్నానన్న బాధ నాకేమీ లేదు.

**–స్పందన రెడ్డి**

# ఇంత ప్రయాణం ఉంటుందని అప్పుడు అనిపించలేదు

'ఉయ్యాల జంపాల' సినిమాతో తెలుగు పరిశ్రమకు పరిచయమైన నటుడు రాజ్ తరుణ్. ఆ వెంటనే 'సినిమా చూపిస్త మావ', 'కుమారి 21ఎఫ్' హిట్ కావడంతో హ్యాట్రిక్ హీరోగా పేరు తెచ్చుకున్నారు. ఆయన నటించిన 'అంధగాడు' ఇటీవల విడుదలైంది. అసలు సినిమాల్లోకి రావాలని ఎందుకనిపించింది? ఇప్పుడు లైఫ్ ఎలా ఉంది అనే విషయాల గురించి 'నవ్య'తో మాట్లాడారు రాజ్ తరుణ్. ఆ విశేషాలు...

## -రాజ్ తరుణ్

### సినిమాల మీద ఆసక్తి ఎలా కలిగింది?

చిన్నప్పటి నుంచి సినిమాలు చూసేవాణ్ణి. 'ఒక్కడు' చూశాక విపరీతమైన ఆసక్తి వచ్చేసింది. అంత లీనమై చూశాను. అప్పుడు నేను మూడో, నాలుగో చదువుతున్నాను. కానీ ఆ చిత్రం నా జీవితాన్ని మార్చేసిందని మాత్రం కచ్చితంగా చెప్పగలను.

### అంటే చిన్నప్పటి నుంచి తల్లిదండ్రులు సినిమాలకు తీసుకెళ్లేవారన్నమాట?

తీసుకెళ్లేవారు. కానీ 'ఒక్కడు'కు నన్ను ఒంటరిగా పంపించారు. మా డాడీ బ్యాంకులో పనిచేసేవారు. విశాఖపట్టణంలో వాళ్ల బ్యాంకు పక్కనే థియేటర్ ఉండేది. టిక్కెట్టు కొని లోపలికి పంపించి, షో అయిపోయే సమయానికి వచ్చి తీసుకెళ్లారు. నేను ఒక్కడినే వెళ్లి చూసిన తొలి చిత్రం కూడా అదే.

### సినిమాలు మానేయమని మీ అమ్మ పోరుపెట్టేవారు కాదా?

అబ్బే లేదండీ. అమ్మ హౌస్‌వైఫ్. నన్ను చాలా ఎంకరేజ్ చేసేవారు. ఇప్పుడు కూడా వాళ్లకు నేను చేస్తున్న సినిమాల గురించి బెంగ లేదు. అందుకే ఏ సినిమా చేస్తున్నావు? అని ఎప్పుడూ అడగలేదు. ఫోన్ చేయగానే 'తిన్నావా' అని అడుగుతారు. తల్లి కడుపు చూస్తుందని అంటారే ఆ మాట నిజమనిపిస్తుంటుంది.

### ఇంజనీరింగ్ డ్రాప్ అవుట్ అట కదా మీరు?

అవునండీ. మా నాన్న అక్కయ్యగారి కొడుకు... అంటే మా బావ హైదరాబాద్‌లో ఇల్లు కొనుక్కుంటే గృహప్రవేశం కోసం హైదరాబాద్‌కి వచ్చాను. ఆ రోజే నిర్మాత రామ్మోహన్ గారిని వెళ్లి కలిశాను. అంతకు ముందే ఫేస్‌బుక్‌లో ఆయన

పరిచయం అయ్యారు. షార్ట్ ఫిల్మ్స్ గురించి చాలా చెప్పేవాడిని. నేరుగా వెళ్లి కలిశాక 'రేపు వచ్చి జాయిన్ అయిపో' అన్నారు. వెంటనే మా డాడీకి ఫోన్ చేసి 'జాయినై పొమ్మంటున్నారు, ఇక ఇక్కడే ఉంటాను. చదువు మానేస్తా' అని అన్నా. 'బీటెక్ ఫస్టియర్ అయిపోవచ్చింది కదరా.. ఈ వన్ ఇయర్ వేస్ట్ అయిపోతుందేమో ఆలోచించు' అని డాడీ అన్నారు. 'కోర్సు పూర్తి చేస్తే ఇంకో మూడేళ్లు వేస్ట్ అయిపోతాయి డాడీ.. నాకు ఇంజనీరింగ్ సర్టిఫికెట్ అసలు ఎందుకూ పనికిరాదు' అని చెప్పా.



### సినిమాల్లో హీరో కావాలనుకుని వచ్చారా?

రామ్మోహన్‌గారు కూడా నన్ను చూడగానే 'యాక్టింగ్ ఇష్టమా? డైరెక్షన్ ఇష్టమా?' అని అడిగారు. నేను డైరెక్షన్ ఇష్టమని చెప్పాను. అలాగే కానిమ్మన్నారు. సరేనని స్క్రిప్ట్ వర్క్ మొత్తం చేసేశాం. ఒక రోజు సాయంత్రం పిలిచి 'నటిస్తావా' అని అడిగారు. వెంటనే ఓకే చెప్పేశాను. అంతే. సులువుగా జరిగిపోయిందంతా. 'నన్ను నటించమని అడుగుతున్నారు. ఏమి చేయమంటారు?' అని నేను ఎవరినీ ప్రత్యేకించి సంప్రదించలేదు. అప్పటికే ఏడాదిన్నరగా ఆ స్క్రిప్ట్ మీద వర్క్ చేశాను. టూ మచ్‌గా ఇన్వాల్వ్ అయి ఉన్నాను. దాంతో నాకు ఇంకేదీ కొత్తగా అనిపించలేదు. రిలీజైన తర్వాత సిల్వర్ స్క్రీన్ మీద చూసుకున్నప్పుడు అర్థమైంది నాకు.

### ఏమని అర్థమైంది?

నేను చేసింది ఇంత పెద్ద పనా? 'హీరో అయిపోయానా' అని ఆశ్చర్యం వేసింది. హీరోగా ప్రయాణం మొదలైందని అర్థమైంది.

### మీకు డ్రీమ్ రోల్స్ ఉన్నాయా?

లేదండీ. ఎందుకంటే కథను ఎవరో ఎక్కడో రాస్తారు. నేను కూర్చోపెట్టి రాయించాలంటే అయ్యే పని కాదు. అందుకే నా దగ్గరికి వచ్చిన వాటిలో ఏది ఎగ్జయిటింగ్‌గా అనిపిస్తే అదే చేస్తున్నాను.

### హీరో అయ్యాక జిమ్‌కి వెళ్తున్నారా?

(నవ్వుతూ) ఇంట్లో జిమ్ ఏర్పాటు చేసుకున్నా. కానీ ఇప్పుడు అది బట్టలు ఆరేసుకోవడానికి పనికొస్తోంది. ఏ రోజుకు ఆ రోజు జిమ్ చేయాలనుకుంటాను. కుదరట్లేదు. త్వరలోనే దానికి ముహూర్తం పెడతాను. ప్రతిరోజూ ఉదయం 7 గంటల నుంచి రాత్రి 9.30 వరకు షూటింగ్స్ ఉంటూనే ఉంటాయి. రాత్రి ఇంటికి వెళ్లి కూర్చుని ఎక్సర్‌సైజ్‌లు చేయాలంటే ఓపిక ఉండట్లేదు. ఇకమీదట బలవంతంగానైనా చేయాలి.

### వైజాగ్‌లో ఉన్నప్పటికీ, ఇప్పటికీ తేడా తెలుస్తోందా?

చాలా తెలుస్తోంది. మరీముఖ్యంగా ట్రాఫిక్ విషయంలో. మనిషిగా అంటారా?... నేను ఎప్పుడూ ఒకే రకంగా ఉన్నాను. వైజాగ్‌లో 'కుక్కని కొనుక్కుందాం అమ్మా' అంటే 'నువ్వు ఉన్నావ్ కదరా' అనేవారు. కానీ ఇప్పుడు నేను స్వేచ్ఛగా కుక్కలను పెంచుకుంటున్నాను. నా దగ్గర 13 కుక్కలున్నాయి.

### మీ ఇంట్లోవారు మీ సినిమాలు చూస్తుంటారా?

'ఉయ్యాల జంపాల'ను వైజాగ్‌లో చూశారు. నా సినిమా ఏది విడుదలైనా నా ఫ్రెండ్స్ మొత్తం కలిసి గాజువాకలో ఓ థియేటర్ అంతా బుక్ చేసుకుంటారు. వాళ్లతో పాటు మా అమ్మానాన్నలు సినిమాలు చూసేస్తారు. 'ఉయ్యాల జంపాల' చూసి 'బావుందిరా బాగా చేశావ్' అన్నారు. నా గురించి నాతో ఎప్పుడూ వాళ్లు చెప్పరు. నా ఫ్రెండ్స్‌తో మాత్రం గంటల తరబడి చెబుతుంటారు. అదే మా తాతగారు, మామ్మగారయితే గంట సేపు ఫోన్లో మాట్లాడారు.

### మీరు తీసిన మొదటి షార్ట్ ఫిల్మ్ ఏది?

'ఐ' అని చేశా. అందులో నేను ఒక్కడినే ఉంటా. ఏదో ఇంగ్లీష్ సినిమా చూస్తే అందులో సూసైడ్స్ గురించి ఉంది. అదే కాన్సెప్ట్‌ను ఏడెనిమిది నిమిషాల పాటు వచ్చేలా రాసుకుని తెరకెక్కించాను. అప్పుడు నేను ఎనిమిదో తరగతి చదువుతున్నా. తక్కువ నిడివితో తీస్తే షార్ట్ ఫిల్మ్ అని అంటారని కూడా తెలియదు. మా ఇంట్లో డిజిటల్ కెమెరా ఉంటే స్టూల్‌మీద ఓ తలగడ పెట్టి, దాని మీద ఓ పుస్తకం, కెమెరా పెట్టి తెరకెక్కించా. దానికి ఎడిటింగ్, డబ్బింగ్ అంతా నేనే. కొరల్ వీడియోలో ఎడిటింగ్ చేసి, ఫ్రాంటెక్ మైక్‌తో డబ్బింగ్ చెప్పేశా. నాకేమో మొదటినుంచి గూగుల్‌లో కెలకడం ఇష్టం. ఇష్టంగా సర్ఫ్ చేస్తే చాలా విషయాలు తెలుస్తుంటాయి.

### 'అంధగాడు'లో చూపులేని వ్యక్తిగా నటించారు కదా? ఇబ్బంది అనిపించలేదా?

ఎలాంటి ఇబ్బంది అనిపించలేదు. చాలా ఈజీగా చేసేశాను. అసలు మొదటి నలభై నిమిషాలు మాత్రమే చూపులేని వ్యక్తిగా కనిపిస్తాను.

## ఇంటర్వ్యూ

### నిఖిల్ మీకు మంచి స్నేహితుడంటారు కదా! తనతో సినిమా చేసే ఉద్దేశం ఉందా?

ఎవరో అనడం కాదు. నిఖిల్ నాకు మంచి స్నేహితుడు. తనతో సినిమా చేయాలని నాకూ ఉంది. కానీ సరైన కథ దొరకలేదు. దొరికితే తప్పకుండా ఇద్దరం ఒక సినిమా చేస్తాం.

### సినిమాల కారణంగా పర్సనల్ లైఫ్ మిస్ అవుతున్నారా?

ఇక్కడ మీకు ఓ సంగతి చెప్పాలి. నాకు పర్సనల్ లైఫంటూ ఏదీ లేదు. సినిమాలే నా జీవితం. సినిమాలు లేకపోతేనే నాకు బోర్ కొడుతుంది. ప్రతిరోజూ షూటింగ్ ఉండాలని కోరుకునే వ్యక్తుల్లో నేనూ ఒకడిని.

### చేయబోతున్న సినిమాలు?

ప్రస్తుతం 'రాజుగాడు యమ డేంజర్' సినిమా చేస్తున్నాను. దీని తరువాత క్లెప్టోమేనియా (తెలియకుండా దొంగతనాలు చేయడం) కాన్సెప్ట్ మీద ఓ సినిమా చేయబోతున్నాను. వీటి తరువాత అన్నపూర్ణా బ్యానర్‌లో, దిల్‌రాజుగారి బ్యానర్‌లో చేయబోతున్నాను.

### కథల్ని ఎలా ఎంచుకుంటారు?

ఎవరు కథ చెప్పినా వింటాను. నచ్చితే వెంటనే ఓకే చెబుతాను. చిన్నా పెద్దా అన్న తేడా అస్సలు పాటించను. కథల ఎంపిక మాత్రం పూర్తిగా నాదే!

-డా.చల్లా భాగ్యలక్ష్మి

# ఇవన్నీ నిజాలే!

## వాటే గ్రేట్ రైటర్

- ప్రముఖ ఆంగ్ల రచయిత పి.జి.ఉడ్‌హౌస్ 59 ఏళ్ళ తన రచనా వ్యాసంగ చరిత్రలో జీవ్స్ అనే ఒకే ఒక్క హాస్య పాత్రను పదకొండు నవలల్లో, 35కు పైగా కథల్లో ఉపయోగించుకున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో మరణించిన ఇంగ్లాండ్ వెస్ట్ మిడ్లాండ్‌లోని వార్విక్‌షైర్ కౌంటీకి చెందిన క్రికెటర్ పెర్సీ జీవ్స్ పేరులోంచే ఉడ్‌హౌస్ పాత్ర పేరు పుట్టింది. మన అప్పుల అప్పారావు పాత్రకూడా అందులోంచి వచ్చిందేనట!
- వరల్డ్ మోస్ట్ పాపులర్ బెవరేజ్ ఏదో తెలుసా? టీ! ప్రపంచ వ్యాప్తంగా ప్రతిరోజూ మూడు బిలియన్ కప్పులు అంటే 300 కోట్ల కప్పుల టీ, జనం తాగేస్తున్నారు.
- నీకు నువ్వే యజమానివి. నీ భవిష్యత్తు నువ్వే నిర్మించుకో

–గౌతమబుద్ధుడు

- పాండిచ్చేరి–పుదుచ్చేరి ఒకటే. ప్రాచీనకాలంలో దీనిని వాలికొండా పురం అని పిలిచేవారు.
- ఎమిరేట్స్ సంప్రదాయ క్రీడ ఫాల్కనీ. అంటే కుందేళ్ళు, పక్షులవేటకు గద్దల్ని పెంచి శిక్షణ ఇవ్వడం. ఈ క్రీడ దుబాయ్ సంస్కృతిలో ఒక భాగం.
- నేరస్థుల్ని పట్టుకోవడంలో జాగిలాల పాత్ర మనదేశంలో 1941లో ప్రారంభమైంది.
- ఆదిమకాలంలో మనిషికుండే తెలియని భయం ఆధునిక కాలంలో నిరుద్యోగ భీతిరూపంలో కొనసాగుతోంది

–ఇంగ్లీష్ ఆర్థికవేత్త బార్బరా వార్డ్

## వాటే ఛేంజ్!

- ఓడ్కా అలవాటువల్ల రష్యాలో ఉత్పాదకత దెబ్బతింటోందని సాక్షాత్తూ అధ్యక్షుడు పుతిన్ ఒకప్పుడు ఆవేదన చెందారు. కానీ ఇప్పుడు ప్రతి ముగ్గురు రష్యన్లలో ఒకరు ఆల్కహాల్ సేవించడంలేదని Levada Centre అధ్యయనంలో వెల్లడైంది.

## పాంపే

- పురాతన రోమన్ నగరం పాంపే. రెండువేల ఏళ్ళ క్రితం అగ్నిపర్వతం బద్దలై ఆరేడు మీటర్ల లోతున సమాధి అయిపోయింది. పదివేలమంది మరణించినట్టు అంచనా.
- పాంపే సమాధులలో దొరికిన మృతదేహాలపై శాస్త్రవేత్తలు ఇప్పటికీ పరిశోధనలు చేస్తున్నారు. ఆ నగరంలో ఆనాడే గ్రూప్ సెక్స్ ఉన్నట్టు పరిశోధకులు కనుగొన్నారు.
- ఇటలీలోని పాంపే 250 ఏళ్ళుగా ప్రసిద్ధ టూరిస్టు ప్రాంతం. ఏటా పాతిక లక్షల మంది అక్కడ పర్యటిస్తారు.
- క్రీస్తుపూర్వం 8000 సంవత్సరాల తొలినాళ్ళలోనే సుమేరియన్ నాగరికత పౌరులు పులియబెట్టే ప్రక్రియను తెలుసుకున్నారు.
- రసాయనశాస్త్ర పితామహుడు అబుమూసాజబీర్. క్రీస్తుశకం 800 కాలంనాటి అరబ్ ఆల్కెమిస్టు ఇతడు. ఈ ఆల్‌సూఫీ సిద్ధుణ్ణి అల్ హరానీ అని కూడా అంటారు

–డాక్టర్ ఆళ్ళ అప్పారావు

–చిన్నారి

# సుధామ పదగారడి-318

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | | 2 | | 3 | | 4 | ❖ |
| 5 | | ❖ | | ❖ | | ❖ | 6 | 7 |
| | ❖ | 8 | ❖ | 9 | | 10 | ❖ | |
| | ❖ | | ❖ | | ❖ | | ❖ | |
| ❖ | 11 | | | ❖ | 12 | | | ❖ |
| 13 | ❖ | 15 | ❖ | 14 | ❖ | | ❖ | 15 |
| | ❖ | 16 | 17 | | ❖ | | ❖ | |
| 18 | | ❖ | | ❖ | 19 | ❖ | 20 | |
| ❖ | ❖ | 21 | | | | | ❖ | ❖ |

### ఆధారాలు

**అడ్డం**

1. తండ్రి అండ, మరోలా చెప్పండి (7)
5. మేలు (2)
6. సత్యం సుందరం మధ్య (2)
11. సంతోషము, పట్టుదల, బలము, ప్రయత్నము (3)
12. ముదము (3)
16. పూర్వము (3)
18. జనకుడు (2)
20. నాన్న అనే అర్థం (2)
21. చిన్నప్పటి నీతి కథలో కుందేలు, తాబేలు వేసుకున్నది (5)

**నిలువు**

1. నాగుపాము (2)
2. ఆపేక్ష, మమకారం, ప్రేమము (2)
3. పన్నెండు అడ్డమే యథావిధిగా (3)
4. దీనికన్నా వాసి ముఖ్యం! (2)
5. బరువు తోడిది, సంబంధము (3)
7. నమస్కారము (3)
8. జనులాపుత్రుని కనుగొని పొగడగ... తండ్రికి కలిగేది (5)
9. కాంతి (2)
10. ఇంట్లో అమ్మయో, నాన్నయో కొట్టినందుకు కాదు దీనికే పారిపోయే పిల్లలున్నారు (5)
13. అంగీకారం (3)
14. మత్తు (2)
15. మునుపు తండ్రిని కూడా ఇలా పిలిచేవారున్నారు (3)
17. ఫాలము (3)
19. ఆగ్రహం (2)

### పదగారడి-317 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | టు | 2 కు | లు | ❖ | 3 చి | 4 తు | కు | 5 లు |
| నృ | ❖ | మ్ము | ❖ | 6 స | ❖ | షా | ❖ | క |
| 7 త | మ్ము | డు | ❖ | మ్మ | ❖ | 8 ర | సా | లు |
| ము | ❖ | ❖ | 9 గు | ట | స్వా | హా | ❖ | క |
| ❖ | 10 కుం | 11 క | ❖ | ❖ | ❖ | 12 రం | పె | ❖ |
| 13 భా | ❖ | 14 పి | ద్యా | 15 ల | యం | ❖ | ❖ | 16 స |
| 17 వి | ర | సం | ❖ | వ | ❖ | 18 క | డ | వ |
| త | ❖ | గ | ❖ | ణం | ❖ | వా | ❖ | రా |
| 19 రం | గ | మం | చ్ | ❖ | 20 మే | తు | కు | లు |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

